The Trenches
(Telugu)

# కందక సంకేతాలు

## (భవిష్యత్తులో త్రిదేశ పరిపాలన)

మూలం

సాదిఖ్ హుసైన్ సిద్దీఖీ సర్ధన్వీ

అనువాదం

యం.డి. ఉస్మాన్‌ఖాన్

# కందకసంకేతాలు

## (భవిష్యత్తులో త్రిదేశ పరిపాలన)

ఉదయభానుడు తన సహస్రకాంతి కిరణాలతో చీకట్లను చీల్చివేస్తూ వెలుగు రేఖలను వెదజల్లడానికి తూరుపుదిక్కున సకల సన్నాహాలు చేస్తున్నాడు. చిటారు కొమ్మల్లో నక్కికూర్చున్న పక్షులు రెక్కలు టపటపలాడిస్తూ తమ తమ గూళ్ళ నుండి ఎగిరిపోవడానికి ఆయత్త పడుతున్నాయి. పూర్తిగా తెల్లవారక ముందే ఆ పక్షులతోపాటు రీహానా కూడా ఎక్కడికో బయలుదేరడానికి సిద్ధమయింది.

"ఎక్కడి కెళుతున్నావమ్మా?" ఆప్యాయంగా అడిగాడు బనూఖురైజా తెగకు చెందిన ప్రముఖ యూదనాయకుడు కాబ్ బిన్ అసద్.

"తోటకెళుతున్నా నాన్నా!" అన్నది రీహానా ముక్తసరిగా.

"ఇంకా సూర్యోదయమన్నా కాలేదు. అప్పుడే ఎందుకమ్మా ఇంత తొందరా? కాస్త పొద్దెక్కిన తరువాత వెళ్ళొచ్చుగదా?" అన్నాడు కాబ్

"వన విహారానికి ఇదే మంచి సమయం నాన్నా! మరీ పొద్దెక్కితే సూర్యుడు తనవేడి కిరణాలతో శరీరంమీద చురకలు వేస్తాడు. ఇప్పుడైతేనే చల్లగా వీస్తున్న ఈ పిల్లతెమ్మెరలకు వనవిహవారం ఆనందంగా, ఆహ్లాదకరంగా ఉంటుంది". అన్నది రీహానా అద్దం ముందు కూర్చొని మేకప్ చేసుకుంటూ.

"సరేగాని చూడమ్మా! ముస్లింలు మంచి వాళ్ళుకారు. మహాచెడ్డ వాళ్ళు ఏ తుంటరి వెధవన్నా నిన్ను ఏదైనా అనడంగాని, అల్లరి పెట్టడంగాని చేశాడనుకో ఇక యుద్ధమేమరి. అంచేత కాస్త జాగ్రత్తగా మసలుకో." హెచ్చరించాడు కాబ్.

"కాని ముస్లింలు మీరన్నట్లు చెడ్డవాళ్ళు కారు నాన్నా! చాలా మంచివాళ్ళు దైవభక్తిపరులు. స్త్రీలను అల్లరిపెట్టడం మాట అటుంచి వారివైపు కనీసం కన్నెత్తి కూడా చూడరు. అసలు మన వాళ్ళే పరమ పోకిరీలు, దుర్మార్గులు. చూసిన ప్రతి స్త్రీనీ ఏదో ఒకటి అని అల్లరిపెడతారు. సిగ్గూ ఎగ్గూ లేకుండా ప్రవర్తిస్తారు." అన్నది రీహానా వెనక్కి తిరిగి.

"ఏమోనమ్మా ! ముస్లింలు నీకు మంచివాళ్ళుగా ఎలా కనబడుతున్నారో ఏమో గాని, నా దృష్టిలో మాత్రం వాళ్ళే అందరికంటే పరమ దుర్మార్గులు" అన్నాడు కాబ్ కూతురి వైపు కాస్తంత ఆశ్చర్యంగా చూస్తూ .

"నాకింత వరకూ ముస్లిముల్లో ఎలాంటి చెడూ కనబడలేదు. వాళ్ళెంతో మంచి వాళ్ళు, సదాచారసంపన్నులు. అటువంటివారిని మీ రెందుకు ఇంతగా ద్వేషిస్తున్నారో నాకర్థం కావడంలేదు".

" వాళ్ళలో చెడు కాకపోతే మంచి ఏముందనీ? ఒక పిచ్చివాణ్ణి పట్టుకొని అతని వెనుక గుడ్డిగా నడుస్తున్నారు. అంతకంటే చెడు ఇంకేంకావాలో చెప్పు."

"మక్కా ఖురైషీయులకు ఇదొక ఊతపదమైపోయింది. ముహమ్మద్ (సఅసం) పిచ్చివాడు ఎంతమాత్రం కాదు. ఆయన్ని మీరు చూశారుగా, ఆయన మాటలు కూడా విన్నారు. న్యాయంగా చెప్పండి నాన్నా! ఆయన మాటలు పిచ్చోడి మాటల్లా ఉన్నాయా మీకు?"

"సరే ముహమ్మద్ పిచ్చోడు కాకపోతే మాంత్రికుడన్నా అయి ఉండాలి. ఎందు కంటే పచ్చినెత్తురు తాగాలన్నంత ఆగ్రహంతో అతని దగ్గరికెళ్ళిన శత్రువులు సైతం అతడ్ని చూడగానే పిల్లుల్లా మారిపోయి అతనికి ఊడిగం చెయ్యడానికి సిద్ధమవు తున్నారు. ఇదంతా ఏమిటి చెప్పుమరి" అన్నాడు కాబ్ చివరి వాక్యం గట్టిగా నొక్కిచెబుతూ.

"అది మంత్రంకాదు నాన్నా! మంచిదనం ఆయనలో ఉన్న నీతి, నిజాయితీ లను కాదనడానికి ఆధారాలేమున్నాయి? అందుకని ఆయన చెప్పే విషయాలను శత్రువులు కూడా తప్పకుండా అంగీకరించవలసి వస్తోంది".

"అమ్మా! నువ్వింకా చిన్నపిల్లవు పెద్దపెద్ద మాటలు అర్థం చేసుకోలేవు. అతను ఏదో మంత్రం ద్వారానే తన మాట నెగ్గించుకుంటున్నాడు. అతని మీద, అతని అనుచరుల మీద నాకున్న విరోధానికి రెండు కారణాలున్నాయి. ఒకటి దైవప్రవక్త

అసలు మన జాతిలో ప్రభవించాలి. కాని వేరే జాతిలో పుట్టిన ఆవ్యక్తి తననుతాను దైవప్రవక్తగా ప్రకటించుకున్నాడు. రెండవది, అతను, అతని అనుచరులు మదీనాకు పాలకులవుతున్నారు. పాలనాధికారానికి అసలు అబ్దుల్లా బిన్ ఉబైను నిర్ణయిం చడం జరిగింది. కాని ఆ దుర్మార్గుడు కూడా ముస్లిం అయిపోయాడు.

"ఆ తరువాత అధికారపీఠం అలంకరించాల్సినవాణ్ణి నేనే. కాని ముహమ్మద్ (సఅసం) ఒక ఒప్పందం ప్రతిపాదించాడు. దాని ప్రకారం వాళ్ళు, మనం పరస్పరం స్నేహంగా ఉండాలి. ముస్లింల శత్రువులను మనం కూడా శత్రువులు గానే పరిగణించాలి. ఎవరైనా మదీనాపై దండెత్తితే అందరం కలిసి వారిని ఎదిరించాలి. ఇదే ఆ ఒప్పందం. ముహమ్మద్ వేసిన మంత్రం నాపై కూడా ప్రభావాన్ని చూపింది. అన్నీ తెలిసి, ఆలోచించి అర్థం చేసుకొనే శక్తి ఉండి కూడా గత్యంతరంలేక ఒప్పందంపై సంతకం పెట్టాల్సివచ్చింది" అన్నాడు కాబ్ మనసులోని ద్వేషాన్ని బయటపెట్టుకుంటూ.

"నిజమే మరి, న్యాయమైన షరతులతో కూడిన ఒప్పందం కాబట్టి తిరస్కరించే ఆస్కారం లేక కిమ్మనకుండా సంతకం పెట్టాల్సి వచ్చింది." చురక వేసినట్లు మాట్లాడింది రీహానా.

" అదేంకాదు. ఆ ఒప్పందంలో మనకూ ఆమోదయోగ్యమైన కొన్ని విషయాలు ఉండబట్టే నేను సంతకం పెట్టాను. అయితే అవకాశం దొరికినప్పుడు మాత్రం ఒప్పందం పత్రాన్ని చించిపారేస్తాను."

" అంటే...? ఒప్పందాన్ని అతిక్రమిస్తారన్నమాట! చేసుకున్న ఒప్పందాన్ని ఉల్లఘించడం న్యాయమేనంటారా?" సూటిగా అడిగింది రీహానా,

"కాలానికనుగుణంగా మనం మారాలి, తల్లీ! ఒప్పందాలూ, ఒడియాలూ అని పట్టుక్కూచుంటే పని నడవదు, ఎప్పుడు ఏ పనిలో మనకు లాభం ఉంటుందో అప్పుడు ఆ పని చెయ్యాలి. ముస్లింలకు మన మీద నమ్మకం కలగాలి కాబట్టి అప్పుడు ఆ ఒప్పందంపై సంతకం పెట్టాను. మన అవసరాలు తీరిపొయ్యాక దాన్ని ఉల్లఘించడానికి నేను వెనుకాడను. అదే మన రాజనీతి." కాబ్ తన జాతి స్వభావాన్ని వివరించాడు.

"అంటే రాజకీయ నాయకులు స్వార్థపరులు, విశ్వాసఘాతకులు, వంచకులన్న మాట!" అన్నది రీహనా ఆశ్చర్యపోతూ.

"పిచ్చి తల్లీ! రాజకీయలు నాయకులనబడే వాళ్ళు నూటికి తొంబై తొమ్మిది మంది ఇలాంటి వాళ్ళేనమ్మా" అంటూ తన రాజనీతి నిజస్వరూపాన్ని బయట పెట్టాడు కాబ్.

"కాని మన మతం అబద్ధమాడే అనుమతి ఇవ్వడం లేదుగా?"

చూడమ్మా! మతానికి, రాజకీయాలకూ సంబంధంలేదు. మతం వేరు రాజకీయం వేరు."

"సంబంధం లేకపోయినా అబద్ధం, మోసం, దగా, వంచన ఇవన్నీ పాపాలు గదా?" అడిగింది రీహానా విషయం అర్థంగాక.

"ప్రతి విషయాన్ని మతం దృష్టితో చూసే నీకు ఈ మాటలు అర్థంకావు. అదొక రాజకీయ రహస్యం. ఆ రహస్యం రాజకీయం నాయకులకే బాగా తెలుసు. నువ్వు మాటాల్లో సమయాన్ని ఎందుకు వృధా చేస్తావు. ప్రొద్దెక్కుతోంది త్వరగా వెళ్ళిరా" అన్నాడు కాబ్ విషయాన్ని పక్కదారి పట్టిస్తూ.

"నేను వెళుతుంటే మీరేగా మాటల్లోకి దించారు" అంది రీహానా బుంగమూతి పెట్టుకొని.

"సరేనమ్మా! వెళ్ళి త్వరగా వచ్చెయ్"

"వెళతాగాని నాన్నా! నేనొక మాట అడుగుతాను చెబుతారా?"

"ఏంటమ్మా అది! అడుగు చెప్తాను"

"మరి మీరెక్కడికి వెళ్ళడానికి ఇంత ఉదయాన్నే బయలుదేరుతున్నారు?"

ఓహో..అదా! ఈరోజు నాకోసం ఓ మనిషి వస్తున్నాడు. అందుకే బయలుదేరా."

"ఎవరా మనిషి?"

"ఎవరో నాక్కూడా ఇంత వరకు తెలియదు."

"మీ కోసం ఎవరొచ్చేదీ మీకు తెలియదా? ఇది కూడా రాజకీయమే అనుకుంటా"అన్నది రీహానా నవ్వుతూ.

"నీతో నేను రాజకీయాలు మాట్లాడతానా?"

" అయితే అతనెవరో చెప్పండి"

నేను చెప్తున్నది నిజమేనమ్మా నిజంగా అతన్ని గురించి నాకసలు తెలియదు."

"ఆశ్చర్యంగా ఉందే! మీకతన్ని గురించి ఏమీ తెలియదన్నమాట. ఇంతకూ ఆయన వస్తున్నట్లు సమాచారం మీకెలా అందింది?"

"మన మత గురువు చెప్పాడు. అతనిప్పుడు నా కోసం ఎదురుచూస్తూ ఉంటాడు"

"ఇప్పుడు మీరు ఎక్కడికెళతారు?"

"గురువు ఎక్కడికి తీసుకెళితే అక్కడికి."

"మరి మీరు ఆయన్ని అడగలేదా, వచ్చే మనిషి ఎవరూ, ఏమిటని?"

"అడక్కేం. అడిగాను. రేపు తెలుస్తుందిగా, కంగారెందుకూ అన్నాడు."

"సరే ఇక మీరు వెళ్ళిరండి. నాకాలస్యం అవుతోంది. నేను వెళ్ళొస్తా. మాటల్లో పడి చాలా ఆలస్యమైపోయింది." అన్నది రీహానా

"తొందరగా వచ్చెయ్యి ఆలస్యం చెయ్యకు".

"అలాగే నాన్న! పొద్దెక్కితే నాక్కూడా అక్కడ ఉండబుద్ధికాదు. " అంటూ తండ్రి దగ్గర సెలవుతీసుకొని ఒయ్యారంగా ఒంటెక్కి వెళ్ళిపోయింది రీహానా.

కాబ్ బిన్ అసద్ ఇంటి నుండి బయలుదేరి నేరుగా దేవాలయానికి వెళ్ళాడు. తాను అమితంగా గౌరవించే గురువు తన కోసం నిరీక్షిస్తూ ఉండడం చూసి దూరం నుండి అతనికి నమస్కరించాడు కాబ్.

"కాబ్! ఏమిటి ఇంత ఆలస్యం చేశావు? నేను చాలా సేపట్నుంచి నీకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను" అన్నాడు మతగురువు.

"నేను చాలాపెందలాడే బయల్దేరాను. కాని అమ్మాయి రీహానా మాటల్లో దించింది. ఆమాటా, ఈ మాటా మాట్లాడే సరికి ఆలస్యమైపోయింది. ఆ..........ఇక చెప్పండి ఎవరొచ్చారు నా కోసం ఏమిటి సంగతి."

"కాస్త ఆగు నీకే తెలుస్తుంది."

"అంటే? అతనిక్కడే ఉన్నాడా?"

"ఇక్కడలేడు. ఇక్కడికి రాడు కూడా."

"మరి మన మెక్కడికైనా వెళ్ళాలా?"

"ఎంతో దూరం లేదులే. ఖైబర్‌కు వెళ్ళేదారినే కొంచెం దూరం నడవాల్సి ఉంటుంది. ఇదుగో ఇతన్ని పంపించి రెండు గుర్రాలు తెప్పించాను." అని ఓ మనిషిని పురమాయించాడు మత గురువు.

ఆ మనిషి కాబ్ గుర్రపుశాలకు వెళ్ళి రెండు గుర్రాలకు జీను బిగించి తీసుకొచ్చాడు. ఇద్దరూ ప్రయాణమై ఉత్తరదిశగా వెళ్ళి పోయారు.

మదీనా నగరం కొండల మధ్య ఉంది. వీరిద్దరూ కొండ ఎక్కినడిచి ఓ కనుమ దాటి ఒక ఎత్తైన గుట్ట మీదికి చేరుకున్నారు. వీరి కోసమే అక్కడ ఎదురుచూస్తున్న ఓ యూదుడు పరిగెత్తుకుంటూ వచ్చి మత గురువు అంగ వస్త్రాన్ని ముద్దాడాడు. ఇద్దరూ గుర్రాలు దిగి ఓ రాతి పై కూర్చున్నారు. యూదుడు వారిద్దరికీ నమస్కరించి ఎదురుగా కూర్చున్నాడు.

"అరే... నువ్వు నయిమ్‌వి కదూ? బనూనజీర్ తెగవాడివి కదూ? అన్నాడు కాబ్ ఎదురుగా కూర్చున్న వ్యక్తిని గుర్తుపట్టి.

"అవును. నేను బనూనజీర్‌కు చెందిన నయిమ్‌నే మీరు బాగా గుర్తుపట్టారే."

"నువ్వు సిరియాలో ఉంటున్నావా. లేక ఖైబర్‌లోనా? "అడిగాడు కాబ్.

"ఖైబర్‌లోనే ఉంటున్నాను. ఇప్పుడు అక్కడి నుండే వచ్చాను".

"హుయ్యైబిన్ అఖ్తర్ బాగున్నాడా?"

"బాగానే ఉన్నాడు. కాని దేశ బహిష్కారం వల్ల తీవ్రమైన మనస్తాపానికి గురై ఉన్నాడు".

"అయ్యో! అతను చాలా మంచి వాడు. గౌరవ మర్యాదలు కలవారు ఇటువంటి విషయాలను సహించలేరు. ఆ విషయం నాక్కూడా తెలిసింది. అయినా అతనికి నేనేమీ సహాయం చెయ్యలేకపోయాను" అంటూ మథన పడ్డాడు కాబ్.

బనూనజీర్ తెగ లోగడ మదీనాలోనే ఉండేది. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) మదీనాలో, దాని పరిసర ప్రాంతాలోఉండే యూదులతో, బహుదైవా రాధకులతో ఒప్పందం కుదుర్చుకున్నారు. కాని బనూనజీర్ తెగ నాయకులు దైవప్రవక్తను హత్యచేయడానికి కుట్రపన్నారు. ఈ సంగతి తెలుసుకున్న దైవప్రక్త(సఅసం)

ఒప్పందాన్ని ఉల్లంఘించి మాయోపాయాలతో తనను హతమార్చడానికి కుట్రపన్నిన బనూనజీర్ తెగ యూదులను మదీనా నుండి బహిష్కరించారు. పది రోజుల్లోగా మదీనా విడిచి వెళ్ళిపోవాలని, లేకపోతే తీవ్రపరిణామాలు ఎదుర్కోవలసి వస్తుందని ఆయన హెచ్చరించారు.

కాని బనూనజీర్ తెగ ఈ హెచ్చరికను పెడచెవిన పెట్టి దైవప్రవక్తతో తలపడ డానికే నిశ్చయించుకుంది. అప్పుడు దైవప్రవక్త తన సైన్యంతో ఆ తెగపై దాడిచేశారు. ఫలితంగా బనూనజీర్ తెగవాళ్ళు లొంగిపోయి ముస్లింలకు ఆయుధాలు అప్ప గించి, కొంతమంది ఖైబర్‌కు, మరికొంతమంది సిరియాకు వెళ్ళిపోయారు, అలా బహిష్కరించబడిన వారిలో హుయ్యిబిన్ అఖ్తబ్ ఒకడు.

"హుయ్యి నన్ను మీవద్దకు పంపాడు"చెప్పాడు నయీం.

"దేనికి?"

"మీరు ముహమ్మద్ (సఅసం)తో కుదుర్చుకున్న ఒప్పందాన్ని పాటిస్తున్నారా, లేదా తెలుసుకోవడం కోసం."

"అక్షరాలా పాటిస్తున్నాం. మాకు ఆ ఒప్పందాన్ని పాటించడం తప్ప మరో మార్గం లేదు."

"ఎందుకనీ?"

"ముస్లింలను ఎదుర్కోలేము కాబట్టి."

"హుయ్యి మక్కావెళ్ళాడు. ఖురైషీయులను మదీనాపై దాడికి ప్రోత్సహించి ఏకాభిప్రాయం సాధించడానికి."

"కాని లాభం ఏమిటి? మక్కా ఖురైషీయులు సకల హంగులతో ఓ పెద్ద సైన్యం తీసుకొని బద్ర్ యుద్ధంలో పాల్గొన్నారు. కాని ఏం జరిగింది. వారు చిత్తు చిత్తుగా ఓడిపోయి పలాయనం చిత్తగించారు." అన్నాడు కాబ్.

"అప్పుడు ఓడిపోయామనే బాధ ఖురైషీయులకు బాగా ఉంది. వారు చాలా ఆగ్రహంతో ఉన్నారు అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. ఈసారి ముస్లింలపై ఒక్క ఖురైషీయులే కాదు. అరబ్బుల్లోని గొప్ప గొప్ప తెగలు, యూదులు అందరూ కలసి మూకుమ్మడిగా దాడి చేస్తారు."వివరించాడు నయీం.

"నిజంగా ఇలా జరిగితే ముస్లింలు తుడిచి పెట్టుకుపోతారు. ముహమ్మద్ అంతమైపోతాడు.(దైవం క్షమించుగాక) మన బాధలన్నీ దూరమవుతాయి. సమస్యలన్నీ పరిష్కారమవుతాయి." కసిగా అన్నాడు కాబ్.

"హుయ్యి అదే ప్రయత్నంలో ఉన్నాడు. అందుకే అతను మక్కా వెళ్ళాడు. ఇక్కడ్నుంచి ఇతర ప్రాంతాలు పర్యటించి విరోధం ఉన్న తెగలన్నిటిని ఏకం చేయడానికి కృషి చేస్తున్నాడు.

"ఇంతకూ హుయ్యి మా నుండి ఏం కోరుతున్నాడు?" అడిగాడు కాబ్."

"ఈ సంకీర్ణ సైన్యంలో మీరు కూడా చేరి మదీనాపై కలసికట్టుగా దాడి చెయ్యడానికి పూర్తిగా సహకరించాలనేదే అతని కోరిక."

"హుయ్యి ఆయా తెగలను సమీకరించడంలో ఎంతవరకు సఫలమవుతాడో, దానిపై నా నిర్ణయం ఆధారపడి ఉంటుంది. ఆయన్ని నన్నొకసారి రహస్యంగా కలుసుకోమని చెప్పు."

"ఆయన తప్పకుండా మిమ్మల్ని కలుసుకుంటాడు. మీరు ఈలోగా యుద్ధానికి తగిన ఏర్పాట్లు చేస్తూ ఉండండి." అన్నాడు నయీం.

"మా తెగ అన్ని ఏర్పాట్లూ చేసుకుంటుంది. మీరు నిశ్చింతగా ఉండండి."

"ఇక వెళ్ళొస్తా మరి."

"ఎటు? ఖైబర్ వెళ్ళిపోతావా?" అడిగాడు కాబ్.

"కాదు. మక్కా వెళతా."

నయీం వాళ్ళ దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయ్యాడు. కాబ్, అతని గురువు ఇద్దరూ గుర్రాలెక్కి ఇంటిదారి పట్టారు రీహానా ప్రయాణిస్తున్న ఒంటె బనూఖురైజా కోట దాటి ఇసుక ప్రదేశం వైపుకు సాగిపోతోంది. రాత్రంతా తుషార బిందువులతో నిండిపోయిన ఆ ఇసుక ఎడారిలో చల్లని పిల్ల తెమ్మెరలు మందహాసం చేస్తుంటే, రీహానా అనిర్వచనీయమైన ఆనందానుభూతుల ఊహల్లో తేలియాడుతూ ప్రయాణిస్తోంది.

అలా ఆ ఒంటె మదీనా వీధుల్లోకి ప్రవేశించేసరికి "రీహానా!" అంటూ ఓ మధుర మైన కంఠస్వరం వినిపించింది.

రీహానా పక్కకు తిరిగి చూసి ఆనందంతో పొంగిపోయింది.

"జూనా! ఇంత ప్రొద్దున్నే ఎక్కడి కెళుతున్నావు?"అడిగింది రీహానా.

"ఏం చెప్పమంటావు. ఇంట్లో ఏమీ తోచకపోతుంటే ఇలా బయలుదేరాను. ఎటు వెళుతున్నానో నాకే తెలియదు."చెప్పింది జూనా.

"సరే అయితే ఒంటెక్కు. అలా తోటకు వెళ్ళి కాసేపు విహరించి వద్దాం." అన్నది రీహానా ఒంటెను పగ్గంలాగి కూర్చోబెడ్తూ. జూనా ఒంటెక్కి, అంబారీలో రీహానా పక్కన కూర్చున్నది. ఆ తరువాత ఒంటె బయలుదేరింది. "రీహానా! నువ్వొక విషయం గమనించవా?"

"ఏమిటది?" ఆశ్చర్యంగా అడిగింది రీహానా.

"మన జాతివాళ్ళు, అరబ్ బహుదైవారాధకులు పరమ పోకిరీలు, ఆడది కన్పిస్తే చాలు అపాదమస్తకం తరచి తరచి చూస్తారు. కాని ఈ ముస్లింలు అలాంటి వాళ్ళుకాదు. వారి చూపులు ఎప్పుడైనా పరస్త్రీపై పడినా వెంటనే వారు తలవంచు కుంటారు."

"అవును జూనా! నువ్వు నిజం చెప్పావు. మన యూదులు, అరబ్ బహు దైవారాధకులు మనల్ని ఎలా కళ్ళు చించుకొని చూస్తున్నారో చూడు. ముస్లింలు మాత్రం ఏదో అలా ఓసారి చూసి చక చకా ముందుకు సాగిపోతారు."

ఇలా కబుర్లు చెప్పుకుంటూ తోటకు చేరుకునేసరికి అక్కడ వారికి ఒక కొత్త ఒంటె కనబడింది.అంతలో తోటమాలిగా పనిచేస్తున్న నౌకరు వచ్చి రీహానాకు నమస్కరించాడు వినయంగా.

"ఈ ఒంటె ఎవరిది? మన తోటలోకి ఎలా వచ్చింది?" కోపంగా ప్రశ్నించింది రీహానా.

"రాత్రి ఒక బాటసారి వచ్చాడమ్మా. తెల్లవారకముందే ఇక్కణ్నించి వెళ్ళి పోతానన్నాడు. కాని ఇంకా పడుకునే ఉన్నాడు" భయపడుతూ చెప్పాడు నౌకరు.

"అసలు నువ్వు అతణ్ని తోటలోకి ఎందుకు రానిచ్చావు? రానిచ్చినా రాత్రి ఇక్కడ ఉండడానికి ఎందుకనుమతించావు? " అంటూ మండి పడింది రీహానా.

"తప్పయిపోయింది. క్షమించండమ్మా!"

"ఈ విషయం నాన్నగారికి తెలిస్తే నిన్నేంచేస్తారో తెలుసా?'

"తప్పయిపోయిందమ్మా! దయచేసి నాన్నగారికి చెప్పకండి. చెబితే నన్నిక్కణ్నించి గెంటేస్తారు, శిక్షిస్తారు". ప్రాధేయపడ్డాడు నౌకరు.

"అది సరే, మరినువ్వు తెల్లవారగానే అతణ్ణి ఎందుకు మేల్కొలపలేదు?"

"మేల్కొలుపుదామని వెళ్లాను కాని అతను ఎంతో ఠీవిగా నిద్రిస్తున్నాడు. ఆ ఠీవి చూసి అతణ్ని మేల్కొలిపే సాహసం చెయ్యలేక పోయాను."

"అబ్బా....!ఏమిటో ఆ ఠీవి, పదవే మనమే అతణ్ని మేల్కొలుపుదాము" అంటూ రీహానా,జూనాను పిలుచుకొని ముందుకు నడిచింది. అక్కడ ఓ ఖర్జూరపు చెట్టుకు ఒంటె కట్టేసి ఉంది. అక్కడే ఉన్న పుష్ప వాటిక దగ్గరలో ఓ బాటసారి దుప్పటి పరచుకొని నిద్రపోతున్నాడు హాయిగా.

రీహానా, జూనా ఆ యువబాటసారి ఠీవిని, అందాన్ని చూసి ఆశ్చర్యచకితులై నిలబడిపోయారు. రీహానా తదేకంగా అతని ముఖం వైపే చూస్తోంది కన్నార్ప కుండా. రీహానా చూపుల్ని పసిగట్టిన జూనా ఆమెను మరింత ఉడికిస్తోంది. వీరి అలికిడికి బాటసారికి మెలకువ వచ్చింది.

రీహానా కోపం పటాపంచలైపోయి అప్రయత్నంగా ఆమె పెదవులపై చిరునవ్వు నాట్యమాడింది. అరబ్ బాటసారి దిగ్గునలేచి కూర్చొని అటూఇటూ చూస్తూ "అయ్యయ్యో! ఎంత పొద్దెక్కింది! ఫజర్ నమాజు సమయం దాటి పోయిందే". అన్నాడు ఆందోళనగా.

" అరె.. నమాజు సమయం దాటిపోతేనే ఇంతబాధా?" అన్నది రీహానా ప్రార్థన ప్రాముఖ్యతను తేలిగ్గా కొట్టిపారేస్తూ.

"సమయానికి నమాజు చేయకుండా ఏమరపాటులో పడి నిద్రించడం బాధాకరమైన విషయంకాదా? ఇంతకంటే విచారకరమైన విషయం మరొకటి లేదు మా దృష్టిలో."

"అయితే మీరు ముస్లిం అన్నమాట. ఎక్కడి నుండి వస్తున్నారు?"

"మక్కానుండి వస్తున్నాను"

"మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?"

"ఆ.....తప్పకుండా నాపేరు సుహైల్. మరి మీ పేరో?"

"చెబుతాను, ముందు మీరు నమాజు చేసుకోండి."

నమాజు ముగిసిన తరువాత అతను వెళ్ళిపోవడానికి సిద్ధమయ్యాడు.

"ఏమిటి? అప్పుడే వెళ్ళి పోతారా?"

"అవును".

"పేరైనా తెలుసుకోకుండానే?"

"చెప్పండి" అన్నాడు తలవంచుకొని.

"నా పేరు రీహానా."

"బాగుంది. ఇకవెళ్ళొస్తా మరి,సెలవు" అంటూ బాటసారి వెళ్ళబోయాడు.

"ఆగండి...అల్పాహారమైనా తీసుకోకుండానే ఎలా వెళ్తారు?"

"నా దగ్గర అన్నం ఉంది".

"అది తరువాత పనికొస్తుంది" అన్నది రీహానా ఓరగా చూస్తూ.

"అయినా నాకిప్పుడు ఆకలిగా లేదు. మదీనా వెళ్ళి తింటాను."

"ఒక బాటసారి మన తోటలోకి వచ్చికూడా ఏమీ తినకుండా వెళ్ళాడని మా నాన్న కాబ్‌కు తెలిస్తే బాధపడతారు".

"అంటే...మీరు కాబ్ బిన్ అసద్ కుమార్తెవా?" ఆశ్చర్యంగా అడిగాడు అరబ్ యువకుడు.

"అవును."అంటూ తలూపింది రీహానా.

"మీ నాన్న ముస్లింలకు వ్యతిరేకంగా మక్కా బహుదైవరాధకులతో కలిసి కుట్రు పన్నుతున్నాడని తెలిసింది."

"చెప్పుడు మాటలన్నీ నిజమే ననుకోవడం పొరపాటు." రీహానాకు తన తండ్రి గురించి తెలిసినా ఎంతో తెలివిగా ఏమీ తెలియనట్లు మాట్లాడింది.

"నేనన్నది నిజమోకాదో మదీనా వెళితే అన్నీ తెలుస్తాయి."

"అది సరే మరి భోజనం?"

"ఆకలిగా లేదు".

"పోనీ ఇంకాసేపుండి వెళ్ళకూడదూ? బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నది రీహానా.

"ఇంకాసేపుంటే బాగా ఎండెక్కేలా ఉంది. ఇప్పుడీ చల్లటి వాతావరణంలోనే వెళ్ళిపోతా. ఇక సెలవు". అంటూ రీహానా మాటల్ని సున్నితంగా తిరస్కరించి మదీనా వైపు వెళ్ళిపోయాడు బాటసారి.

రీహానా చేసేదేమీలేక అతను వెళ్ళిన వైపే నిశ్చేష్టురాలై శిలాప్రతిమలా చూస్తూ నిలబడిపోయింది.

"వెళ్ళిపోయాడే ఇంకే చూస్తావు!" ఉడికించిది జూనా. జూనా అన్న ఈ చిలిపి మాటలకు ఈ లోకంలో కొచ్చింది రీహానా. తరువాత అందాలభామ లిద్దరూ ఓ వేడినిట్టూర్పు విడిచి ఒంటె ఎక్కి ఇంటికి తిరుగుముఖం పట్టారు.

నయీమ్ మదీనానుండి బయలు దేరి మక్కా చేరుకున్నాడు. హుయ్యి బిన్ అఖ్తబ్ అబూసుష్యాన్ ఇంట అతిథిగా ఉన్నాడని తెలుసుకొని నేరుగా అక్కడికే వెళ్ళాడు ఏకాంతంగా కూర్చొని ఏదో ఆలోచిస్తున్న హుయ్యికు నమస్కరించాడు నయీం.

"అప్పుడే వచ్చేశావా నయీం" అన్నాడు హుయ్యి ఆలోచనల నుండి తేరుకొని. ఆశ్చర్యపోతూ.

"అవును వెళ్ళిన పని చూసుకొని వెంటనే వచ్చేశాను."

" చాలా మంచి పనిచేశావు. కాబ్‌ను కలుసుకున్నావా?"

"అతనే రహస్యంగా ఊరి వెలుపలి కొచ్చి నన్ను కలుసుకున్నాడు."

"ఏమన్నాడతను?" ఆత్రుతగా అడిగాడు హుయ్యి.

"తప్పకుండా మనకు సహకరిస్తానని వాగ్దానం చేశాడు. మిమ్మల్ని ఈ పర్యటన తరువాత రహస్యంగా వచ్చి తనోసారి కలుసుకోమని కూడా చెప్పాడు."

"మీరిక్కడి కొచ్చి ఎన్ని రోజులైంది"?

"నేనొచ్చి మూడు రోజులైంది."

"మీరు నాకంటే ముందు బయల్దేరారు కదా, ఆలస్యమైందేమిటి?"

"అవును ముందే బయల్దేరాను, కాని మార్గమధ్యలో ఉన్న తెగలన్నీ పర్యటిస్తూ ఇక్కడికి చేరుకునే సరికి ఆలస్యమైంది."

"పర్యటన విజయవంతమై నట్టేనా?"

"నూటికి నూరుపాళ్ళు విజయవంతమై నట్లే. బనూవాయిల్ తెగనాయకులు హుద్ బిన్ ఖైస్, అబూ అమ్మార్‌లు వాగ్దానం చేయడమే కాకుండా స్వయంగా నా వెంట బయల్దేరి వచ్చారు కూడా!"

"మరి ఖురైష్ తెగవారు ఏమన్నారు?"

"వాళ్ళలో కూడా ఉత్సాహం ఉద్రేకాలు జనించాయి. మక్కా చుట్టుపక్కల తెగల దగ్గరకు దౌత్యవేత్తలను పంపి వారి నాయకులను పిలిపించాం. ఖురైష్ తెగ అగ్రనాయకులు, ఈ ఉద్యమంతో ఏకీభవించే వివిధ తెగలకు చెందిన నాయకుల సమావేశం రేపు జరుగుతుంది. ఆ సమావేశంలో అన్ని విషయాలూ చర్చించి ఒక నిర్ణయం తీసుకోవడం జరుగుతుంది."

"అయితే మనం ఖచ్చితంగా ముస్లింలపై ప్రతీకారం తీర్చుకోగల మన్నమాట" అన్నాడు నయీం గర్వంగా.

"మన వాళ్లలోనే కాదు. యూదుల్లో, బహుదైవారాధకుల్లో కూడా మంచి ఉత్సాహం జనించింది. వారి హృదయాల్లో ప్రతీకారజ్వాల రగులకొంది. మన ఈ సమిష్టి దాడివల్ల ముస్లింలు సర్వనాశనం అవడమే కాకుండా, వారి ధర్మం కూడా ఈ దెబ్బతో పూర్తిగా తుడిచిపెట్టుకు పోతుంది." అన్నాడు హుయ్యి.

"నిజంగా ఇలా జరిగితే , నేను ఓ ఎత్తయిన పర్వతమెక్కి.........ఏరీ ముస్లింలు, ఎక్కడున్నాడు వాళ్ళ ప్రవక్త? అని గొంతెత్తి అరుస్తాను. దీనికి ఎటు నుండి సమాధానం రాదుగదా! అప్పుడు నేను ద్రోహులు అంతమైపొయ్యారు. కల్లోలం సమసిపోయింది. ఆహా.....! ఈ రోజు ఎంత మంచిరోజు అని బిగ్గరగా అరుస్తాను." అంటూ నయీం సంతోషంతో తననుతాను మరిచి కేకలు వేశాడు.

"ఆ శుభదినం కోసమే నేనూ ఎదురుచూస్తున్నాను. అది మరెంతో దూరం

లేదు. త్వరలోనే రానుంది. సరే నువ్వు ఒంటెను అబూసుఫ్యాన్ నౌకరుకు అప్పగించిరా, తీరిగ్గా మాట్లాడుకుందాం.

"ఓ....? ఈ సంతోషంలో పడి ఒంటెను కూడా మరిచిపోయాను. ఒక్క ఒంటెనే కాదు. అసలు నన్నునేనే మర్చిపోయాను." అన్నాడు నయీం సంతోషం నుండి తేరుకొని. తరువాత నయీం ఒంటెను అబూసుఫ్యాన్ నౌకరుకు అప్పగించి, హుయ్యి ఉన్న చోటనే బసచేశాడు. రెండో రోజు ఉదయం ఖురైష్ తెగనాయకులు, ఇతర తెగల నాయకులు కాబాగృహంలో సమావేశమయ్యారు. హుయ్యి బిన్ అఖ్తబ్ తన వెంట వచ్చిన బనూవాయిల్ తెగనాయకులు హుద్ బిన్ ఖైస్, అబూఅమ్మార్‌లను తీసుకొని అక్కడికి చేరుకున్నాడు. బనూనజీర్ తెగ నుండి కూడా ఆ తెగనాయకులు సలాం బిన్ అబీహబీబ్, అస్లం ప్రముఖులు హాజరయ్యారు. ఖురైష్ తెగనుండి ప్రముఖ నాయకులు అబూసుఫ్యాన్ బిన్ హరబ్, ఖాలిద్ బిన్ వలీద్, ఉమర్ బిన్ అల్‌ఆస్, ఇక్రమ బిన్ అబూజహల్, ఉమర్ బిన్ అబ్రూద్, జరార్ బిన్ ఖత్తాబ్, అజీరా, నౌఫిల్‌లు హాజరయ్యారు. అప్పట్లో ఖురైష్ తెగ మొత్తానికి అబూసుఫ్యాన్ తిరుగులేని నాయకుడిగా చెలామణి అవుతున్నాడు. సమావేశంలో అబూసుఫ్యాన్ ప్రారంభోపన్యాసం చేస్తూ ఇలా అన్నాడు:

"మిత్రులారా!బనూహాషిం తెగకు చెందిన ముహమ్మద్ అనే యువకుడు ఓ కొత్త మతాన్ని స్థాపించి ఎటువంటి కల్లోలాన్ని రేకెత్తించాడో, దానివల్ల దేశంలో ఎలాంటి అశాంతి, అలజడులు చెలరేగాయో మీకందరికి తెలుసు. అతని మాటల్లో ఉన్న ప్రభావం. ఆకర్షణ ఏమిటో గాని అవి బాణాల్లా దూసుకుపోయి ప్రజల మనసుల్లో నాటుకుంటున్నాయి. ఎవరైనా అతనితో కాసేపు మాట్లాడితే చాలు, అతని మాటల మాయజాలంలో చిక్కుకొని ఇట్టే ముగ్ధులైపోతున్నారు. అతను తనను తాను దైవప్రవక్తగా ప్రకటించుకొని మన ఆరాధ్యదైవాలను మిథ్యాదేవుళ్ళుగా పరిగణించాడు. ఫలితంగా పెద్ద ఉపద్రవం ముంచుకొచ్చే ప్రమాదం ఏర్పడింది. అయినా మన జాతి ఎంతో సహనం, సంయమనాలతో వ్యవహరించింది. ఎందుకంటే. ముహమ్మద్ బిన్ అబ్దుల్లా జన్మించిన బనూహాషిం తెగ ఖురైష్ తెగలన్నిట్లో గౌరవనీయమైన తెగగా పరిగణించబడేది. ప్రజలు ఈ తెగను అమితంగా గౌరవించేవారు. అందుకని ముహమ్మద్‌ను అంతం చేస్తే ప్రజా విప్లవం పెల్లుబుకుతుంది. అంతేకాదు అంతర్‌కలహాల పరంపర ప్రారంభమై అరేబియా

భూభాగమంతా హింసాగ్ని జ్వాలలు అంటుకొనే ప్రమాదముంది. కాబట్టి మహమ్మద్ (సఅసం) ను అష్టకష్టాలు పెట్టి ఇక్కడి నుండి తరిమి వెయ్యడం జరిగింది గాని. అతణ్ని అంతమొందించే ప్రయత్నం మాత్రం జరగలేదు. అతనూ, అతని అనుచరులూ మనం పెట్టే కష్టాలను భరించలేక మదీనాకు పారిపొయ్యారు. దాంతో పీడ విరగడయిందని మన మంతా సంతోషించాం. కాని మదీనా వెళ్ళిన తరువాత వాళ్ళు మరింత బలం పుంజుకున్నారు. ఉడుకు నెత్తురు ఉరకలేసే మన యువకులు కొంతమంది ముస్లింల శక్తిని అంచనావేయకుండా వారి పంట పొలాలపై దాడి చేసి ఊరుకున్న వాళ్ళను ఉసిగొలిపారు. దీంతో వాళ్ళు రెచ్చిపోయి. వ్యాపారం కోసం సిరియా వెళ్ళిన మన వర్తకులపై దాడి చెయ్యాలని నిశ్చయించుకున్నారు. దాని ప్రకారం వాళ్ళు నా పర్యవేక్షణలో సిరియా నుండి వస్తున్న మా బృందంపై దాడి చెయ్యాడానికి ప్రయత్నించారు. కాని నేను చాకచక్యంగా ఆ దాడి నుండి నా బృందాన్ని రక్షించగలిగాను. అప్పటికే సిరియా నుండి వస్తున్న వ్యాపార బృందాల రక్షణ కోసం బయలుదేరిన కొంత సైన్యం బద్ర్ ప్రాంతంలో ముస్లింలతో తలపడింది. యుద్ధంలో గొప్ప గొప్ప నాయకులు హతమయ్యారు. మృత్యువాత బడని ఒక్క కుటుంబమూ మక్కాలో మనకు కనిపించదు. అప్పటి నుండి మనందరి గుండెల్లో ప్రతీకార జ్వాలలు రగులుతూనే ఉన్నాయి. ఇప్పుడు అదృష్టవశాత్తూ యూదతెగలు, మదీనా, దాని పరిసర ప్రాంతాల ప్రజలు ముస్లింలకు వ్యతిరేకంగా కత్తిగట్టి ఓ మహాద్యమాన్ని చేపట్టారు. ఈ లక్ష్య సాధనలో మనల్ని కూడా భాగస్వాములు చెయ్యాలనే సదుద్దేశాంతో హుయ్యి బిన్ అఖ్తబ్, ఇంకా ఇతర తెగలకు చెందిన ప్రముఖ నాయకులు నేడిక్కడికి విచ్చేశారు. వారు మీ ముందు కొన్ని విషయాలు ఉంచదలుచుకున్నారు. కాబట్టి మీరంతా నిశ్శబ్ధంగా కూర్చొని, వారు చెప్పే విషయాలను శ్రద్ధగా వింటారని ఆశిస్తున్నాను".

అబూ సుఫ్యాన్ తన ప్రసంగాన్ని ముగించాడు. తరువాత హుయ్యి బిన్ అఖ్తబ్ లేచి నిలబడి ఇలా అన్నాడు:

"ఖురైష్ తెగ మిత్రులారా! చాలా విషయాలు ఇంతకుముందే అబూసుఫ్యాన్ గారు మీ ముందుంచారు. అయినప్పటికి నేను కూడా మరికొన్ని విషయాలు మీముందుంచి మీ బాధ్యతను గుర్తు చేయాలను కుంటున్నాను. మీ పట్టణంలో లేచిన ఉపద్రవం ఇప్పుడు మా పట్టణానికి విస్తరించింది. అబ్దుల్లా కొడుకు ముహమ్మద్ ఒక కొత్త మతానికి పునాది వేసి, తనను తాను దైవప్రవక్తగా ప్రకటిం

చుకున్నాడు. దేవుడు ఒక్కడే అనే అతని నినాదం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అయినా ఆ నినాదాన్ని మీరూ, మేము తిరస్కరించలేక పోయాం. చివరికి క్రైస్తవులు కూడా అతనితో చేరిపోయారు. దాంతో అతను మరో అడుగు ముందు కేసి మీ దేవతలను విగ్రహాలను విమర్శించాడు."

హుయ్యి తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఇలా అన్నాడు:

"మేము హజ్రత్ ఉజైర్‌ను దేవుని కొడుకు అంటాము. క్రైస్తవులు ఏసుక్రీస్తును దేవుని కుమారుడు అంటారు. అందుకని మమ్మల్ని బహుదైవారాధకులు అన్నాడు అంతేకాదు మీరు, మేము పూజించే దేవత విగ్రహాలు మలమల మాడే అగ్నికి ఆహుతి అవుతారని కూడా ప్రకటించాడు. ఈ అవమానాన్ని మేము సహించలేక పొయ్యాం. ఇంతటి పరుష పదజాలంతో మీ దేవతా విగ్రహాలను దూషిస్తుంటే మీరెలా సహించగలిగారో అర్థం కావడం లేదు. ఈ సృష్టి, సృష్టిలోని ప్రతి వస్తువును సృష్టించిన మీ దేవతలు మంటల్లో మలమలమాడి పోతారనడం, కాలిబూడిదై పోతారనడం ఎంతటి అవమానం! మీలో పౌరుషం ఏమైంది? మీ మతాభిమానం, ఆత్మాభిమానం ఏమయ్యాయి. మీ ఆరాధ్యదైవాలకు వ్యతిరేకంగా కారుకూతలు కూస్తుంటే చేతులు ముడుచుకొని ఎలా కూర్చో గలిగారు? నిజంగా మీకు మీ దేవతల పట్ల ప్రేమ, విశ్వాసమే ఉంటే వాళ్ళను అంతంచేసే వాళ్ళు. కాని మీరలా చెయ్యలేక పోయారు. ఆ ఉపద్రవాన్ని కేవలం ఇక్కణ్ణుంచి మా వైపుకు సాగ నంపారు. వారు మదీనాలో అడుగుపెట్టాక బలం పుంజుకొని మమ్మల్నే మదీనా నుండి బహిష్కరించారు. అదృష్టం బాగుండి ఇప్పుడు యూద తెగలకు, మదీనా పరిసర ప్రాంత అరబ్బులకు, ముహమ్మద్, అతని అనుచరుల పట్ల తీవ్రమైన శత్రుత్వం ఏర్పడింది. ముస్లింలకు వ్యతిరేకంగా అసూయాద్వేషాల తుఫాను చెలరేగింది. కాబట్టి ఈ సమయంలో మీరు మాతో సహకరిస్తే వారిని క్షణాల్లో అంతం చేస్తాము. ఈ విషయాలను మీతో చర్చించ డానికే నేను మీ వద్దకు వచ్చాను" అంటూ వారిని రెచ్చగొట్టూ తన ఉపన్యాసాన్ని ముగించాడు హుయ్యి.

హుయ్యి ప్రసంగానికి ఉత్తేజితులైన ప్రజలు "మేమంతా మీకు తప్పక సహకరిస్తాం" అంటూ ముక్త కంఠంతో కాబా గృహం ప్రతిధ్వనించేలా బిగ్గరగా అరిచారు.

"జాతి తీసుకున్న నకారాత్మక నిర్ణయానికి నా జేజేలు. ఈ కొత్త మతం పట్ల, దాన్ని విశ్వసించే వారిపట్ల మేము చాలా విసిగి వేసారి ఉన్నాము, అందుకని

వారికి వ్యతిరేకంగా మీరు చేపట్టిన ఉద్యమానికి సహకరించడం మా బాధ్యత, మా సహాయ సహకారాలు మీకు ఎల్ల వేళలా ఉంటాయి." అని హామి ఇచ్చాడు అబూసుఫ్యాన్ లేచి నిలబడి.

"ఇక మనం ఈ కల్లోలాన్ని నిస్సందేహంగా ఎదుర్కోగలం. ఈ కొత్త మతాన్ని. దాన్ని విశ్వసించే వారిని నామరూపాల్లేకుండా తుడిచి పెట్టగలం" అన్నాడు హుయ్యి కసిగా.

"హుయ్యి అన్నది ముమ్మాటికి నిజం. అలా తప్పక జరిగి తీరుతుంది, అసలా ఉపద్రవం మన పట్టణంలోనే పుట్టింది మనమే దాన్ని అణగదొక్క వలసింది. కాని మనం అలా చెయ్యకపోవడం వల్ల ఇప్పుడది ఇతర ప్రాంతాలకు కూడా విస్తరించి, వేళ్ళూనుకుంది. అయినా దాన్ని కూకటివేళ్ళతో పెకలించడానికి యూదులు, అరబ్బులు ఒక్క తాటిపై కొచ్చారు. ఇదెంతైనా హర్షణీయమైన పరిణామం. మనం పెద్ద ఎత్తున సైన్యాన్ని సమీకరించి వారికి సహకరించడానికి ఇది మంచి అవకాశం. హుయ్యి అన్నట్లు...మన ఈ ఉమ్మడి శక్తి వారిని నామ రూపాల్లేకుండా తుడిచిపెడుతుందనడంలో సందేహం లేదు.సైన్యాన్ని సమీక రించండి, విరాళాలు సేకరించండి. ఈ శుభకార్యంలో అందరూ మనస్ఫూర్తిగా సహకరించాలి" అంటూ ప్రోత్సహించాడు అబూ సుఫ్యాన్.

అబూ సుఫ్యాన్ ప్రసంగానికి ఉత్తేజితులైన ఖురైష్ ప్రజలు సమరోత్సహం తో తమ తమ శక్తి మేరకు విరాళాలు ఇవ్వడం, సైన్యాన్ని సమీకరించడం ప్రారంభించారు. ఖురైష్ దౌర్భాగ్యులు ఇస్లామ్‌కు, ముస్లింలకు వ్యతిరేకంగా శక్తి వంచన లేకుండా కృషి చేయడంలో లీనమైపొయ్యారు. ఆ కాలంలో ప్రజలు కవులను అమితంగా గౌరవించేవారు, వారి మాటకు ఎంతో విలువ, గౌరవం ఉండేవి. వారు ఎవరినైనా పొగుడుతూ గేయాలు రాస్తే ఇక ప్రజలు వారిని అమితంగా గౌరవించేవారు. వారి మాటకు ఎంతో విలువ, గౌరవం ఉండేవి. మరెవరికి వ్యతిరేకంగానైతే వారు గళం విప్పేవారో వారు ప్రజల దృష్టిలో నీచంగా చూడబడేవారు. ఒక యువతి అందవికారంగా ఉన్నప్పటకీ వారామెను ప్రశంసిస్తూ అందాల భామగా అభివర్ణిస్తే, ఇక ఆమె అందాల సుందరిగానే గుర్తించబడేది. మరో యువతి ఎంత అందగత్తె అయినా వారామెను అంద వికారంగా చిత్రిస్తే ఇక ఆ సుందరి ప్రజల దృష్టిలో నీచంగా చూడబడుతుంది. మొత్తంమీద ఆనాటి కవుల మాట వేదవాక్కుగా చెలామణి అయ్యేది. అందుకని విశ్వప్రభువు ఏ

కాలంలో ఏ కళ చెలామణిలో, ఆధిక్యతలో ఉండేదో ఆ కాలంలో తన ప్రవక్తలకు కూడా అదే విధమైనటువంటి కళను ప్రసాదించేవాడు. హజ్రత్ మూసా (అలైహిస్సలాం) కాలంలో చేతబడి అనే తాంత్రిక కళ చెలామణిలో ఉండేది. కాబట్టి మూసా ప్రవక్త చేతి కర్రకు ఓ అద్భుతమైన శక్తిని ప్రసాదించాడు విశ్వప్రభువు. మాంత్రికులు తమ తాంత్రిక విద్య ద్వారా చేసే చేతబడులన్నింటికి ఆ కర్ర ద్వారానే సమాధానం చెప్పడం జరిగేది. మూసా ప్రవక్త తన చేతిని చంకలో పెట్టి బయటికి తియ్యగానే అరచేతి నుండి వెలుగు కిరణాలు ప్రసరించేవి. దీన్ని చూసి ప్రజలు మంత్రముగ్ధులయ్యేవారు. హజ్రత్ ఈసా అలైహిస్సలాం కాలంలో భూతవైద్యం చెలామణిలో ఉండేది. అందుకని ఈసా ప్రవక్తకు పుట్టుగుడ్డివారిని, కుష్టు రోగుల్ని బాగుచేసే మహిమలు ప్రసాదించ బడ్డాయి.

అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) కాలంలో భాషాజ్ఞానం, వాక్చతురతల ప్రభావం అధికంగా ఉండేది. భాష విషయంలో అరబ్బులు ఇతరుల్ని మూగవారుగా భావించేవారు. అంటే తామె చక్కని భాష మాట్లాడగలమని, ఇతరులకు భాషా పరిజ్ఞానం లేదని, మాట్లాడడం చేతకాదని భావించేవారు. అందుకని అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు ఉత్కృష్టమైన భాషలో, విలక్షణమైన శైలిలో, సుమధురవాణి దివ్యఖుర్‌ఆన్ ప్రసాదించబడింది. దీనిలో ఉన్న నియమ నిబంధనల్లోగాని, వరుస క్రమంలో గాని ఎటువంటి తిరకాసు లేకుండా నేరుగా ప్రజల హృదయాల్లోకి చొచ్చుకుపోయేది. గొప్ప గొప్ప పండితులు, భాషా సంపన్నులు సైతం ఈ వాణిని విని ఆశ్చర్యపోయారు. మానవ విరచిత సకల లోపాలకు అతీతంగా ఉన్నటువంటి దైవవాణి ఇది అని వారు అంగీకరించారు. తమకు ఇష్టమైన వారికి అనుకూలంగా ప్రజలను మలచడం, ఇష్టంకాని వారికి వ్యతిరేకంగా వారి హృదయాల్లో చిచ్చు పెట్టడం ఆనాటి కవులకు వెన్నతోపెట్టిన విద్య. ముస్లింలకు వ్యతిరేకంగా వారు వ్రాసిన విషపూరిత గేయాలకు ప్రభావితులైన మక్కావాసులు ముస్లింలను నామరూపాల్లేకుండా తుడిచి పెట్టాలని కంకణం కట్టుకున్నారు. యుద్ధంలో పాల్గొనే శక్తిలేని వృద్ధులు పెద్ద మొత్తంలో విరాళాలిచ్చారు. మిగతావారు తమ తమ శక్తి మేరెకు విరాళాలు ఇవ్వడంతో పాటు యుద్ధంలో కూడా పాల్గొనడానికి పేర్లు నమోదు చేయించుకున్నారు. మక్కావాసుల ఈ ఉత్సాహం చూసి దాని చుట్టు పక్కల నివసించే తెగల్లో కూడా విద్వేషాగ్ని కీలలు అంటుకున్నాయి. వారు కూడా మక్కా వాసులకు సహకరించడానికి సిద్ధమయ్యారు.

అబూ సుఫ్యాన్ ఈ సువార్ణవకాశాన్ని చక్కగా వినియోగించుకుంటూ ముస్లిం లకు వ్యతిరేకంగా ప్రచారం చేయడానికి పేరుగాంచిన కొంతమంది కవుల్ని ఇతర ప్రాంతాలకు పంపాడు. ఆడి, పాడి ప్రజలను ఆకట్టుకోవడానికి నవయవ్వనంతో మిసమిసలాడే కొంతమంది నాట్యకత్తెలను కూడా వారి వెంట పంపాడు. వారు ఏ ప్రాంతానికి వెళ్ళినా అక్కడి ప్రజల్ని ముస్లింలకు వ్యతిరేకంగా ఉసిగొలిపి, మక్కావారికి సహకరించే విధంగా వారిని ప్రోత్సహించేవారు. ఈ విషప్రచార ప్రభావం వల్ల 'గర్దూనవాహ్' తెగలకు చెందిన అనేక మంది యోధులు ఎంపికై మక్కాకు రావడం ప్రారంభించారు. వారి రాకతో మక్కా వాసుల్లో నూతన ఉద్రేకోత్సాహాలు జనించాయి. ఖురైష్ తెగ, ఇంకా అనేక ఇతర తెగలు తమకు సహకరిస్తామని వాగ్దానం చేయడమే కాకుండా బద్ర్ యుద్ధ ప్రతీకారేచ్ఛతో ముస్లింలపై దాడి చెయ్యడానికి ఉవ్విళ్ళూరుతున్నారనే విషయం తెలుసుకొని హుయ్యి బిన్ అఖ్తబ్, అతని అనుచరులు చాలా సంతోషించారు. ఒక రోజు హుయ్యి తన అనుచరులతో

--------

"నేను నా తెలివి తేటల ద్వారా అజ్ఞానులైన అరబ్బుల్లో ఆరని అగ్నిజ్వాలలు రగిలించాను. వారా విద్వేషాగ్ని జ్వాలల్లో చిక్కుకొని మైత్రీ, బంధుత్వాలను సైతం వదలి ముస్లింలను తుడిచి పెడతామని ప్రతిజ్ఞ చేశారు. ఇక మనం తప్పకుండా వారిపై ప్రతీకారం తీర్చుకోగలం". అన్నాడు మీసం మెలేస్తూ.

"అప్పుడే మనం సంబరపడకూడదు. ఈ అరబ్బులు వట్టిమూర్ఖులు కాసేపట్లోనే కారాలు, మిరియాలు నూరుతారు. అంతలోనే చల్లబడిపోతారు. చిన్న చిన్న విషయాలను పట్టుకొని యుద్ధాలే చేస్తారు. కాసేపట్లోనే సంధికూడ కుదుర్చు కుంటారు. బద్ర్ యుద్ధంలో మీ నాయకులు అనేకమంది సంహరించ బడ్డారు గదా! మళ్ళీ ఇప్పుడు మీ సోదరులతోనే తలపడి రక్తాన్నెందుకు చిందిస్తారని ఎవరైనా సలహా ఇస్తే నిజమేగదా! అని చల్లబడిపోతారు. అందుకని ఇప్పుడే మనం ఖచ్చితంగా ఏదీ చెప్పలేం " అన్నాడు సలాం బిన్ అబీ హఖీబ్ కాస్త అనుమానంగా.

"అలా అనకండి! నా ఎత్తుగడ ఊరికే పోదు. నేనంటించిన ద్వేషాగ్ని జ్వాలలు అంత త్వరగా ఆరిపోవు అసలిక్కడ ముస్లింలు ఎక్కడున్నారనీ? ఉన్నా చాలా కొద్దిమంది మాత్రమే, అదీ బలహీనంగా ఉన్నారు. వారినోట్లో నాలుకే లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే అసలిక్కడ వారి ప్రభావం ఎంత మాత్రంలేదు. ఇక మిగతా వారంతా బహుదైవారాధకులు. వారు కూడా ముస్లింలపై కారాలు

మిరియాలు నూరుతున్నారు. వారి ఆరాధ్యదైవాలను ముస్లింలు అవమానిస్తున్నారనే భావం వారిని వేధిస్తోంది. అందుకని ముస్లింలపై వారి శత్రుత్వం సహజంగానే పెరిగింది" అన్నాడు హుయ్యి తనను తాను సమర్థించుకుంటూ......

"మీరన్నది నిజమే. అయితే మక్కా సైన్యంలో ఖురైష్ అగ్రనాయకులంతా చేరేలా మనం ప్రయత్నించాలి. వారు సైన్యంలో ఉండడం వల్ల రెండు ప్రయోజనాలు చేకూరుతాయి. ఒకటి, మొత్తం తెగల్లో అరబ్బులు తమ పూర్తి శక్తి యుక్తులతో పోరాడుతారు" అన్నాడు హూద్ బిన్ ఖైస్.

"మీ సూచన బాగుంది. మరి సైన్యంలో ఎవరెవరు పాల్గొనాలంటారు?"

" నేనిక్కడికి వచ్చిన దగ్గర్నుండి చూస్తున్నాను. ఖురైషియుల్లో తిరుగులేని నాయకులు కొంతమంది వున్నారు. అబూసుఫ్యాన్, ఆస్, జరార్ బిన్ ఖత్తాబ్, ఇక్రమ బిన్ అబూజహెల్. వీరు తప్పకుండా యుద్ధంలో పాల్గొనాలి".

"సరే నేనీ రోజే వారిని కలిసి యుద్ధంలో పాల్గొనేలా వారికి నచ్చజెపుతాను." అన్నాడు హుయ్యి.

"అయితే ఇక మనం గత్ఫాన్ తెగ దగ్గరక్కూడా వెళ్ళి వాళ్ళను కూడా ఈ యుద్ధంలో పాల్గొనేలా ప్రయత్నిస్తాను." అన్నాడు అబూఅమ్మారా.

"మీ ఆలోచన కూడా బాగుంది. గత్ఫాన్ తెగను గనక మనం ఒప్పించినట్లయితే, బనూఅసద్ తెగ కూడా మనకు తోడవుతుంది, ఈ రెండు తెగల ప్రభావం వల్ల బనూ సలీం తెగ కూడా మనకు సహకరిస్తుంది. ఈ విధంగా మక్కా నుండి మదీనా వరకు, మదీనా నుండి ఖైబర్ వరకు ఉన్న తెగలన్నీ మనకు తోడైమన విజయానికి ఎంతో దోహద పడ్తాయి. ఇక్కడి నుండి మనం నేరుగా గత్ఫాన్ తెగ దగ్గరికే వెళదాం" అన్నాడు హుయ్యి ఉత్సాహంగా.

వీరీ విధంగా తమకు లభించబోయే విజయం విషయంలో తెగలన్నీ తమకు సహకరిస్తే కొద్ది సంఖ్యలో ఉన్న ముస్లింలు ఎలాగూ తమను ఎదిరించలేరు కాబట్టి తప్పకుండా సంహకరిస్తారని భావిస్తున్నారు. ఈ విధంగా ఊహాలోకంలో విహరిస్తూ ఈ యూద నాయకులంతా సాయంత్రానికి కాబా గృహం చేరుకున్నారు. ఆ సమయంలో అక్కడే సమావేశమై ఉన్న ఖురైష్ అగ్రనాయకులు వీరికి ఘనంగా స్వాగతం పలికారు. హుయ్యి ఒకసారి వారందరి వైపు దృష్టి సారించి ఇలా అన్నాడు:

"ఖురైష్ మిత్రులారా! మీలో జనించిన ఈ ఉత్సాహం చూసి మాకెంతో ఆనం దంగా ఉంది. మీ దైవాలను వ్యతిరేకించేవాళ్లను మీరు తుదముట్టించ డానికి కంకణం కట్టుకోవడం హర్షణీయం. జాతి మీవెంట ఉంది. మీపై ఎన్నో ఆశలు పెట్టుకుంది. అందుకని జాతికి సహకరించవలసిన బాధ్యత కూడా మీపై ఉంది. కాబట్టి మీలోని అగ్రనాయకులంతా స్వయంగా బయలుదేరి సైన్యానికి నాయకత్వం వహిస్తూ రణరంగంలో పాల్గొనవలసి ఉంది."

అబూసుఫ్యాన్ ఈ మాటలు విని తీవ్రంగా స్పందించాడు.

"ఈ విషయం పైనే నిన్న మేమంతా సమావేశమై, యుద్ధంలో పాల్గొనాలనే నిర్ణయించుకున్నాం. బద్ర్, ఇంకా అనేక ఇతర ప్రదేశల్లో ముస్లింలతో జరిగిన యుద్ధాల్లో మా వీరులు అనేక మంది సంహరించబడ్డారు ఆ యుద్ధాల్లో మా వారు ఒక్కరైనా మరణించని కుటుంబం మక్కాలో ఒక్కటీ లేదు. అందరి హృదయాల్లో అగ్ని పర్వతాలు మండుతున్నాయి. ఈ అగ్ని కేవలం ముస్లింల రక్తంతోనే చల్లారుతుంది" అన్నాడతను ఆవేశంగా.

"అవును ఇప్పుడు ముస్లింలు మీ ముందున్నారు. మనసారా, కసితీరా వారి రక్తాన్ని చిందించండి. వారు రక్తపు మడుగుల్లా గిలగిలా కొట్టుకుంటుంటే.... ఏడీ మీ దేవుడు. మిమ్మల్ని ..... అని అడగండి. వారు తుదిశ్వాస విడిచాక...మా దేవత లను అవమానించేవారు, వారి అనుచరులు అంతమైపొయ్యారు. ఇక ఇప్పుడు మేము మా దేవతలే మిగిలి ఉన్నాము' అంటూ బిగ్గరగా నినాదాలు చెయ్యండి" అన్నాడు హుయ్యి వారిని ఇంకాస్త రెచ్చగొడుతూ.

"ఆ శుభదినం కోసమే మేమూ నిరీక్షిస్తున్నాం" అన్నాడు అబూసుఫ్యాన్ పళ్ళు నూరుతూ.

" ఆరోజు మరెంతో దూరం లేదు. మీ కలలు పండే ఆ శుభదినం దగ్గరి కొచ్చేసింది. మీరు నిశ్చింతగా ఉండండి. మేము బనూగత్ఫాన్ తెగ, ఇంకా ఇతర తెగల దగ్గరిక్కూడా వెళ్ళి వాళ్ళను కూడా యుద్ధానికి సిద్ధం చేస్తాము. అవకాశముంటే మదీనా బహుదైవారాధకులు, యూద సోదరులతో కూడా కలిసి మనతో సహకరించేలా ప్రోత్సహిస్తాము" అన్నాడు హుయ్యి.

ఆ తరువాత హుయ్యి, అతని అనుచరులు వారి వద్ద సెలవు తీసుకొని అక్క ఃణ్ణుండి వెళ్ళిపోయారు. హుయ్యి, అతని అనుచరులు ముస్లింలకు

వ్యతిరేకంగా మక్కాలో రాజేసిన ద్వేషాగ్ని కీలల్ని, మక్కా వాసులు తమ పరిసర ప్రాంతాలకు్కూడా అంటించారు. దీని వల్ల వారంతా ముస్లిములకు వ్యతిరేకంగా కరవాలాలు చేబూని కదనరంగంలో దూకడానికి సిద్ధమయ్యారు, తమ పాచిక పారినందుకు హుయ్యి, అతని అనుచరులు ఆనందోత్సాహాలతో అక్కడి నుండి బనూ గుత్ఫాన్ తెగ దగ్గరకు చేరుకున్నారు.

సూర్యుడు పగలల్లా పని చేసి తన గూటికి చేరుకునే ప్రయత్నం చేస్తున్నాడు. ఊరి వెలుపల అందంగా ఎదిగిన ఖర్జూర తోటలు పిల్ల గాలికి తలలూపుతూ వీరికి స్వాగతం పలుకుతున్నాయి. ఊరి ప్రజలు నీళ్ళ కోసం ఓ బావి దగ్గర గుమి గూడారు. కొంతమంది యువకులు బావి గోడెక్కి పెద్ద పెద్ద బక్కెట్లతో నీళ్ళు తోడి, అక్కడున్న స్త్రీలకు అందిస్తున్నారు. బావికి కాస్త దూరంగా ఓ అందాల యువతి నిలబడి ఉంది. అందరూ నీళ్ళందుకొని తమ తమ బిందెలు నింపుకుంటు న్నారు కాని ఆ యువతి మాత్రం అక్కడే నిలబడి చూస్తోంది. అందంగా ఉన్న అమ్మాయిలను చూస్తే అందరికి జాలేస్తుందట. అలాగే హుయ్యికు కూడా ఆ యువతిపై జాలివేసి, వారితో ఇలా అన్నాడు:

"పాపం ఈ అమ్మాయి చాలా సేపట్నించి అలాగే నిలబడి చూస్తోంది. మీరేమో అందరికి నీళ్ళు పోస్తున్నారు గాని, ఈ అమ్మాయికి మాత్రం ఎవరూ తోడివ్వడంలేదు. ఎందుకనీ? ఇది అన్యాయం కాదా? అన్నాడు జాలిగా. హుయ్యి మాటలకు ఆ యువకులు ఫక్కుననవ్వారు. దీంతో మనసు నొచ్చుకున్న హుయ్యి గుర్రం దిగి వడి వడిగా వారి దగ్గరకొచ్చి "గత్ఫాన్ తెగవాళ్ళు చాలా మంచివాళ్ళు, నిజాయితీపరులు, అన్యాయం చేసే వాళ్ళుకాదుగా"! అన్నాడు.

"మే మెవరికి అన్యాయం చెయ్యలేదే?" అన్నాడో యువకుడు కాస్త నొసలు చిట్లించి.

"పాపం ఆ అమ్మాయి చాలా సేపట్నించి అలాగే నిలబడి చూస్తోంది. ఎవరూ ఒక్క బక్కెట్టు నీళ్ళు కూడా పోయడం లేదు. ఇది అన్యాయం కాదా?" అన్నాడు హుయ్యి ఆ యువతి వైపు చూపిస్తూ. హుయ్యి మాటలకు ఆ యువతి ముసి ముసిగా నవ్వుకుంటోంది.

"ఈ అమ్మాయి ఎవరో మీకు తెలుసా? అన్నాడు మరో యువకుడు బావిలో నుంచి చేదను పైకి లాగుతూ.

"తెలియదు. ఇప్పుడే చూస్తున్నాను. ఇంతకూ ఎవరీ అమ్మాయి?"

"అందుకే మీరు మా పై అన్యాయంగా అభాండాలు వేస్తున్నారు. ఈ అమ్మాయి మా ప్రియతమ నాయకుని కుమార్తె. ఇతర స్త్రీలందరికి నీళ్ళు ఇప్పించనంత వరకూ ఈ అమ్మాయి స్వయంగా తన బిందె నింపుకోదు". అన్నాడా యువకుడు. దీంతో హుయ్యి పెద్దరికానికి కాస్త భంగం కలిగినట్లయింది. అనవసరంగా జోక్యం చేసుకున్నానే అనిపించిందతనికి. వెంటనే అతడు గుర్రాన్నెక్కి గత్‌ఫాన్ తెగనాయ కుని ఇంటికి వెళ్ళాడు. హుయ్యి ప్రముఖ యూద నాయకుడు, గొప్ప ధనవంతుడు కావడం వల్ల సహజంగానే ఘనంగానే స్వాగతం లభించింది. అదీగాక వీరిద్దరికి ముందు నుండే పరిచయం కూడా ఉంది.

హుయ్యి వచ్చిన సందర్భంగా గత్ఫాన్ తెగ నాయకుడు బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశాడు, మందు విందుతో పాటు అందమైన అమ్మాయిలతో నాట్యం కూడా ఏర్పాటు చేశాడు. రాత్రంతా మందు మత్తులో ఊగుతూ ఎక్కడి వారక్కడే పడిపొయ్యారు. మత్తు దిగిన తరువాత మెలకువ వచ్చింది. అప్పటికి బాగా తెల్లవారి బారెడు పొద్దెక్కింది. సూర్యకిరణాలు వేడిగా శరీరానికి తాకుతున్న కొద్దీ నీరసం ఎక్కువైపోతోంది. కాళ్ళు చేతులు వణుకుతున్నాయి. తలనొప్పి కూడా మొదలైంది. ఇక లాభం లేదనుకొని వారు మళ్ళీ తలా రెండు పెగ్గులు వేసుకున్నారు. అప్పటికి కాస్త తేరుకున్నారు. తరువాత వారంతా అల్పాహారం సేవించి తీరిగ్గా కూర్చున్నారు. గత్‌ఫాన్ తెగ నాయకుడు తల్హాతో పాటు ఆ తెగకు చెందిన ఇతర నాయకులు కూడా అక్కడే ఉన్నారప్పుడు. హుయ్యి వారినుద్దేశించి" నేనొక ముఖ్యమైన పనిమీద మీ దగ్గరికి కొచ్చాను" అన్నాడు.

"పెద్ద వారు, గౌరవనీయులు అయిన మిమ్మల్ని గత్‌ఫాన్ తెగకు తీసుకొచ్చిన ఆ పనేమిటో చెప్పండి" అన్నాడు నాయకుడు నవ్వుతూ.

"అసలు విషయం చెప్పే ముందు మీకు మరో విషయం స్పష్టం చెయ్యాలను కుంటున్నాను. నేను నా స్వప్రయోజనాల కోసం మీ వద్దకు రాలేదు. దేశ శ్రేయస్సు కోసం, జాతి సంక్షేమం కోసం మాత్రమే వచ్చాను. బహుశా మీకు తెలిసే ఉంటుంది. ఈనాడు దేశంలో తలెత్తిన కల్లోలం ఏమిటో" అన్నాడు హుయ్యి గంభీరంగా.

" కల్లోలమా? పట్టణాలకు బహుదూరంగా, మారుమూల ప్రాంతాల్లో నివసించే మాకు ఏం తెలుస్తుంది. ఏమిటా కల్లోలం?" అన్నాడు గతాఫాన్ నాయకుడు తల్హా ఆశ్చర్యంగా.

"మీకు తెలియనే తెలియదా? ఆశ్చర్యంగా ఉందే?" అన్నాడు హుయ్యి.

"లేదు, నిజంగా మాకేమీ తెలియదు."

"అయితే వినండి. బనూహాషిం తెగకు చెందిన ముహమ్మద్ అనే ఒక యువకుడు తనను తాను దైవప్రవక్తగా ప్రకటించుకొని, మన దేవతలను అవమానిస్తున్నాడు. అందుకే మాక్కా వాళ్ళు అతణ్ణి అక్కడి నుండి వెళ్ళగొట్టారు. ఇప్పుడతను అక్కడి నుండి పారిపోయి మదీనా చేరుకున్నాడు.

ఓహో....ఆయనా-? ఆయన్ని గురించి అయితే మాకు కొద్దిగాతెలుసు" అన్నాడు తల్హా.

"అయితే బహుశా అతనొక కొత్త మతాన్ని కూడా ప్రవేశపెట్టినట్లు తెలిసే ఉంటుంది."

"అది మామూలే గదా! ప్రతి దైవప్రవక్తా ఒక కొత్త మతాన్ని తీసుకొస్తాడు. అందులో వింతేముంది?"

"వింత కాదు...... అదే అసలు కల్లోలం. మీకు తెలియదేమోగాని, ఈ కల్లోలం. ఇప్పుడు దేశంలో బాగా ప్రబలిపోయింది. ఆ కొత్త మతంలో ప్రవేశించిన ప్రతి వ్యక్తి సంబంధాలు తెంచుకొని, బంధువుల్ని, స్నేహితుల్ని వదులుకుంటున్నాడు. ధర్మం కోసం ఎవరినీ ఏమాత్రం లక్ష్యపెట్టడం లేదు".

"అయితే మన కొచ్చిన నష్టం ఏమిటి? దాంతో మన కేమిటి సంబంధం?" అన్నాడు తల్హా సూటిగా.

"అదేమిటీ అలా అంటారు? మన దేవతలను దూషిస్తుంటే చేతులు ముడుచు కొని కూర్చోగలమా? ఈ ప్రమాదాన్ని ఆపే ప్రయత్నం చేయనవసరం లేదా?" అన్నాడు హుయ్యి.

"అదేమోగాని ఆయన్ని, ఆయన అనుచరుల్ని మక్కావాసులు రకరకాలుగా హింసించారని మాకు తెలిసంది. దాంతో వారు విసిగిపోయి మదీనాకు వలస పొయ్యారు. అక్కడ కూడా వారిని సుఖంగా ఉండనివ్వలేదు. వారిని హింసించడం,

వారిపై దాడులు చెయ్యడం ప్రారంభించారు. పిల్లిని గదిలో పెట్టి కొట్టాలని చూస్తే పులిలా విజృంభిస్తుందట. అలాగే వారు కూడ ఆత్మరక్షణ కోసం ఎదురుదాడులు ప్రారంభించారు. ఇందులో వాళ్ళతప్పేముంది?" అన్నాడు తల్హా ఆశ్చర్యంగా.

"సరే మీకు తెలిసిందే నిజమనుకుందాం. మరివాళ్ళు బనూనజీర్ తెగను బహిష్కరించి, మా ప్రాంతాలను ఆక్రమించుకున్నారు కదా? ఇదేమిటి?"

" మీరు ముహమ్మద్ ( సఅసం)ను అంతం చెయ్యాలని కుట్రపన్నారు. అయితే ఆయన మీ బారినుండి సురక్షితంగా తప్పించుకొని, మీరు చేసిన హత్యా ప్రయత్నం నేరానికి, మిమ్మల్ని బహిష్కరించాడు. అందులో తప్పే ముంది?" ఎదురు ప్రశ్నవేశాడు తల్హా తొణకకుండా.

హుయ్యికి చెళ్ళున చెంప మీద కొట్టినంత పనయింది. నోటమాట పెగల్లేదు. అయినా వెంటనే తేరుకొని విషయాన్నే పక్కదారి పట్టిస్తూ ఓ పాచిక వేశాడు.

"సరే అదలా ఉంచండి, మాకు జరిగిన నష్టమేదో జరిగిపోయింది. మీరన్నా జాగ్రత్తగా మసలుకోండి. రోజు రోజుకూ ఇస్లాం బాగా వ్యాప్తిచెంది పల్లెలకూ, పట్టణాలకూ విస్తరిస్తోంది. ముస్లిం శక్తి పెరిగిపోతోంది. పరిస్థితి ఇలాగే కొనసాగితే ఏదో ఒక రోజు అరేబియా మొత్తం వాళ్ళ పాదాక్రాంతమవుతుంది. మీ తెగ కూడ వాళ్ళ ఆధీనంలోకి వచ్చేస్తుంది. అప్పుడు మీరు వారికి బానిసలు కావలసి వస్తుంది." అన్నాడు హుయ్యి హెచ్చరించే ధోరణిలో.

"మా బొందిలో ప్రాణమున్నంత వరకూ ప్రపంచలోని ఏ శక్తి మమ్మల్ని బానిసలుగా చేసుకోజాలదు." అన్నాడు తల్హా ఆగ్రహంగా.

"ఆ పరిస్థితి రాకూడదనే నేనూ ప్రయత్నిస్తున్నాను. వారాస్థితికి రాకముందే వారిని మట్టుబెట్టాలి. అందుకే మక్కా ఖురైషీయులు. వారి మిత్ర పక్షం తెగలు సైన్యాన్ని సమీకరిస్తున్నారు. అటు ఖైబర్ వాళ్ళు కూడా సిద్ధంగా ఉన్నారు. ఇంకా ముస్లింలుగా మారని అరబ్బులు కూడా మదీనాలో ఉన్నారు. వారు కూడా మనకు సహకరిస్తారు. అందరూ కలసి ఒక్కసారిగా మెరుపుదాడి చెయ్యా లనేది మా పథకం. ఈ దెబ్బతో ముస్లింలు నామరూపా ల్లేకుండా పోతారు. ఎలా ఉంది మన పథకం?" అన్నాడు హుయ్యి తల్హా వైపు చూస్తూ.

"పథకం బాగానే ఉంది కాని అనవసరంగా మేము ఈ విషయంలో

తలదూర్చి ముస్లింలతో శతృత్వం కొనుక్కోవడమే నాకిష్టం లేదు. మీరే ఈ పని చేయండి.'' అన్నాడు తల్హా.

హుయ్యి ఇంకా నిరాశ చెందలేదు. మరో వల విసిరాడు అయినా గత్ఫాన్ తెగ నాయకుడు లొంగలేదు.

''చుట్టుపక్కల తెగలన్నీ ఏకమయ్యాయి. ముస్లింల పతనం ఖాయం డబ్బు, పేరు ప్రఖ్యాతలకు మనకు కొదవే లేదు. చేజేతులా ఇంత మంచి అవకాశాన్ని ఎందుకు జారవిడుచుకుంటారు?'' అంటూ చివరి అస్త్రం సంధించాడు హుయ్యి.

''పేరు ప్రఖ్యాతలు పుష్కలంగా గడించాను. దానికేమీ కొదవలేదు. కాని...డబ్బే కాస్త సమస్య అయిపోయింది''. అన్నాడు తల్హా ఆశగా.

''అదొక సమస్యే కాదు. మీరు నామాట విని సంకీర్ణ సైన్యానికి సహక రించండి. ఖైబర్ ఆదాయం నుండి సగం మీకు ఇచ్చేస్తాను'' ప్రలోభ పెట్టాడు హుయ్యి.

''నోటి మాటగా చెబుతున్నారు గాని, అందుకు హామీ ఏమిటి?''

''కాగితం రాసిస్తాను కావాలంటే''.

''సరే కానివ్వండి '' మెత్తబడ్డాడు తల్హా.

ఖైబర్ రాబడి నుండి గత్ఫాన్ తెగనాయకుడు తల్హాకు సగం ఆదాయం శాశ్వతంగా ఇవ్వబడుతుందని దస్తావేజు రాయించి దాని పై హుయ్యి, అతని అనుచరులు సంతకాలు చేశారు. దాంతో ఊరట చెందిన ఆ నాయకుడు యుద్ధానికి సిద్ధమవ్వమని తన తెగను ఆదేశించాడు. అసలే కయ్యానికి ఒంటికాలిపై లేచే అరబ్బులు, తమ దేవతలను విమర్శించేవారికి వ్యతిరేకంగా యుద్ధమనేసరికి మరింత ఉత్సాహంతో యుద్ధసన్నాహాలు ప్రారంభించారు.

అసలుకే మోసం తెస్తాడనుకున్న నాయకుడు తల్హా స్వయంగా యుద్ధ సన్నాహాలు చేయడమే కాకుండా, తన మిత్ర పక్షం తెగలన్నీటికీ లేఖలు రాశాడు. మదీనాపై దండెత్తడానికి సిద్ధమై రండని.

దీంతో హుయ్యి చాలా సంతోషించాడు. ''ఖురైషీయుల సైన్యం వచ్చేస్తోంది.

మీరు కూడా వచ్చి ఆసైన్యంలో చేరండి"అని చెప్పి సంతోషంతో అక్కడి నుండి మదీనాకు ప్రయాణమయ్యాడు.

మక్కా అవిశ్వాసుల ఆనందోత్సాహాలకు హద్దేలేదు. వారి కవులు మక్కా చుట్టుపక్కల ప్రాంతాల్లో విద్వేష పూరిత గేయాలతో అమాయక ప్రజల్ని రెచ్చగొట్టి చిచ్చు రగిలించారు. ఫలితంగా అక్కడి ప్రజల్లో ముస్లింలపై ప్రతీకారం పురి విప్పింది. ఉద్వేగం, ఉద్రేకాలు కలగలిసిన గట్టి పట్టుదలతో వాళ్ళు మక్కాలో గుమికూడుతున్నారు. ఇటు మక్కా వాసులు పూర్తి ఏర్పాట్లు చేసుకొని సిద్ధంగా ఉన్నారు. అటు బహుదైవరాధకుల మిత్ర తెగలన్నీ వారికి సహయంగా వచ్చేసాయి. వీరంతా యుద్ధంలో ఆరితేరిన ధీరులే. గత్ఫాన్ తెగతో పాటు. దాని మిత్ర పక్షాలైన బనూఅసద్. బనూసలీం. బనూఅసద్ మొదలైన అనేక తెగలు కూడా వచ్చేసాయి. దాంతో బహుదైవారధకుల బలం బాగా పెరిగిపోతోంది. ఈ సైన్యమంతా మక్కాకు ఎనిమిది మైళ్ళ దూరంలో జుహ్రాన్ అనే ప్రాంతంలో గుమిగూడుతోంది. మక్కా ప్రజలు కనీ వినీ ఎరుగని ఈ మహో సైన్యాన్ని చూడడానికి తండోపతండలు గా తరలివస్తున్నారు.

జుహ్రాన్‌కు, మక్కాకు మధ్యలో దారి పొడవునా జనం రేయింబవళ్ళు కిట కిటలాడుతూ కనిపించేవారు. ఒక రోజు పొద్దున్నే అబూసుఫ్యాన్ , ఖాలిద్ బిన్ వలీద్, ఉమర్ బిన్ అల్‌ఆస్, ఇక్రమ వగైరా నాయకులు సైన్యాన్ని చూడ్డానికి బయలు దేరారు. దారిపొడవునా వారికి జన సమూహమే కనిపించి తిరునాళ్ళను తలపింపజేసింది. వారంతా ఓ ఎత్తయిన కొండెక్కి సైన్యాన్ని తిలకించసాగారు. ఆ సైనిక వాహినిని చూసి వారు అమితానంద భరితులయ్యారు.

"ఈసారి మనం ముస్లింలను తప్పనిసరిగా అంతమొందించగలం. ఇంత భారీసంఖ్యలో సైన్యం ఇది వరకెప్పుడూ కదిలిరాలేదు. " అన్నాడు అబూసుఫ్యాన్ అప్రయత్నంగా.

" అవును, ఈసారి మనం మన హృదయాలను తృప్తిపరచగలం, గత యుద్ధాల్లో మరణించిన మనసోదరుల ప్రతీకారం తీర్చుకోగలం. మన ఆరాధ్య దైవాలను అవమానించే వారి అంతు చూడగలం. వారిని, వారి మతాన్ని నామ రూపాల్లేకుండా తుడిచిపెట్టగలం" అన్నాడు కదన రంగంలో వేయిమందికి దీటైన యోధుడని ప్రసిద్ధి చెందిన ఉమర్ బిన్ అబ్దూ సంతోషంగా.

" సంఖ్యా బలం చూసుకొని ఇప్పుడే మనం గర్వించకూడదు. మనం ఎవరితో తలపడబోతున్నామో, వాళ్ళు మహాపరాక్రమశాలురు. అంతేకాకుండా వారి దైవం వారికి సహకరిస్తాడు. అందుకని మనం ఇప్పుడే సంబరపడడం మంచిది కాదు" అన్నాడు ఖాలిద్ ముందు చూపుతో.

"అహ్హహ్హ! ............ బాగా చెప్పావు. వారి దేవుడు వారికి సహకరిస్తాడా? అసలు వాళ్ళ కొక దేవుడనేవాడు ఉన్నాడా? ఎవరైనా చూశారా వాళ్ళ దేవుణ్ని? దేవుడు లేడు గీవుడు లేడు. అంతా వాళ్ళ భ్రమ. ఉన్మాదంలో పడి గాలిమేడలు కడుతున్నారు. వాళ్ళకసలు దేవుడే లేడు. దేవతలు మనకున్నారు. మనం కళ్ళారా చూస్తున్నాం వీళ్ళని".

" అదలా వదిలేయండి. ఇక్కడ సమస్య దేవుళ్ళది కాదు. ఇంత పెద్ద సైన్యం ముస్లింలకు వ్యతిరేకంగా ఇది వరకెప్పుడూ కదిలిరాలేదు. వారిలో కూడా మన రక్తమే ఉన్నప్పటికీ, వారూ ధీరులే శూరులే అయినప్పటికీ వారి సంఖ్యాబలం చాలా తక్కువగా ఉంది. అందుకని ఎట్టి పరిస్థితుల్లోనూ వారు మనల్ని ఎదిరించలేరు" అన్నాడు అమ్ర్ బిన్ ఆస్.

"అదృష్టం మన వెన్ను తడుతోంది. సుఖభోగాలు మనకోసం నిరీక్షిస్తున్నాయి. మనం తప్పకుండా ముస్లింలను అంతంచెయ్యగలం. మదీనాను ఆక్రమించుకొని ఓ సువిశాల సామ్రాజ్యానికి పునాది వెయ్యగలం. దీంతో ఖురైషీయుల గౌరవ మర్యాదలు మరింత పెరిగిపోతాయి. మీరు నిశ్చింతగా ఉండండి విజయం మనదే" అన్నాడు అబూ సుఫ్యాన్ ధీమాగా.

"మీరన్నది ముమ్మాటికి నిజం" ఇక్రమ అన్నాడు సుఫ్యాన్ మాటలకు వత్తాసు పలుకుతూ.

"అది సరేగాని, ఇంత పెద్ద సైన్యం ఇక్కడ ఆగడం వల్ల నగరవాసులకు నిత్యావసర వస్తువుల కొరత ఏర్పడింది. అందుకని ఇక మనం ఎంత మాత్రం ఆలస్యం చేయకుండా వెళ్ళిపోవడం మంచిది." అన్నాడు అమ్ర్ బిన్ ఆస్.

" నిజమే, ఇంకా మనం ఇక్కడే ఉండడం సమంజసంకాదు. ప్రజల్లో ఇప్పుడున్న ఉత్సాహం, ఉద్రేకం ఆలస్యమయితే చల్లబడి పోవచ్చు. లేదా మనం దాడికి సిద్ధమైనట్లు ముస్లింలకు తెలిసిపోవచ్చు. అందుకని మనం అకస్మాత్తుగా వారిపై దాడి చెయ్యాలి. వారికి గుక్కతిప్పుకొనే అవకాశమే ఇవ్వకూడదు. వారు

ప్రమాదాన్ని పసిగట్టే లోగానే మనం పని పూర్తి చెయ్యాలి."అన్నాడు ఖాలిద్.

' నా ఉద్దేశం కూడా అదే. కాని నేను మరో విషయం కూడా అవసరమను కుంటున్నాను". అన్నాడు సుఫ్యాన్.

"ఏమిటది?"

"సైన్యంలో చేరిన నాయకులందర్నీ హుబల్, లాత్, ఉజ్జా దేవతల ముందు సమావేశపరచి ముస్లింలను హతమారుస్తాం లేదా మేమైనా చచ్చిపోతాం. అంతే కాని రణరంగం నుండి మాత్రం పారిపోము అని ప్రమాణం చేయించాలి."

"నా మనసులోని మాటే మీరు చెప్పేశారు. వెంటనే ప్రకటన చేయించండి. ఈరోజే అందరూ సమావేశమై ప్రమాణం చేయాలి." అన్నాడు అమ్ర్ బిన్ ఆస్,

అబూ సుఫ్యాన్ వెంటనే సేవకుణ్ని పిలిచి నాయకులందరికీ సందేశాలు పంపాడు. సాయం సమయాన వారంతా కాబా గృహంలో సమవేశమయ్యారు. కాబా గృహం కప్పుపై హుబల్ విగ్రహం ఉంది. అరబ్బులందరూ హుబల్‌నే ఎక్కువగా అభిమానించేవారు. అందరికంటే పెద్ద దేవుడిగా భావించేవారు.

"మనకు ధనాన్ని, గౌరవాన్ని, శక్తియుక్తుల్ని ప్రసాదించిన దైవానికి ధన్య వాదాలు, ఈరోజు మనం మన ఆరాధ్య దైవమైన హుబల్ దేవుని ముందు ప్రమాణం చేయడానికి సమావేశమయ్యాము. మన దైవాలను అవమానించే వారిని అంతం చేస్తామని. వారిని తుడిచిపెట్టే కార్యంలో చావనైనా చస్తాం కాని, రణరంగం నుండి పోమని మనం హుబల్ దేవుని సమక్షంలో ప్రమాణం చేద్దాం ఏమంటారు?" అడిగాడు అబూ సుఫ్యాన్.

"సరే అలాగే చేద్దాం." అన్నారు నాయకులందరూ.

"అదృష్టవశాత్తు వివిధ తెగలకు చెందిన ప్రముఖ నాయకులంతా ఒకే పతాకం కింద పెద్ద సంఖ్యలో గుమికూడారు. ఇది ఒక రకంగా మన దేవతలకు ఆగ్రహం కలిగి తమ మహిమతో ఇంత పెద్ద సైన్యాన్ని సమీకరించాయనుకుంటు న్నాను. ఇప్పుడు ముస్లింలను, వారి ధర్మాన్ని భూమిపై నుండి తుడిచి పెట్టే సమయం ఆసన్నమైంది. కనుక మనం ఈ సువర్ణావకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి." అన్నాడు అబూ సుఫ్యాన్,

తర్వాత వీరంతా హుబల్ విగ్రహం ముందు సాష్టాంగపడి ఇలా ప్రార్థించారు:

"ఓ మా ఆరాధ్యదైవమా! మేము నీ సహాయం కోసం నీ ముందు హాజరయ్యాము. మాకు సహాయం చెయ్యి. శత్రువులపై మాకు ఆధిక్యత ప్రసాదించు. కొంతమంది ఉన్మాదులు నిన్ను అవమానిస్తూ, నీ పవిత్రతకు భంగం కలిగేలా ప్రవర్తిస్తున్నారు. నీ దైవత్వాన్ని అంగీకరించడానికి తిరస్కరిస్తున్నారు. వారి చేష్టలన్నీ నీవు చూస్తూనే ఉన్నావు. కనుక మేము వారిని తుడిచి పెట్టడానికి నీపై నమ్మకంతో బయలుదేరాము. నీవు మా చేతుల మీదుగా వారిని భూస్థాపితం చెయ్యి. వాళ్ళ మతాన్ని అంతం చెయ్యి. అలాకాకుండా వారే మా పై విజయం సాధిస్తే, ఇక నిన్ను పూజించేవాడు భూమిపై ఒక్కడూ మిగలడు. అంతేకాదు కనీసం నీ ఒంటి పై పడ్డ దుమ్ము దులిపే నాథుడు కూడా ఉండడు."

ఈ ప్రార్థన అనంతరం వారంతా" మా బొందిలో ప్రాణమున్నంత వరకూ పోరాడుతాం. చంపుతాం లేదా చస్తాం. రణరంగం నుండి మాత్రం పారిపోము" అని ప్రతిజ్ఞ చేశారు.

ప్రార్థన, ప్రతిజ్ఞలతో వారికి ఊరట కలిగింది. మనసులు కుదుటపడ్డాయి. ఆ తరువాత అందరూ తిరిగొచ్చేశారు. అబూసుఫ్యాన్ ఓ సారి సైన్యాన్ని పరిశీలించాడు. దాదాపు పాతిక వేల సాయుధ సైన్యాన్ని చూసి అతడు చాలా సంతోషించాడు. ఈ మహాన్నత సైన్యానికి అబూసుఫ్యానే సైన్యాధిపతిగా ఎంపికయ్యాడు. అతడు సైన్యాన్ని మూడు దళాలుగా విభజించి, ఒక దళానికి గత్ఫాన్ తెగనాయకుడు తల్హాను నియమించాడు. మరో దళాన్ని ప్రతి వేయి మందికో అధికారి చొప్పున నియమించి సైన్యాన్ని ఓ క్రమపద్ధతిలో పంక్తులుగా తీర్చిదిద్ది బయలుదేరవలసిందిగా ఆజ్ఞాపించాడు. రెండవరోజు తెల తెల వారుతుండగా నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ గణగణమని ఓ గంట శబ్దం చేసింది. ఈ శబ్దం విని మక్కా వాసులు జుహ్రాన్ వైపుకు పరుగు తీశారు. వేలమంది పిల్లలు, పెద్దలు ఆ కొండ ప్రాంతానికి చేరుకొని చీమలదండులా కదులుతున్న సైన్యాన్ని కన్నుల పండుగగా తిలకించ సాగారు.

అప్పటికి బాల భాస్కరుడు కాస్తంత పైకెక్కి గుడ్లు మిటకరిస్తూ చూస్తున్నాడు. బారులు తీరిన సాయుధసైన్యం ఠీవి, దర్పం ఉట్టిపడుతుండగా రెట్టింపు ఉత్సాహంతో మదీనా వైపు బయలుదేరింది....

ఇంకా చీకటి తెరలు తొలగిపోలేదు, ఉదయ భానుడు చీకటి తెరల్ని చీల్చి ఉషోదయ కాంతుల్ని వెదజల్లడానికి సన్నాహాలు చేస్తున్నాడు. సుహైల్ ఫజర్

నమాజు ముగించుకొని మసక చీకట్లోనే ఎక్కడికో బయలుదేరాడు. పక్షుల రణగొణ ధ్వనుల మధ్య ఎవరో మాట్లడుకుంటున్న శబ్దం వినవచ్చింది. సుహైల్ దాన్నేమీ పట్టించుకోకుండా కొండలు, గుట్టల మధ్య మెల్లిగా ముందుకు సాగిపోతున్నాడు. అలా ముందుకు వెళుతున్న కొద్దీ మాటలు ఇంకా స్పష్టంగా వినిపించసాగాయి. అయినా సుహైల్ వాటిని పట్టించుకోలేదు.

"నా కళ్ళ ముందే ఆ మహాసైన్యం బయలుదేరింది. ఈ సారి ప్రపంచంలో ని ఏశక్తీ ముస్లింలను రక్షించజాలదు" అనే మాటలు చెవిన పడగానే సుహైల్ తక్కున ఆగిపోయాడు. వెంటనే అతడు ఓ బండరాయి చాటున దాగి ఆ మాటలు వినసాగాడు.

"సుమారు ఎంత సైన్యం ఉంటుంది?"

"ఇరవై నాలుగు వేలు"

"అబ్బో!. ఇరవై నాలుగు వేలే! గొప్ప సైన్యమే!!"

"అంతేకాదు మార్గమధ్యలో ఇంకా అనేక తెగలు సైన్యంలో చేరతాయి."

"అయితే ఈసారి ముస్లింలు సోదిలోక్కూడా రాకుండా పోతారు. సరే ఇంతకూ హుయ్యి మా నుండి ఏమీ కోరుతున్నాడు?"

"మీరు కూడా వారికి సహకరించాలనేదే అతని కోరిక."

"అయితే నేను కాబ్‌కు చెబుతాను. అయినా హుయ్యి స్వయంగా వచ్చి ఓ సారి కాబ్ ను కలుసుకుంటే మంచిది."

"అసలు ఆయనే రావడానికి బయలుదేరారు. కాని అక్కడ తన వాళ్ళందరినీ తయారు చేయవలసి ఉండడం వల్ల ఆగిపోయారు."

" ఎందుకనీ? తన జాతిలోనే ఏమైనా వ్యతిరేకత ఉందా అతనికి?"

"అబ్బే...అదేం లేదు. యుద్ధ సామగ్రి, ఆయుధాలు, డబ్బు వగైరా ఏర్పాట్లన్నీ చూడవలసి ఉంటుంది కదా. అంతే మరేమి లేదు".

"ఖురైషీయులు వస్తున్నారా మరి?"

" ఆ...... ఖురైష్ తెగ అగ్రనాయకులంతా వస్తున్నారు."

" అయితే ఈ సారి ముస్లింల చరిత్ర సమాప్తం."

"భూ మండలంపై ఎక్కడా ముస్లింలకు నిలువనీడకూడా దొరకదని నా అభిప్రాయం."

అసలు వాళ్ళు భూమిపై ఉంటే గదా నీడ దొరకడానికి. అదిసరే గాని, మీరు పొద్దున్నే హుయ్యీను ఇక్కడికి పంపండి."

" మనం దాడి చేసే విషయం ముస్లింలకు తెలీకుండా, వాళ్ళు ఊపిరి కూడా పీల్చుకోడానికి అవకాశం ఇవ్వకుండా, మెరుపుదాడి చేసి వాళ్ళను చుట్టు ముట్టి మట్టుబెట్టాలి. ఇదీ హుయ్యీ పథకం" అన్నాడు మొదటి వాడు.

"పథకం చాలా బాగుంది. కాని కొంపదీసి ఈ వార్త ముస్లింల చెవుల్లో పడలేదు గదా?" అన్నాడు రెండవ వాడు. కాస్త సందేహిస్తూ.

"లేదు లేదు. వారికీ విషయం ఎంత మాత్రం తెలియదు. "

"అదీ, అలా ఉండాలి పథకం. జాగ్రత్త! ఇక నే వెడతా."

" సరే వెళ్ళండి . కాబ్ స్వయంగా మిమ్మల్ని కలుసుకొలేక పోయారే అని నాకు కాస్త బాధగా ఉంది."

"ఫరవాలేదు. నేను చెప్పిన విషయాలన్నీ మీరు కాబ్‌తో చెప్పండి."

"తప్పకుండా చెబుతాను. ఈవార్త విని కాబ్ ఎంతో సంతోషిస్తారు.

సుహైల్‌కు వారు వెళ్ళిపోతున్నారని తెలిసిపోయింది. అందుకని కాస్త తల పైకెత్తి వారిని చూడాలనుకున్నాడు. కాని వారు తనను చూస్తే వారి రహస్య సమాచారం ముస్లింలకు తెలిసిపోతుందని వారు భావించే అవకాశం ఉంది. అంచేత సుహైల్ ఇంకాస్త నక్కి కూర్చున్నాడు. కాసేపటికి వారు వెళ్ళిపోయినట్లు పాదాల చప్పుడు విని తలపైకెత్తి చూశాడు. వారిలో ఒకడు యూదుల మత గురువు. రెండవ వాణ్ని సుహైల్ గుర్తుపట్టలేకపోయాడు. ఆయన అక్కడి నుండి బయలుదేరి నేరుగా మస్జిదె నబవిలో ప్రవేశించారు. ఎప్పటిలాగే జనం దైవప్రవక్త (సఅసం) బోధనలు వింటూ ఆయన చుట్టూ మూగి కూర్చొని ఉన్నారు. అసంఖ్యాక నక్షత్రాల మధ్య సుధాకరుడు దేదీప్యమానంగా వెలిగి పోతున్నట్లు, ఎంత మంది సహచరుల మధ్య ఉన్నా దైవప్రవక్త (సఅసం) దివ్యమోము ప్రకాశవంతంగా, ప్రత్యేకంగా కనిపించేది. మస్జిద్‌లో అడుగు పెడుతూనే "అస్సలాము అలైకుం" అన్నాడు సుహైల్ బిగ్గరగా".

"వ అలైకుముస్సలాం" మస్జిద్ మారుమోగింది. ఆ సమయంలో అనుచరులకు ఉపదేశం చేస్తున్న దైవప్రవక్త చూపులు సుహైల్ పై పడగానే సమావేశాన్ని ముగించి "ఏమిటి విశేషం? ఏదో కొత్త విషయం చెప్పాలని నీ మనసు ఆరాటపడుతున్నట్లుంది. " అన్నారు చిరునవ్వుతో .

"దైవప్రవక్తా! మీరన్నది నిజం".

"ఏమిటి విశేషం?"

"ఏమీ అనుకోకపోతే ఈ విషయం మీరొక్కరే వినడం సమంజసమనుకుంటాను."అన్నారు సుహైల్ తటపటాయిస్తూ.

"పరవాలేదు. అంతా మనవాళ్ళే గదా! చెప్పు"

"కాస్త బాధకరమైన విషయమే. నేనీ రోజు ఉదయం అలా కొండ ప్రాంతానికి వెళ్ళాను. అక్కడ ఇద్దరు మనుషులు మాట్లాడుకుంటుంటే కాకతాళీయంగా అవి నా చెవిన పడ్డాయి. మక్కా ఖురైషీయులు ఇరవై నాలుగు వేల సైన్యంతో మదీనాపై దాడి చేయడానికి వస్తున్నారట."

ఈవార్త వినగానే ముస్లింలు దిగ్భ్రాంతికి గురయ్యారు. దైవప్రవక్త ( సఅసం) 'ఇన్నా లిల్లాహి ఇన్నా ఇలైహి రాజిఊన్' అంటూ ఇలా అన్నారు:

"ఏ శక్తి ఆధీనంలో మన ప్రాణాలున్నాయో ఆ శక్తిపై మనకు ప్రగాఢ విశ్వాసం ఉంది. ఆయన అనుజ్ఞ లేనిదే చెట్టు నుండి ఆకు కూడా రాలదు. ఆయనే మన రక్షకుడు. గతంలో కూడా ఆయనే మనకు సహాయం చేశాడు. ఇప్పుడు కూడా ఆయనే మనకు సహాయపడతాడు. మీరేమీ కంగారుపడకండి."

దైవప్రవక్త పలికిన ఈ స్వాంతన పలుకులతో ముస్లింల భయాందోళనలు పటాపంచలయ్యాయి. వారి మనసుకు స్థిమితం చేకూరింది.

"సుహైల్ నువ్వు వారిని చూశావా!" ప్రశ్నించారు దైవప్రవక్త.

"చూశాను కాని ఒక్కణ్ణి మాత్రమే గుర్తించగలిగాను. అతడు యూదుల మతగురువు. రెండవ మనిషిని ఎవరో తెలీదు." చెప్పారు సుహైల్.

"యూదుల మత గురువా?!" అన్నారు దైవప్రవక్తకు ఎదురుగా కూర్చున్న అజానుబాహుడైన ఓ యువకుడు. ఆయన పేరు ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి).

దైవప్రవక్త (సఅసం) కుడి పక్కన హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజిఅన్), ఎడమ పక్కన హజ్రత్ ఉస్మాన్ గని (రజిఅన్). ఆయన పక్కన హజ్రత్ అలీ (రజిఅన్) ఆసీనులై ఉన్నారు.

"అవును అతడు యూదుల మతగురువే కావచ్చు. అతడు బనూఖురైజా నాయకుడని కూడా నాకు తెలిసింది. అతడు ముస్లింలకు బద్ధశత్రువు" అన్నారు హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజిఅన్).

"ఏమిటి? ఒప్పందంలో తన జాతి కూడా కలిసి ఉందన్న విషయం అతనికి తెలియదా?"అన్నారు ఉస్మాన్ గనీ (రజి) ఆశ్చర్యంగా.

" ఎందుకు తెలియదు. అన్నీ తెలుసు. ఒప్పందం సమయంలో అతడు ఉన్నాడు కూడా! కాని అతడు యూదుడు. యూదులకు వారి మిథ్యా దేవుళ్ళను వ్యతిరేకించే ముస్లింలంటే పడదు." అన్నారు అబూబక్ర్ సిద్దీఖ్ (రజిఅన్)

"ఒప్పందాన్ని అతిక్రమించే వారికి దేవుడు తప్పకుండా ప్రతీకారం చేస్తాడు." అన్నారు దైవప్రవక్త (సఅసం)

"ఆ మతగురువొక్కడే ముస్లింల వ్యతిరేకి కాదు. కాబ్ కూడా ముస్లింల శత్రువే. నేను గుర్తించలేదని చెప్పిన ఆ రెండవ వ్యక్తి హుయ్యి ప్రతినిధి. అతడు కాబ్‌కు యుద్ధానికి సిద్ధమవ్వమని చెప్పి వెళ్ళాడు. మతగురువు హుయ్యిను కూడా రమ్మన్నాడు" అన్నారు సుహైల్.

"హుయ్యి ప్రతినిధా! అతనికి మనం దేశం నుండి బహిష్కరించామని కోపం ఉంది. అతడు దానికి ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటున్నాడు. అతడు ఎంతటి విశ్వాస ఘాతుకానికి పాల్పడ్డా మనం అతడ్ని, అతని జాతిని సంహరించ కుండా వదిలేసినందుకు సంతోషించాల్సింది పోయి, చిచ్చుపెడుతూ తిరుగు తున్నాడూ? అతనే ఖురైషీయుల్ని రెచ్చగొట్టి ఉంటాడు. అంతటితో ఆగక అతడు మదీనాలో కూడా చిచ్చుపెట్టాలని ప్రయత్నిసున్నాడు. ఒకవేళ బనూఖురైజా తెగవాళ్ళు అతని మాయమాటల్లో పడి మోసపొయ్యారంటే, వీళ్ళూ నష్టపోతారు." అన్నారు. దైవప్రవక్త ( సఅసం) ఆగ్రహంతో.

"ఖురైజా తెగవాళ్ళూ అతడి మాయ మాటల్లో పడడం పెద్ద విశేషమేమీ కాదు. బనూ నజీర్‌ను బహిష్కరించినప్పుడు వారికి ఏమీ సహాయం చేయలేక

పోయామనే బాధ వారికుంది. అందుకని వారు అవకాశం కోసం నిరీక్షిస్తూ ఉండ వచ్చు" అన్నారు అబూ బకర్ సిద్దీఖ్ (రజి)" అయితే వారు నిప్పుతో చెలగాట మాడుతున్నారన్న మాట. మృత్యువు వారి నెత్తిన కూర్చుంది. ఏం చేస్తారు మరి" అన్నారు ఉమర్ (రజి) ఆగ్రహంతో.

"అంటే హుయ్యి ఖురైషీయుల్నే కాకుండా మక్కా, మదీనాలలోని తెగ లన్నిటినీ రెచ్చగొట్టాడన్న మాట. బనూఖురైజా తెగ కూడా అతని ఈ కుట్రలో పాలుపంచుకొంది. ఆ వచ్చిన ప్రతినిధి హుయ్యి సందేశంతో పాటు స్థితి గతుల్ని కూడా వివరించి ఉంటాడను కుంటాను" అన్నారు అలీ (రజి)

"అవును. మీ అభిప్రాయం సరైనదే. ఇరవైనాలుగు వేలకు పైగా సైన్యాన్ని తీసుకొని ఖురైషీయుల అధినాయకుడు అబూ సుఫ్యాన్‌తో పాటు ఇంకా అనేక మంది అగ్రనాయకులు బయలుదేరారని, ఇంకా మార్గం మధ్యలో అనేకమంది సైన్యంలో చేరతారనీ చెప్పాడతను" అన్నారు సుహైల్.

"అయితే మక్కా, దాని పరిసర ప్రాంతాలు తమ ప్రియతమ నాయకుల్ని ఈసారి మన మీద దాడికి పంపుతున్నాయన్నమాట. ఏ దైవమైతే గతంలో మనకు సహకరించాడో ఆ దైవమే ఇప్పుడు కూడా మనకు సహాయం చేస్తాడు. ఇది సత్యాసత్యాలకు మధ్య జరిగే పోరాటం. ఒక్కోసారి అసత్యం కూడా సత్యంపై పైచేయిగా ఉంటుంది. కాని చివరికి విజయం సత్యాన్నే వరిస్తుంది. ఇన్షాఅల్లాహ్ ఈ సారి కూడా విజయం సత్యానిదే" అన్నారు దైవప్రవక్త ( సఅసం).

వెంటనే అనుచరులు కూడా అప్రయత్నంగా ఇన్షాఅల్లాహ్ అంటూ దైవ ప్రవక్తతో గొంతుకలిపారు పరిసరాలు ప్రతిధ్వనించేలా.

"మరిప్పుడు మనం ఏంచేద్దాం. సలహాలు, సూచనలు ఇవ్వండి" అన్నారు దైవప్రవక్త ( సఅసం)

"ఏముంది మనం కూడా యుద్ధానికి సిద్ధమవ్వాలి" అన్నారు హజ్రత్ ఉమర్.

"ఎలాగూ సిద్ధమవ్వాలనుకోండి. కాని కొంతమంది గూఢచారుల్ని కూడా పంపి పూర్తి వివరాలు తెలుసుకుంటే మంచిదని నా అభిప్రాయం" అన్నారు అబూబకర్ సిద్దీఖ్.

--

"ఎందుకు, ఇంకా ఏమైనా సందేహమా?" అన్నారు హజ్రత్ ఉస్మాన్.

"అబ్బే, సందేహం ఏం లేదు. గూఢచారుల్ని పంపడం వలన అసలు సైన్యం ఎంతుంది? ఎంత దూరం వచ్చింది? వారి బలం ఎంత? ఇంకా అనేక ఇతర విషయాలు తెలుస్తాయని నా అభిప్రాయం" అన్నారు అబూబకర్ (రజి)

"నిజమే! గూఢచారుల్ని పంపాలన్న మీ అభిప్రాయం సమంజసంగానేఉంది. అయితే మనకు మదీనా బహుదైవారాధకులు, కపటులతో కూడా చిక్కులు ఉన్నాయి." అన్నారు ఉమర్ (రజి)

పైకి ముస్లింలుగా నటిస్తూ లోలోన ముస్లింలకు వ్యతిరేకంగా కుట్రలు పన్నే కపటముస్లింలు కూడా కొందరున్నారు. ముస్లింలతో కలసి ఉంటూనే అవకాశం దొరకినప్పుడు వారిని అణగదొక్కాలని వారు కాచుకొని ఉంటారు. వారి నాయకుడు అబ్దుల్లా బిన్ ఉబై మహా జిత్తులమారి.

దైవ ప్రవక్త (సఅసం) మక్కా నుండి వలస రాక పూర్వం మదీనాలో అవస్, ఖజ్‌రజ్ అనే రెండు ప్రఖ్యాత తెగలుండేవి. ఈ రెండు తెగల మధ్య నిత్యం ఘర్షణలు, పోరాటాలు జరుగుతుండేవి. ఫలితంగా రెండు తెగలూ బాగా చితికి పోయాయి. ఆ అవకాశం కోసమే ఎదురుచూస్తున్న ఉబై ఆ తెగల్లో తన పలుకుబడి పెంచుకోవడం ప్రారంభించాడు. చివరికి ఆ రెండు తెగలూ అతణ్ని తమ నాయ కుడిగా అంగీకరించాయి. అతణ్ని మదీనాకు రాజుగా చేయడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఒక పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేసి, అతడికి బంగారు కిరీటం పెట్టి, లాంఛన ప్రాయంగా అతణ్ని మదీనా రాజుగా ప్రకటించడానికి సన్నాహాలు కూడా ప్రారంభమయ్యాయి. అంతలో కొంత మంది మదీనా పౌరులు ఇస్లాం స్వీకరించారు.

ఆ తరువాత పరిస్థితులు అతి వేగంగా మారిపోయాయి. మరో వైపు మక్కా నుండి ముస్లింలు మదీనా రావడం ప్రారంభించారు. ఇలా ఇస్లాం రాకతో అతడి కిరీటాలంకరణ కార్యక్రమం కాస్త మరుగున పడిపోయింది. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) కూడా మదీనా వచ్చేశారు. దైవప్రవక్త (సఅసం) మదీనా రాక అబ్దుల్లా బిన్ ఉబై రాజకీయ పతనానికి నాందీవాచకం అయింది.

అనతి కాలంలోనే అత్యధిక సంఖ్యలో మదీనా వాసుల ముస్లింలయ్యారు. అక్కడి పౌరులు దైవప్రవక్తను రాజు కంటే అమితంగా గౌరవిస్తూ, తమ పాలకునిగా

స్వీకరించారు. ఈ పరిణామం అబ్దుల్లా బిన్ ఉబైను తీవ్రంగా కలచివేసింది. కాని అతడు ముస్లింలను ప్రత్యక్షంగా ఎదుర్కోలేక కుత్సిత బుద్ధితో దొడ్డి దారిన కుట్రలు పన్నడం ప్రారంభించాడు.

అతడు, అతని అనుచరులు ముస్లింలుగా నటిస్తూ, వారితో కలసిమెలసి ఉంటూ వారిని అంతర్గతంగా అణచి వేయడానికి పన్నాగం పన్నారు తిన్నింటి వాసాలు లెఖ్ఖపెట్టినట్లు. ఈ కపట ముస్లింల ఉద్దేశాలు ముస్లింలకు తెలిసినా 'కలిమా' పఠించిన వారని దయదలచి విడిచిపెడుతున్నారు.

దైవప్రవక్త(సం) కూడా వారి మానాన వారిని వదిలేస్తూ ఓ సారి ఇలా అన్నారు: "బహుదైవారాధకుల్ని, కపటుల్ని పట్టించుకోకండి. వారే దారికొస్తారు. రాకపోతే వారిని ఎలా దారికి తేవాలో మనకు తెలుసు."

"మనం ఇప్పుడు ముందుగా గూఢచారుల్ని పంపడమే బాగుంటుంది".

దైవప్రవక్త (సఅసం) చేసిన ఈ సూచన ప్రకారం ఓ రోజు జొహర్ నమాజ్ తరువాత ఇద్దరు గూఢచారులు రెండు ఒంటెలపై బయలుదేరివెళ్ళారు. దైవప్రవక్త (సఅసం) ముస్లింలను సమావేశపరిచారు. వారిలో హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి), హజ్రత్ ఉస్మాన్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి); హజ్రత్ అలీ (రజి), హజ్రత్ జుబైర్( రజి) , హజ్రత్ అబూఉబైదా (రజి), హజ్రత్ అబూ హుజైఫా (రజి), హజ్రత్ బిలాల్ (రజి), హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) , హజ్రత్ అబూజర్ గిఫారి(రజి) , హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి), హజ్రత్ ఖారిజ (రజి), హజ్రత్ ఉత్బా మాలిక్ (రజి), హజ్రత్ అవస్ బిన్ సాబిత్ (రజి), హజ్రత్ సాద్ బిన్ మాజ్ (రజి), హజ్రత్ అబూఅయ్యూబ్ (రజి), హజ్రత్ ఉబాద్ బిన్ బషీర్ (రజి), హజ్రత్ అబూదర్దా(రజి), హజ్రత్ మున్జద్ (రజి) ప్రభృతులు ఉన్నారు. అందరి మధ్య దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఆసీనులై ఉన్నారు. సమావేశంలో నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. అందరి చూపులూ దైవప్రవక్త ముఖారవిందం మీదనే ఉన్నాయి. అంతా ఎంతో ఉత్కంఠంతో ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. అంతలో దైవప్రవక్త (సఅసం) నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఇలా అన్నారు:

"సోదరులారా! ప్రత్యర్థివర్గానికి సంబంధించిన సమాచారాన్ని సేకరించుకొని మన గూఢచారులు వచ్చేశారు. ఇక వారి నివేదిక వినండి."

ఈ మాట వినగానే అనుచరులందరి చూపులు మరింత ఉత్కంఠతతో గూఢచారుల వైపుకు తిరిగాయి.

"ఆ రోజు ఇక్కడి నుండి బయలుదేరిన మేము మార్గమధ్యలో కలసిన కొందరి ద్వారా శత్రువుల సమాచారాన్ని సేకరిస్తూ ముందుకు సాగిపోయాము. శత్రుసైన్యానికి సమీపంలో ఉన్న ఓ ఎత్తైన కొండెక్కి సైన్యాన్ని అంచనా వేయడానికి ప్రయత్నించాము. ఇసుక పోసినా రాలనట్లుగా కను చూపుమేరలో ఎటు చూసినా గుడారాలు, గుర్రాలు, ఒంటెలు, సైనికులు తప్పితే మాకేమీ కనిపించలేదు. అంతటి బ్రహ్మండమైన సైన్యాన్ని మేము ఇది వరకెన్నడూ చూడలేదు. తరువాత మేము సైనికసంఖ్యను అంచనావేయడానికి, దాని దళపతుల వివరాలు తెలుసుకోడానికి వారిలాగే వేషధారణ మార్చుకొని శత్రు సైన్యంలో కలిసిపోయాము. వారు కూడా మమ్మల్ని తమ మనుషుల్లానే భావించసాగారు. మేము సైన్యాన్ని పరిశీలిస్తూ, సమాచారాన్ని సేకరిస్తూ అక్కడ జరుగుతున్న సైనిక సమావేశంలో పాల్గొన్నాము. వారి మాటల వల్ల సైన్యం ఇరవై నాలుగు వేలకు పైచిలుకు ఉందని, సైన్యానికి ప్రధాన సేనాపతి అబూ సుఫ్యాన్ అని, సైన్యంలో వివిధ తెగలకు చెందిన ప్రముఖ నాయకులు ఉన్నారని తెలిసింది. వారిలో ప్రతి ఒక్కరి వద్దా అత్యాధునిక ఆయుధ సామాగ్రి ఉంది. ఆయుధాలు, వాహనాలతో పాటు, భోగవిలాసాలకు సైతం కొదువలేదు. మందు, మగువల సంగతి చెప్పనవసరం లేదు. మొత్తంమీద వారికి కావాల్సినవన్నీ ఉన్నాయి. దేనికి కొదవలేదు." వివరించారు గూఢచారులు.

"ఊ.....మక్కా ఖురైషీయుల్లో అగ్రనాయకులు ఎవరెవరున్నారు?" ప్రశ్నించారు హజ్రత్ ఉమర్ (రజి).

"పెద్ద పెద్ద నాయకులే ఉన్నారు. ఉదాహరణకు అబూ సుఫ్యాన్, ఖాలిద్ బిన్ వలీద్, అమ్ర్ బిన్ ఆస్, జరార్ బిన్ ఖత్తాబ్, ఉమర్ బిన్ అబ్దు, నొఫిల్ మొదలగు వారున్నారు" అన్నాడు ఓ గూఢచారి.

"సైన్యం మూడు దళాలలో విభజించబడింది. మొత్తం సైన్యానికి ప్రధాని అబూ సుఫ్యానే సైన్యాధ్యక్షుడిగా ఉన్నాడు" అన్నాడు మరో గూఢచారి.

"ఖురైషీయులు, వారి మిత్రపక్షం తెగలు సకల హంగులతో మనపై దాడికి వస్తున్నాయి. ఇప్పుడు మనం ఏం చేద్దామో చెప్పండి" అంటూ అనుచరులు సలహా కోరారు దైవప్రవక్త(సఅసం)ను.

మనం కూడా పూర్తి శక్తి సామర్థ్యాలతో శత్రువులను ఎదిరించాలి. మనతో పాటు మన మిత్రపక్షతెగల్ని కూడా కలుపుకుపోవాలి'' అన్నారు ఉమర్( రజి).

''ముస్లింలతో శాంతి ఒప్పందం కుదుర్చుకున్న యూదులు, బహుదైవారాధకులు, ఒప్పందాన్ని అతిక్రమించి మన శత్రువులతో చేతులు కలిపారని తెలిసింది'' అన్నాడు ఓ గూఢచారి.

''ఇది సత్యాసత్యాల మధ్య జరిగే సమరం. మిథ్యావాదులు ఒక వైపు, సత్యసంధులు మరోవైపు ఉండడం సహజమే. కనుక మనం ఎవరిపైనా ఆధారపడకూడదు. మనం దైవాన్నే నమ్ముకోవాలి. ఆయనే మన రక్షకుడు. మనకు సహాయం చేసేవాడు ఆయనే. అయితే మనం వారిని ఎదుర్కోవడానికి తగిన పథకం రూపొందించవలసి ఉంది'' అన్నారు దైవప్రవక్త (సఅసం)

''ఇన్నాళ్ళూ మనం శత్రువులను ఏ విధంగా ఎదుర్కొన్నామో అదేవిధంగా ఇప్పుడూ ఎదుర్కొందాం.'' అన్నారు అబూఅయ్యూబ్ (రజి)

'' అప్పటి పరిస్థితులు వేరు. ఇప్పటి పరిస్థితులు వేరు. ఇప్పుడు మొత్తం తెగలన్నీ మనకు వ్యతిరేకంగా కత్తిగట్టాయి. అధర్మం తన పూర్తి శక్తియుక్తులతో మనపై తుఫానులా విజృంభించడానికి వస్తోంది. అందువల్ల మనం మదీనాలో ఉండే వారిని ఎదిరిద్దామా? లేక మదీనా వెలుపలికెళ్ళి వారిని అడ్డుకొందామా? అనేది నిర్ణయిస్తే బాగుంటుంది'' అన్నారు దైవప్రవక్త (సఅసం).

''మదీనాలో ఉండి వారిని ఎదుర్కోవడం అంత మంచిది కాదేమో'' అన్నాడు ఒక అనుచరుడు.

''ముందుగా మనం, మన శక్తిసామర్థ్యాలను అంచనా వేసుకోవాలి. ఆ తరువాత గాని మనం మదీనాలో ఉండి ఎదుర్కోవడమా, లేక బయటి కెళ్ళి తలపడడమా అనే విషయం నిర్ణయించవచ్చు'' అన్నారు అబూబక్ర్ (రజి)

''నిజమే! ముందు మనం మన ముజాహిద్‌లు ఎంత మంది ఉన్నారనే విషయం తెలుసుకోవాలి'' అన్నారు సఅద్.

''అవును. నీ అభిప్రాయం బాగుంది'' అన్నారు దైవప్రవక్త (సఅసం).

''నా అంచనా ప్రకారం మన యోధులు మూడువేల మంది దాకా ఉంటారు. అంతకు మించి ఉండరు.'' అన్నారు హజ్రత్ ఉమర్ (రజి).

"మీ అంచనా సరైనదే. నేను మొన్నీ మధ్య అంచనా వేసినా మూడు వేలు మందే తేలారు." అన్నారు అబూజర్ (రజి).

" సరే.... మొత్తం మీద మన యోధులు మూడు వేల మంది ఉంటారని తెలుస్తోంది. శత్రు సైన్యం 24 వేలకు పైగా ఉందంటే మనకు ఎనిమిది రెట్లు ఎక్కువన్నమాట. ఇటు వంటి పరిస్థితుల్లో మనం ఏం చేద్దామో చెప్పండి" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"ఈ స్థితిలో మనం నగరంలో ఉండే పోరాడటం మంచిది." అన్నారు అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) తన అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ-

"నా ఉద్దేశ్యం కూడా అదే. మదీనాలోనే ఉండి వారిని ఎదుర్కోవడం మంచిది. ఇవి మా అభిప్రాయాలు మాత్రమే. ఈ విషయంలో దైవాజ్ఞ అవతరిస్తే బాగుండు" అన్నారు అబూబక్ర్ (రజి)

"దైవాజ్ఞ ఏమీ అవతరించలేదు. అంచేత అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం నగరంలోనే ఉండి శత్రువుల్ని ఎదుర్కుందాం. కాని శత్రువుల సంఖ్య చాలా ఎక్కువగా ఉంది. వారి ధాటికి మదీనా పట్టణం తట్టుకునేలా లేదు. అందుకని మనం నగరాన్ని రక్షించుకోడానికి తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. ఏం చేద్దామో చెప్పండి" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"దైవప్రవక్తా! నాదొక చిన్న సలహా" అన్నారు సల్మాన్ ఫార్సి (రజి) ఎంతో వినయంగా.

"చెప్పు" అన్నారు దైవప్రవక్త (సఅసం) ఆయనవైపు చూస్తూ.

"నేను ఈరాన్ దేశస్థుణ్ణని మీకు తెలుసు. మా దేశంలో ఒక బలహీన వర్గం శత్రువుల్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు తనను తాను రక్షించుకోవడానికి తమ నగరం లేక గ్రామం చుట్టూ ఒక అగడ్త (ట్రెంచ్) తవ్వుతుంది. ఆ విధంగా శత్రువుల దాడి నుండి తనను కాపాడుకుంటుంది. మనం కూడా అదే విధంగా మదీనా చుట్టూ కందకం తవ్వి నగరాన్ని శత్రువుల బారి నుండి కాపాడుకోవచ్చు" అన్నారు సల్మాన్ ఫార్సి (రజి)"

"అంటే........? నగరంలోకి శత్రువు ప్రవేశించకుండా నగరం చుట్టూ పొడుగ్గా ఒక గొయ్యి తవ్వాలి. గొయ్యి చాలా లోతుగా, వెడల్పుగా ఉండాలి. అలా చేస్తే

దాన్ని దాటి శత్రువు నగరంలో ప్రవేశించడానికి సాహసించలేదు. అయితే మొత్తం నగరం చుట్టూ కందకం తవ్వాల్సిన పనిలేదు. నగరానికి మూడు వైపులా సహజ సిద్ధంగానే మంచి బందోబస్తు ఉంది. ఒక వైపు గుట్టలు. మరోవైపు పెద్ద పెద్ద తోటలు ఉన్నాయి. మూడవ వైపు నివాస గృహాలు ప్రహరీ గోడలా పటిష్టంగా ఉన్నాయి. ఇక ఒక్క సిరియా వైపు మాత్రమే ఖాళీ మైదానం ఉంది. అటు వైపు నుండే శత్రువులు దాడి చేయడానికి ఆస్కారం ఉంది. కాబట్టి మనం అటువైపు అగడ్త తవ్వితే సరిపోతుంది."

"కనీసం పది గజాలు వెడల్పు, ఐదారు గజాలు లోతు ఉండేలా తవ్వాలి. కందకంలో నుంచి వచ్చిన మట్టిని మన వైపు ఎత్తుగా ఇసుక కొండలా పోయాలి. ఈవిధంగా బయటి వైపు అగడ్త, లోపలి వైపు ఎత్తయిన మట్టిదిబ్బ ఏర్పడి శత్రువు నగరంలోకి చొచ్చుకురావడానికి ఆస్కారం ఉండదు" అంటూ తన పథకాన్ని వివరించారు సల్మాన్ ఫార్సి ( రజి).

ఈ సలహా విని దైవప్రవక్త (సఅసం) చాలా సంతోషించారు. ఆయన ముఖం కలువ పువ్వులా విప్పారింది.

" కందకం అంటే నగరాన్ని రక్షించుకునే గొయ్యి, శత్రువు గుర్రం ఎక్కి కూడా దాన్ని దాటి రాలేడు. ఈ పథకం చాలా బాగుంది" అన్నారు దైవప్రవక్త (సఅసం) సల్మాన్ ఫార్సిని మెచ్చుకుంటూ.

దైవప్రవక్త (సఅసం) ఆదేశం ప్రకారం మరునాడే అందరూ అగడ్త తవ్వడం ప్రారంభించారు.

చలి.... ఎముకలు కొరికే చలి. ప్రజలు వెచ్చని ఉన్ని దుస్తులు ధరించి ఇళ్ళలోనే ఉండేవారు. అయితే చలికి శరీరం వణికిపోతున్నా ముస్లిం యోధులు మాత్రం రాత్రివేళ ఆరు బయట ఆకాశం కిందనే పడుకునేవారు.

వారికి గుడారాలూ లేవు. కనీసం ఆ ప్రాంతంలో ఓ చెట్టు కూడా లేదు. చాలమంది దగ్గర కప్పుకోవడానికి సరైన దుపట్లు కూడా లేవు. చాలీచాలని ఆ దుప్పట్లే కప్పుకొని పడుకునేవారు. ఒక్కోసారి చలితీవ్రతకు తట్టుకోలేక, నిద్రపట్టక మోకాళ్ళకు తల ఆనిచ్చి ముడుచుకొని కూర్చొనేవారు. ఆ స్థితిలోనే వారు రాత్రంతా గడిపి ప్రాతః కాలాన ఫజర్ నమాజు ముగించుకొని కందకం తవ్వే పనిలో నిమగ్నులయ్యేవారు.

స్వయంగా దైవప్రవక్త( సఅసం) కూడా ఆరుబయట ఆకాశం కిందనే రాత్రంతా గడిపి సహచరులతో పాటు తవ్వకం పనిలో పాల్గొనేవారు. కొన్నాళ్ళకు తమ ప్రియతమ నాయకుని కోసం ఓ గుడారం ఏర్పాటు చేశారు అనుచరులు. దైవప్రవక్త( సఅసం) అందులోనే బస చేసేవారు.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఓ సాధారణ వ్యక్తిగా మట్టిపనిలో పాల్గొన్నారు ఇంతకుముందు కూడా ఆయన రెండుసార్లు తన సహచరులతో ఇలాంటి పనిలో పాల్గొన్నారు. ఒకసారి కాబా గృహం పునర్నిర్మాణంలో, రెండోసారి మదీనా లోని మస్జిదెనబవి నిర్మాణంలో. ముస్లింలు తవ్వుతున్న ఈ అగడ్తను చూసి యూదులు, బహుదైవారాధకులు వారిని ఎగతాళి చేసేవారు. పనీ పాటా ఏమీ లేదేమో గోతులు తవ్వుతున్నారు అని సూటిపోటిగా అంటుండేవారు.

ఒకరోజు దైవప్రవక్త (సఅసం) గుడారంలో విశ్రాంతి తీసుకుంటుండగా కొంతమంది అనుచరులు అక్కడికి వచ్చారు. వారిలో హజ్రత్ అబూ బక్ర్ సిద్దీఖ్ (రజి), హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి), హజ్రత్ ఉస్మాన్ గని (రజి), హజ్రత్ అలీముర్తుజా (రజి), హజ్రత్ సాద్ బిన్ వక్కాస్ (రజి) , హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) ప్రభృతులు ఉన్నారు.

హజ్రత్ ఉమర్ (రజి) దైవప్రవక్తను ఉద్దేశించి "దైవప్రవక్తా! మేము లోనికి రావచ్చా?" అని అనుమతి కోరారు.

"రండి....రండి! ఏమిటి విశేషం?" అన్నారు దైవప్రవక్త (స). అందరూ లోనికి ప్రవేశించిన తరువాత "ముఖ్యమైన విషయం మాట్లడాలి" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి).

"చెప్పండి" అన్నారు దైవప్రవక్త (సఅసం) చిరునవ్వుతో.

"మదీనా యూదులు, బహుదైవరాధకులు మనం తవ్వుతున్న అగడ్తను చూసి నవ్వుకుంటున్నారు. ఎగతాళి చేస్తున్నారు. దానివల్ల మాక్కాస్త ఇబ్బందిగా ఉంది" ఫిర్యాదు చేశారు హజ్రత్ ఉమర్ (రజి).

"మీరేమీ బాధపడకండి. వాళ్ళకు అదేమిటో తెలియదు. అంతెందుకు అసలు అగడ్త అంటే ఏమిటో మొదట్లో మనక్కూడా తెలిసేది కాదు. అందుకే వాళ్ళు ఇదేదో పిచ్చోళ్ళ పనిలా ఉంది అని నవ్వుకుంటున్నారు" అని సర్ది చెప్పారు దైవప్రవక్త (సఅసం)

"మీరన్నది నిజమే. మనమేదో గొయ్యి తవ్వుతున్నారనుకుంటున్నారు. వాళ్ళు కూడా మనతో సహకరించాలి కదా" అన్నారు హజ్రత్ ఉమర్ (రజ)

"స్నేహ ఒప్పందంలో వాళ్ళు కూడా చేరిఉన్నారనే విషయాన్ని దృష్టిలో పెట్టుకుని నీవీ మాట అంటున్నావనుకుంటా!" అన్నారు దైవప్రవక్త (సఅసం)

" అవును. మదీనా భద్రతకు ఏదైనా భంగంకలిగితే దాన్ని రక్షించుకోడానికి వారు మనకు సహకరిస్తామని ఒప్పుకున్నారు గదా! దాని ప్రకారం నగర రక్షణ కోసం వాళ్ళు కూడా ఈ త్రవ్వకం పనిలో పాల్గొనాలి" అన్నారు ఉమర్ (రజి).

"అవును నీవంటున్నది నిజమే! మదీనా యూదులు, బహుదైవారాధకులు, ముస్లింలు అందరూ కందకం తవ్వే పనిలో పాల్గొనాలని చాటింపు వేయించు." అన్నారు దైవప్రవక్త (సఅసం).

"చాటింపు వేయించినా యూదులు, బహుదైవారాధకులు మనకు సహకరిస్తారని నమ్మకం ఏమిటీ?" సందేహం వెలిబుచ్చారు హజ్రత్ అలీ (రజి).

"నా అభిప్రాయం కూడా అదే. కాని విషయం వారికి తెలపనంత వరకూ మనం వారిని అనుమానించడం భావ్యం కాదు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"అవును, పదండి వెంటనే ప్రకటన చేద్దాం" అన్నారు అబూబక్ర్ (రజి).

"బనూఖురైజా నాయకుడు కాబ్‌కు, బహుదైవారాధకుల నాయకులకు ప్రత్యేకంగా ఆహ్వానాలు పంపండి" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"నేను వారి వద్దకు దూతల్ని పంపుతాను" అన్నారు అబూబక్ర్ (రజి).

తర్వాత వారంతా గుడారం నుండి బయటికొచ్చారు. అది మిట్టమధ్యాహ్నం సమయం కాబట్టి తవ్వకం పనివల్ల అలసి ముస్లింలు విశ్రాంతి తీసుకుంటున్నారు. హజ్రత్ అబూబక్ర్(రజి) నగరంలో చాటింపు వేయించడానికి ఓ మనిషిని పురమాయించి మిగతా నాయకుల వద్దకు ప్రత్యేక దూతల్ని పంపించారు.

"మదీనా పాలకుడు, దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఆజ్ఞ. మదీనా పౌరులంతా వారేమతానికి చెందినవారైనా, ఏ తెగకు చెందిన వారైనా ముస్లింలు చేపట్టిన కందకం తవ్వకం పనిలో విధిగా పాల్గొనాలి......" అంటూ ఓ మనిషి

చాటింపు వేస్తూ పోతున్నాడు. ఈ చాటింపు విని దైవ విరోధి అబ్దుల్లా బిన్ ఉబై ఒక్కసారిగా మండిపడ్డాడు. అతడు పైకి ముస్లింగా మారినా అతడి మనసులో మాత్రం కాపట్యరోగం ఉంది. దైవప్రవక్త (సఅసం) పట్ల ఎనలేని ఈర్ష్యా ద్వేషాలు ఉండేవి అతడిలో. అంతలో అబూబక్ర్ (రజి) పంపిన ప్రత్యేక దూత కూడా వచ్చి ఈ విషయం వినిపించాడు.

"మదీనా పాలకుడా! అడిగేవాడెవడూ లేక ఇష్టారాజ్యం చేస్తున్నావు. ఆగండాగండి. మక్కా ఖురైషియులు వస్తున్నారు. అప్పుడు తెలుస్తాయి మీ రాచ మర్యాదలు. అయినా మాకు గోతులు తవ్వాల్సినంత ఖర్మేం పట్టింది?" అన్నాడు అబ్దుల్లా బిన్ ఉబై ఆగ్రహంతో మండిపడుతూ.

అబ్దుల్లా బిన్ ఉబై గొప్ప ధనవంతుడు. ప్రజల్లో పలుకుబడి ఉన్న పెద్ద మనిషి. ఈ కారణంగానే ప్రజలు అతణ్ని గౌరవించి మదీనాకు రాజుగా చేయాలని అనుకున్నారు మొదట్లో. ఎప్పుడూ అతని వెంట అతని అడుగులకు మడుగులొత్తే కొంతమంది చెంచాలు ఉండేవారు.

వారిలో ఒకడు "మదీనాను పాలించాలని కలలు కంటున్నాడా? ఎంత ఆశ ! వీళ్ళను మట్టుపెట్టి సర్వనాశనం చేసే పెనుతుఫాను వస్తోందని పాపం తెలియదు కాబోలు" అన్నాడు వెటకారంగా.

"మక్కా వాసులు బహిష్కరిస్తే మన దగ్గరికొచ్చి శరణు పొందినవాళ్ళు చివరికి మన మీదనే అధికారం చెలాయిస్తున్నారు! వ్యవహారం ఏం చేస్తాం! మన ఖర్మ!" అన్నాడు రెండవవాడు ముఖం చిట్లిస్తూ.

" అసలిది అబ్దుల్లా బిన్ ఉబై ఇచ్చిన అలుసే. ఇతణ్ని రాజుగా చేయడానికి మనం కిరీటం కూడా చేయించాము. దాన్ని అలంకరించి రాజుగా ప్రకటించు కోవడమే మిగిలిఉండింది. అప్పుడు ఏగోడవా ఉండేదికాదు. కాని ఇతడే వాళ్ళ మతంలో చేరాడు. మనమేం చేస్తాం" అన్నాడు మూడవవాడు నిట్టూరుస్తూ.

"నీకు తెలియదు లేవోయ్, నేనొక పథకం ప్రకారమే వాళ్ళ మతంలో చేరాను. త్వరలోనే నేను వాళ్ళ బండారం బయటపెడతాను. మక్కా ఖురైషీయుల్ని కాస్త రానివ్వు. మనమేమీ చెయ్యకుండానే ముస్లింల చిరునామా గల్లంతవుతుంది.

మీరలా చూస్తూఉండండి. నా పథకం ఏమిటో తెలుస్తుంది." అన్నాడు ఇబ్నెఉబై మనసులోని కాపట్యాన్ని బయటపెడుతూ.

అటు బనూ ఖురైజా నాయకుడు కాబ్ బిన్ అసద్‌కు కూడా ప్రత్యేక సందేశం అందింది. అప్పుడు కాబ్ తన ఇంట్లో కూర్చొని సహచరులతో సంభాషిస్తున్నాడు. ముస్లింల దూత చెప్పిన మాటలకు కాబ్ పకాలున నవ్వాడు.

"ముస్లింలెంత బలసిపోయారో చూడండి. మనం వెళ్ళి కందకం తవ్వాలట! మనమేమన్నా వాళ్ళ పాలేరులమా?" అన్నాడు. వాళ్ళు రాజులు. మనం బానిసలం కదా! వారాజ్ఞాపిస్తే మనం శిరసావహించాలి మరి!" అన్నాడొకడు.

" వాళ్ళకేదో పిచ్చి పట్టింది. వాళ్ళనెత్తిన కూర్చున్న శని వారితో ఇలాంటి చేష్టలు చేయిస్తోంది పాపం." అన్నాడు రెండవవాడు జాలిగా చూస్తూ.

" అదేం కాదు వాళ్ళు తమ తమ సమాధులు తవ్వుకుంటున్నారు." అన్నాడు మరొకడు వ్యంగ్యంగా. దాంతో అందరూ విరగబడి నవ్వారు.

" అరెరె అలా నవ్వుతారెందుకు? మనం కూడా వాళ్ళ సమాధులు కాస్త తవ్వి వారికి సాయం చేద్దాం." అన్నాడు మొదటివాడు.

" మనమేమన్నా సమాధులు తవ్వేవాళ్ళమా?" అన్నాడు కాబ్. మళ్ళీ పకపకలతో భవనం దద్దరిల్లి పోయింది.

"అది సరే, వాళ్ళ బుర్రల్లో ఈ గోతులు తవ్వే ఆలోచన ఎందుకొచ్చిందబ్బా?" అన్నాడు కాబ్.

"సరే తవ్వనివ్వండి. అదే గోతుల్లో వారిని పూడ్చిపెడదాం". అన్నాడొకడు కాబ్ మాట పూర్తికాకముందే.

"నువ్వన్నట్లు వారిని ఆ గోతుల్లోనే పూడుస్తా చూస్తూఉండు"అన్నాడు కాబ్.

"సరే గాని, మేము సమాధులు తవ్వేవాళ్ళం కాదు. మదీనాలో సమాధులు తవ్వేవాళ్ళు చాలామంది దొరుకుతారు. నువ్వక్కడికి వెళ్ళు" అన్నాడు కాబ్ ముస్లింల దూతతో. మళ్ళీ విరగబడి నవ్వారంతా.

"మనమంతా ఒప్పందాన్ని పాటించాలి గదా? అన్నాడు ముస్లిం దూత ప్రశాంతంగా ఇంత అవమానం జరిగినా.

"మేము ఏ ఒప్పందానికీ బద్ధులం కాము" అన్నాడు కాబ్.

ముస్లింల దూత తిరిగొచ్చి కాబ్ ఇచ్చిన సమాధానం దైవప్రవక్త (సఅసం)కు విన్పించాడు. అంతలో అబ్దుల్లాబిన్ ఉబై దగ్గరికి వెళ్ళిన దూత కూడా వచ్చి ఇలాంటి విషయమే తెలిపాడు దైవప్రవక్త (సఅసం)కు.

" చెప్పడం మన బాధ్యత కాబట్టి చెప్పాము. వాళ్ళురానీయండి. రాకపోనీయండి. మనకనవసరం మన రక్షకుడు దేవుడే. మనం అపజయం పాలవుతామని వాళ్ళు భావిస్తున్నారు. జయాపజయాలు దేవుని అధీనంలో ఉన్నాయి. ఏమైనా దేవుడు తన ధర్మాన్ని, ఆ ధర్మావలంబీకుల్ని తప్పకుండా రక్షించు కుంటాడు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

మధ్యాహ్నం జొహర్ నమాజు తరువాత ముస్లింలు యధాప్రకారం తవ్వకం పనిలో నిమగ్నులైపోయారు. కొంతమంది తవ్వుతుంటే మరి కొంతమంది మట్టి ఎత్తిపోస్తున్నారు. ఇంకొందరు ఆ మట్టిని కందకం అంచుమీద ఎత్తుగా దిబ్బలాగా పోస్తున్నారు. ఈవిధంగా పని చకచకా సాగిపోతోంది.

ఆనాడు అరబ్బులకు అగడ్త అంటే ఏమిటో తెలియదు. దాని వల్ల కూడా శత్రుబారి నుండి రక్షించుకోవచ్చనే సంగతి వారికి తెలియదు. అందుకే ముస్లింలు తవ్వుతున్న అగడ్తను మదీనా ముస్లిమేతరులు వింతగా చూడసాగారు.

ఈ అగడ్త వల్ల శత్రువులు అకస్మాత్తుగా దాడి చేయడానికి అవకాశం ఉండదు. అయితే మదీనాకు వెనుక వైపు దట్టమైన తోటలున్నాయి. శత్రువులు ఆ తోటల్లోకి ప్రవేశించి దాడి చేసే ప్రమాదం ఉంది గనుక అటువైపు కూడా తగిన బందోబస్తు ఏర్పాటు చేయడం జరిగింది. తమ పట్టణాన్ని రక్షించుకునే బాధ్యత నగరపౌరులందరికీ ఉంది. అయినప్పటికి మదీనా యూదులు, బహు దైవారాధకులు ముస్లింలతో సహకరించడం లేదు. అయినా ముస్లింలు శక్తి వంచన లేకుండా తగిన ఏర్పాట్లు చేస్తూనే ఉన్నారు. అయితే ముస్లింలు చాలా పేదవారు. కేవలం ఖర్జూరాల పైనే వారి జీవనం ఆధారపడి ఉండేది. కాస్తంత స్థిమితం దొరుకుతుందేమో ఆర్థికంగా కాస్త బలం పుంజుకుందామనుకునేవారు. కాని శత్రువులు వారికి ఆ అవకాశమే రానిచ్చేవారు కాదు.

దైవప్రవక్త (సఅసం) కూడా ముస్లింలకు కాస్త మనశ్శాంతి దొరికితే ఒక వైపు వ్యాపారం చేస్తూ, మరోవైపు జనసామాన్యానికి ఇస్లాం సందేశాన్ని అందజేయా

లని భావించేవారు. కాని ఆ అవకాశమే లభించేది కాదు. అలజడులు, యుద్ధ మేఘాలు ఏర్పడే చోట సాధారణంగా నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటుతాయి. మదీనాలో కూడా అదే జరిగింది. ప్రతి వస్తువు ధర విపరీతంగా పెరిగిపోయింది. ముఖ్యంగా తినుబండారాల విషయం చెప్పనవసరమే లేదు. ఈ పరిస్థితి కూడా ముస్లింలపై ఆర్థికంగా తీవ్రప్రభావాన్ని చూపింది.

అది వెన్నెలరేయి. పూర్ణశశాంకుని వెలుగురేఖలతో నేలంతా పట్టు వస్త్రం పరిచినట్లు తళతళా మెరిసిపోతోంది. ఆ చంద్రకాంతికి సుదూర దృశ్యాలు సైతం స్పష్టంగా కనిపిస్తున్నాయి. నగరం చుట్టూ ఇరవై పాతిక గజాలకు ఒక్కొక్కరు, ఇద్దరిద్దరేసి చొప్పున పహరా కాయడానికి నియమించబడ్డారు. వెన్నెల రేయిలో, ఎముకలు కొరికే చలిలో దుప్పటి కప్పుకొని పహరా కాస్తున్నాడు సుహైల్. చలిపులి గడగడ లాడిస్తోంది. దీని బారినుండి శరీరాన్ని రక్షించుకోవడానికి ముస్లింల దగ్గర సరైన దుస్తులు కూడా లేవు. ఉధృతంగా వీస్తున్న చలిగాలికి తోడు మంచు కూడా దట్టంగా కురుస్తూ జనాన్ని గజగజ వణికిస్తూంది. ఆ తీవ్రమైన చలిగాలులకు వారు తట్టుకోలేకపోతున్నారు. చలిగాలి రయ్ మంటూ దూసుకొచ్చి శరీరానికి బాణాల్లా తగిలేది, కంటికి కునుకూ, ఒంటికి సుఖమూ కరవైపోయాయి.

ముస్లింలంతా ఉజూ చేసి మైదానంలో గుమికూడారు. ఈలోగా దైవప్రవక్త (సఅసం) కూడా వచ్చారు. ఆయన నాయకత్వంలో దాదాపు మూడువేలమంది ముస్లింలు నిర్మలహృదయంతో నమాజ్ చేశారు. అనంతరం వీరంతా ఖుర్ఆన్ పారాయణంలో లీనమైపోయారు. బాల భానుడి లేతకిరణాలు మైదానం నిండా పరచుకొని వెచ్చ వెచ్చగా శరీరాలకు తగులుతూఉంటే వీరంతా ఉత్సాహంగా లేచి తమతమ పనుల్లో నిమగ్నులైపోయారు. వారు అనేక బృందాలుగా విభజించ బడ్డారు. ప్రతి ఒక్కరూ హజ్రత్ సల్మాన్ (రజి) తమ బృందంలో ఉండాలని అభిలషించేవారు. సల్మాన్ ఫార్సీ (రజి) గొప్ప బలశాలి, ఆజానుబాహుడు. ప్రతి జట్టు ఆయన తమలో ఉండాలని కోరుతుండడం వల్ల దైవప్రవక్త (సఅసం) "సల్మాన్ నాతో ఉంటాడు" అని ప్రకటించి ఈ వివాదానికి తెరదించారు. దాంతో అందరూ సంతృప్తి చెందారు.

దైవప్రవక్త (సఅసం) జట్టులో హజ్రత్ సల్మాన్ (రజి)తో పాటు హజ్రత్ హుజైఫా (రజి), హజ్రత్ నోమాన్ (రజి)లు అగడ్త తవ్వకం ప్రారంభించారు. దైవప్రవక్త ఇంకా ఖుర్ఆన్ పఠిస్తూనే ఉన్నారు. ఇలా వీరు కందకం తవ్వుతుంటే దానిలో ఓ

పెద్ద బండరాయి అడ్డొచ్చింది. హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి), ఆయన సహచరులు పలుగులతో దాన్ని కొట్టి కొట్టి విసిగిపోయారు. కాని ఆ శిల కాస్త కూడ పగల్లేదు. చుట్టుప్రక్కల తవ్వే ఇతర సహచరులు కూడా అక్కడ గుమిగూడారు. వీరంతా ఆ రాయిపై యుద్ధం చేశారు. కాని అది ఏమాత్రం చెక్కుచెదర లేదు.

చివరికి ఈ విషయం దైవప్రవక్త (సఅసం)కు తెలియజేశారు. దైవప్రవక్త రాగానే వీరంతా ఆ రాయి పగలడం అసాధ్యం కనుక, పక్కన తవ్వు కోవడం మంచిదని సలహా ఇచ్చారు. దైవప్రవక్త (సఅసం) చిరునవ్వుతో పలుగు తీసుకొని గోతిలోకి దిగి "బిస్మిల్లాహ్" అంటూ ఒక్క వ్రేటువేశారు. ఈ వ్రేటుతో శిలపై సన్నని పగులు ఏర్పడి దాన్నుండి తళుక్కున వెలుగు కిరణాలు ప్రసరించాయి. వెంటనే దైవప్రవక్త (సఅసం) "అల్లాహు అక్బర్" అంటూ నినదించారు. అప్రయత్నంగా సహచరుల నోట కూడా ఈ నినాదం వెలువడి ఆ ప్రదేశమంతా మారుమ్రోగి పోయింది. దైవప్రవక్త (సఅసం) రాతిపై మరోవేటు వేశారు. దాంతో శిల మరికాస్త పగిలి మళ్ళీ దాని నుండి వెలుగు విరజిమ్మింది. వెంటనే దైవప్రవక్త (సఅసం) మూడవ వేటువేశారు. దాంతో ఆ శిలముక్కలు ముక్కలుగా పగిలి దేదీప్యమానమైన వెలుగు విరజిమ్మింది. క్షణంపాటు పరిసరాలన్నీ ప్రకాశవంతమయ్యాయి. దైవప్రవక్త (సఅసం) తక్బీర్ నినాదం చేశారు. అనుచరులు కూడా దైవప్రవక్తను అనుసరించారు.

దైవప్రవక్త(సఅసం) కందకం నుండి పైకి వచ్చాక అనుచరులంతా తొంగి తొంగి చూడసాగారు. అంతటి శక్తివంతమైన ఆ శిలను దైవప్రవక్త మూడే మూడు దెబ్బలకు నుజ్జు నుజ్జు చేయడం పట్ల వారు ఆశ్చర్యచకితులయ్యారు.

"ఇందులో ఆశ్చర్యమేముంది. ఇది నిస్సందేహంగా దైవదౌత్యమహిమే" అన్నారు ఒకరు.

"అవును నిస్సందేహంగా ఇది మహిమే. ఇంతటి శక్తివంతమైన శిల పగలడం మానవశక్తికి అతీతమైన పని" అన్నారు మరొకరు.

"దైవప్రవక్తా! మీరు పలుగుతో శిలపై కొట్టినప్పుడు దానిలో నుండి వెలుగు కిరణాలు ప్రసరించాయేమిటి? అనడిగారు అనుచరులు వినయంగా.

"నీవు కూడా ఆ వెలుగు చూశావా?" దగ్గరే నిలబడి ఉన్న సల్మాన్ ఫార్సి(రజి)ని అడిగారు దైవప్రవక్త (సఅసం).

"ఔను దైవప్రవక్తా! నేను, నాతో పాటు ఉన్న ఇతర సహచరులంతా ఈ వెలుగు చూశారు" చెప్పారు సల్మాన్.

"నేను మొట్టమొదట పలుగుతో శిలను కొట్టినప్పుడు జిబ్రీల్ అలైహిస్సలాం ప్రత్యక్షమై యమన్ దేశం తాళపుచెవులు నాకు అప్పగించారు. రెండవసారి కొట్టినప్పుడు సిరియా దేశం తాళపు చెవులు అప్పగించారు. మూడవ సారి కొట్టినప్పుడు ఈరాన్ దేశం తాళాలు నా చేతికిచ్చి "ఈ మూడు దేశాలు మీ అనుచర సమాజం అధీనంలోకి వస్తాయి" అన్నారు జిబ్రీల్." దైవప్రవక్త (సఅసం) చిరునవ్వు నవ్వుతూ పై విషయాన్ని వివరించారు.

ఈ శుభవార్త విని ముస్లింలు ఆనందంతో పొంగిపోయారు. అల్లాహు అక్బర్ అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు.

"పచ్చని పంట చేలతో కళకళలాడే సారవంతమైన భూములు, ధనధాన్యాలతో తులతూగే ఆ దేశాలు మీ ఆధీనంలోకి వస్తాయని శుభవార్త చెబుతున్నాను. ఆ దేశాలపై నేడు క్రైస్తవులు, బహుదైవారాధకులు పెత్తనం చెలాయిస్తున్నారు. ఏ జాతికి దేవుడు సిరిసంపదలు, గౌరవమర్యాదలు, అధికారం ప్రసాదిస్తాడో ఆ జాతి సుఖభోగాల్లో, ప్రాపంచిక వ్యామోహంలో పడి దైవాన్ని మరచిపోతుంది. దైవాన్ని విస్మరించే జాతి నుండి దేవుడు తన అనుగ్రహాలను, వరాలను వెనక్కి తీసుకుంటాడు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

ఈ శుభవార్త విని హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి) ఎంతో సంతోషించారు. ఆ తరువాత అందరూ వెళ్ళి త్రవ్వకం పనుల్లో తిరిగి నిమగ్నమైపోయారు. తవ్వకం పని జోరుగా సాగుతోంది. ముస్లింల ఉత్సాహం చూసి మదీనాలోని ఇతరులకు కూడా దీని పట్ల ఆసక్తి జనించింది. ముఖ్యంగా మదీనాలో మూడు రకాల మనుషులున్నారు. విగ్రహారాధకులు ఒకరకం. రెండవ రకం యూదులు. వీరు మూసా ప్రవక్త (అలైహి) అనుయాయులు. ఇక మూడవ రకం కపట ముస్లింలు. వీరు పైకి ముస్లింలుగానే ఉండి లోలోపల ముస్లింలకు వ్యతిరేకంగా కుట్రలు పన్నేవారు. వీరి నాయకుడు అబ్దుల్లా బిన్ ఉబై. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) నోట యమన్, సిరియా, ఈరాన్ దేశాలు ముస్లింల హస్తగతమవుతాయన్న శుభవార్త వినగానే ఈ కపట నాయకుని నోట్లో నీళ్ళూరాయి. ఒక వేళ నిజంగానే ఇలా జరిగితే ఆ భోగ భాగ్యాలను తానెందుకు జారవిడుచుకోవాలనే ఉద్దేశంతో అతడు, అతడి అనుచరులు కూడా ఈ తవ్వకంపనిలో పాల్గొన్నారు.

అరబ్బులకు, యూదులకు అగడ్త అంటే ఏమిటో తెలియదు. ఈ పదాన్ని వారెప్పుడూ విననైనా వినలేదు. అందుకని శత్రుదాడి నుండి రక్షణ కోసం అగడ్త తవ్వుతున్నారనే విషయం తెలిసి ప్రజలు ఎంతో ఆసక్తిగా గుంపులు గుంపులుగా రాసాగారు. స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూ ఈ కందకాన్ని చూసి తెగ ఆశ్చర్యపోయేవారు.

ఓరోజు రీహానా వద్దకు జూనా వచ్చింది. స్నేహితురాళ్ళిద్దరూ చాలాసేపు కబుర్లు చెప్పుకున్నారు. మాటల సందర్భంలో రీహానా జునాతో ఇలా అన్నది:

"జూనా ! ఈ మధ్య ఒక కొత్త పదం వాడుకలో కొచ్చింది నీకు తెలుసా!"

"అవునవును. ఈ మధ్యనే ఒక పదం విన్నాగాని దాని అర్థం తెలియలేదు" అన్నది జూనా ఆసక్తిగా.

"అవునవును నాక్కూడా ఎవరో ఈ విషయమే చెప్పారు."

"ఇంతకూ ఆ పదం ఏమిటో చెప్పవే" అన్నది రీహానా.

"నాకసలు గుర్తే లేదు."

"అవునులే నీకెందుకు గుర్తుంటుంది." వ్యంగంగా అన్నది రీహానా.

"నిజమేనే నాకసలు గుర్తేలేదు నిజం ఒట్టు."

"ఊ...నేను చెపుతా విను. ఆ పదం "కందకం" చెప్పింది రీహానా.

"ఆ......... ఇప్పుడు గుర్తొచ్చింది అవునవును కందకమే."

"పేరు భలే ఉంది కదూ? పేరుకి తగ్గట్టుగానే ఆ వస్తువు కూడా విచిత్రంగానే ఉంటుందనుకుంటా?"

"వస్తువేమిటే నీ మొహం అదొక గొయ్యి. ముస్లింలు ఈ గొయ్యెందుకు తవ్వుతున్నారో, వాళ్ల ఆలోచన ఏమిటో!" అన్నది జూనా నవ్వుతూ.

"వాళ్ళు దీని ద్వారా రక్షణఏర్పాట్లు చేసుకుంటున్నారట. నాన్నగారు చెప్పారు."

"రక్షణ ఏమిటి? ఎవరి నుండి రక్షణ?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది జూనా.

"మక్కా బహుదైవారాధకులు బ్రహ్మాండమైన సైన్యంతో ముస్లింలపై దాడికి వస్తున్నారు. నీకు తెలియదా?"

"అయితే ఈ గొయ్యి శత్రువుల బారినుండి వారినెలా కాపాడుతుంది?" మరోసారి ఆశ్చర్యపోయింది జూనా.

"మదీనాలో రక్షణ కోసం కోటలు లేవుగా, అందుకని ఓ పెద్ద గొయ్యి తవ్వితే శత్రువులు ఆ గోతిని దాటి రాలేరని వాళ్ళ ఉద్దేశం. అందుకే గొయ్యి తవ్వారు." వివరించింది రీహానా.

"అయితే మనం కూడా వెళ్ళి చూసొద్దామా?"

"పద వెళదాం. ఆ వింత చూడ్డానికి జనం తిరునాళ్ళకు వెళ్ళినట్లు వెళ్తున్నారు. మనం కూడా వెళ్ళి చూసొద్దాం పద" అంటూ ఇద్దరూ కలసి బయలుదేరారు.

ముస్లింలు జట్లు జట్లుగా చాలా దూరం వరకు విస్తరించి ఎవరి పనుల్లో వారు లీనమైఉన్నారు. వీరిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ గోతిలోకి తొంగి చూసి 'అమ్మో ఎంత లోతుందే' గొయ్యి అంటూ జూనాను చుట్టేసింది రీహానా.

"అమ్మో! ఆగవే నాకు కళ్లు తిరుగుతాన్నాయి" అంటూ ఇద్దరూ పక్కకు తప్పుకున్నారు.

అంతలో వారికక్కడ మట్టితట్ట మోస్తూ కనిపించాడు సుహైల్.

" ఏయ్, రీహానా! చూశావా?" అన్నది జూనా చేత్తో సుహైల్‌ను చూపిస్తూ.

"ఆ చూశాను" అంటూ నిట్టూర్చింది రీహానా.

" ఒక కూలి వానికి ఇతనికి తేడా ఏమిటి? ఇతనంటే నీకెందుకే అంత ప్రేమ" అన్నది జూనా.

"ప్రేమకు కొలమానం కూలివాడు, ధనవంతుడు అనేది కాదే! అతని సచ్ఛీలం, ఉన్నత వ్యక్తిత్వం మాత్రమే. ఆ రోజు అతను మన తోటకు రాకున్నా బాగుండేది. లేక మనం ఆ రోజు తోటకు పోకపోయినా బాగుండేది. బాహ్య సౌందర్యంతో పాటు అతని హృదయం కూడా నిర్మలంగా పరిశుద్ధంగా ఉంది. ఇప్పుడతన్ని చూస్తుంటే వెళ్ళి అతనికి సాయపడాలనిపిస్తోంది." అంటూ రీహానా తన మనోగతాన్ని వెల్లడించింది.

ఈ విధంగా స్నేహితురాళ్ళులిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ చాలా సేపు అక్కడే గడిపి తిరుగుప్రయాణమయ్యారు.

'అగడ్త' త్రవ్వకం శరవేగంగా సాగిపోతోంది. ఓ చోట ఇంకా కాస్తంత ఖాళీ ఉండిపోయింది. బయటివైపు అగడ్త, లోపలివైపు మట్టిగోడ, మట్టిగోడ పైభాగంలో శత్రుకార్యకలాపాలను తిలకించడానికి అక్కడక్కడ పెద్దపెద్ద రంధ్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. రోజురోజుకు శత్రువులు సమీపిస్తున్నట్లు దైవప్రవక్త (సఅసం)కు సమాచారం అందుతోంది. ముస్లింలు కందకం పని పూర్తిచేయడానికి శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నారు. కాని అది పూర్తికాకముందే శత్రుసైన్యం అట్టహాసంతో డప్పులు వాయిస్తూ, ఈలలు వేస్తూ అమిత సమరోత్సాహంతో దూసుకొస్తోంది.

సిపాయిల నినాదాలతో గుర్రాల సకిలింపులతో పరిసరాలన్నీ ప్రతిధ్వనిస్తున్నాయి. ముస్లింలను భయభ్రాంతులకు గురిచేయడానికి రకరకాల నినాదాలు చేస్తున్నారు శత్రువులు. ఇంత పెద్ద సైన్యం సకలహంగులతో సమైక్యంగా ఇంతకు ముందెన్నడూ కదిలిరాలేదు. వచ్చిరాగానే ఒక్కసారిగా ముస్లింలపై విరుచుకు పడితే వారు నామరూపాల్లేకుండా తుడిచిపెట్టుకుపోతారని మదీనాలోని ముస్లిమేతరులంతా భావిస్తున్నారు.

ముస్లింలే గనక అగడ్త తవ్వి ఉండకపోతే శత్రువులు తమ ఊహల్ని నూటికి నూరుపాళ్ళు నిజం చేసుకునేవారు. కాని వాళ్ళు నగరం దగ్గరికి చేరుకునేసరికి కందకాన్ని, ఆ మట్టిదిబ్బను చూసి అవాక్కయిపోయారు. వాళ్ళ ఆలోచనలన్నీ తారుమారయ్యాయి. ఊహించని ఈ పరిణామానికి వారికి దిమ్మ దిరిగి పోయింది. నిస్సత్తువ ఆవరించింది. ఇక చేసేదేమీ లేక కందకం అవతలి వైపు గుడారాలు వేసుకున్నారు.

ముస్లింలు మట్టి దిబ్బలపై ఎక్కి రంధ్రాల ద్వారా శత్రుసైన్యాన్ని అంచనా వేస్తున్నారు. గూఢచారులు ముందుగానే సమాచారం అందించినట్లు శత్రుసైన్యం ఇరవై నాలుగువేలకుపై చిలుకుగానే ఉంది. ముస్లింలు కేవలం మూడు వేలమందే ఉన్నారు. అంటే ఒక్కొక్కరికి ఎనిమిదేసి మంది చొప్పున ప్రత్యర్థులు ఉన్నారన్న మాట. పైగా ముస్లింల దగ్గర సరైన ఆయుధాలు, సరిపడ ఆహార పదార్థాలు కూడా లేవు. అందువల్ల వారు శారీరకంగా కూడా ఏమీ మెరుగైన స్థితిలో లేరు. శత్రువులు పెద్దఎత్తున రకరకాల తినుబండారాలు ఇళ్ళ దగ్గరి నుండే సిద్ధం చేసుకొని తెచ్చుకున్నారు. అయినా ముస్లింలు అంత పెద్ద సైనిక వాహినిని చూసి కూడా ఏమాత్రం ఆందోళన చెందలేదు. అచంచల విశ్వాసంతో "మేము దైవాన్ని

నమ్ముకున్న వాళ్ళం. సత్యతిరస్కారులకు భయపడే వాళ్ళం ఎంతమాత్రం కాదు." అన్నారు దృఢసంకల్పంతో.

ఒక పెద్ద రంధ్రం ద్వారా దైవప్రవక్త (సఅసం) కూడా శత్రుసైన్యాన్ని చూశారు. "ఈసారి బహుదైవారాధకులు పూర్తి శక్తియుక్తులతో, బలమైన ఆయుధ సామగ్రితో వచ్చారు. కాని మన సహాయకుడు దేవుడు అన్న విషయం పాపం వారికి తెలియదు కాబోలు. దేవుడు మనకు తప్పక సహకరిస్తాడు. దైవచిత్తమైతే ఈ సారి వారి ధనబలం, కండబలం, ఆయుధబలం అంతా అంతమైపోతుంది" అన్నారు దైవప్రవక్త(సఅసం).

తరువాత ఆయన కొన్ని ముఖ్యమైన విషయాలు వినడానికి అనుచరులందరూ తన దగ్గరకు రావలసినదిగా ప్రకటించమని హజ్రత్ బిలాల్ (రజి)ని ఆదేశించారు. బిలాల్ (రజి) వెంటనే ప్రకటన చేశారు. ప్రకటన వినగానే అనుచరులందరూ దైవప్రవక్త (సఅసం) గుడారం వద్ద గుమిగూడారు. అందరూ వచ్చి కూర్చున్న తరువాత దైవప్రవక్త (సఅసం) నిలబడి ఇలా ప్రసంగించారు:

"దైవాన్ని విశ్వసించిన వారలారా! మరోసారి శత్రువాహిని సకల హంగులతో, సముద్ర కెరటాల్లా మన పై దాడికి దూసుకొచ్చింది. శత్రుసైన్యం సంఖ్యాబలం, ధనబలం, కండబలాల్లో మన కంటే మెండుగా ఉంది. మనం చాలా తక్కువ సంఖ్యలో, బలహీనంగా ఉన్నాము. అయినప్పటికీ మన వెనుక అండగా దైవశక్తి ఉంది. వారికి వారి ధన-జనబలాలే అండ. సృష్టికర్త అయిన దేవుని ధర్మం కోసం మనం పోరాడుతున్నాం. కనుక ఆయన మనకు తప్పకుండా సహాయం చేస్తాడు. దైవచిత్తమైతే మనం తప్పక విజయం సాధిస్తాం. జిహాద్ (దైవమార్గంలో పోరాడడం) గొప్ప ఆరాధన అని మీకు తెలుసు. ఈ మార్గంలో పోరాడి ప్రాణాలు అర్పించేవారు స్వర్గానికి పోతారు. వారి పాపాలన్నీ క్షమించబడతాయి. ఒక ముస్లిం కోరుకునే గొప్ప కోరికల్లో షహాదత్ (దైవమార్గంలో చంపబడటం) మొట్ట మొదటి కోరిక. సత్యతిరస్కారుల హృదయాల్లో అవిశ్వాసరోగం తిష్ఠవేసి ఉంది. అందువల్ల వారు చావంటే భయపడతారు. ముస్లింలు ధర్మపోరాటం ద్వారా స్వర్గం కోరుకుంటారు. ఎప్పుడో ఒకప్పుడు తప్పకుండా మరణం సంభవిస్తుందని వారికి తెలుసు. అందుకే వారు మరణానికి భయపడరు. కనుక సోదరులారా! సహన స్థయిర్యాలతో ముందుకు సాగండి. దైవసహాయం తప్పకుండా మనల్నే వరిస్తుంది. వెళ్ళండి వెళ్ళి మీ మీ స్థానాల్లో స్థిరంగా ఉండండి."

దైవప్రవక్త(సఅసం) నోట వెలువడిన ఈ పలుకులు, విజయశుభవార్త విని ముస్లింలు ఆనందంతో పొంగిపోతూ ఎవరి స్థానాలకు వారు వెళ్ళిపోయారు.

మట్టిదిబ్బ అడ్డంగా ఉండటం వల్ల శత్రువులకు ముస్లింల కార్యకలాపాలు ఏమీటో తెలియడం లేదు. వారా రోజు విశ్రాంతి తీసుకొని రెండో రోజు ఉదయమే ఆయుధాలు ధరించి జెండాలు ఊపుకుంటూ బయలుదేరారు. సైన్యం ఇనుప కవచాలు ధరించి, తళతళ మెరిసే కరవాలాలు చేబూని తుఫానులా మదీనా వైపు కదిలింది. శత్రువులు కందకం దగ్గరకు చేరుకొని దాన్ని తేరిపార చూశారు. ఎట్టి పరిస్థితిలోనూ కందకం దాటలేమని భావించి ఢీలా పడిపోయారు.

కాని తవ్వకం జరగని వైపు నుండి రావడానికి ఆస్కారముంది కాబట్టి కొంతమంది వీరయోధులు అటువైపు పరుగెత్తారు. మరికొందరు కందకం లోతు, వెడల్పు చూసి బెంబేలెత్తిపోయారు. అందులో దిగడానికి సాహసించలేక పోయారు. ఒకవేళ ధైర్యంచేసి దిగినా ముస్లింలు పైనుంచి మట్టిదిబ్బలు కుమ్మరించారంటే ఆ గోతిలో సజీవసమాధి కావడం ఖాయం. ఈ భయంతో వారు దిక్కుతోచక చాలాసేపు అక్కడే నిలబడిపోయారు.

అంతలో ఒక నాయకుడు పిచ్చికుక్క కరిచినవాడిలా వెర్రిగా అరిచాడు. అతడి బుర్రలో ఓ ఆలోచన మెరిసింది. వెంటనే మట్టిదిబ్బ వైపుకు బాణాలు కురిపించమని సైన్యాన్ని ఆదేశించాడు. సైనికులు ఒక్క సారిగా కేకలు, ఈలలు వేస్తూ బాణాలు ఎక్కుపెట్టారు. చాలా సేపటివరకూ బాణాలవర్షం కురిపించారు. దీనివల్ల ముస్లింలకు ఎలాంటి నష్టం కలగలేదు. వచ్చిన బాణాలు వచ్చినట్లుగా మట్టిదిబ్బలో దిగబడిపోతున్నాయి.

శత్రువుల ఈ పన్నాగం నిష్ప్రయోజనం అయిపోయింది. అలా మధ్యాహ్నం దాకా శత్రువులు బాణాలు వేసి విసిగిపోయారు. చివరికి నిరాశతో అక్కడి నుండి వెనక్కి మరలారు. ముస్లింలు సంతోషంతో అల్లాహు అక్బర్ అంటూ నినదించారు. పథకం ఫలించక కోపంతో చిందులు తొక్కుతున్న శత్రువులకు ముస్లింల నినాదాలు వారి కోపాగ్నికి ఆజ్యం పోసినట్లయింది.

రెండో రోజు శత్రువులు దాడి చేసే సాహసం చేయలేకపోయారు. కాని ఆయుధాలు ధరించి కందకం అంచున కొద్ది దూరం నడచి చూస్తే ఒక చోట కొద్దిగా కందకం లేకుండా ఖాళీగా ఉన్నట్లు కన్పించింది, అయితే అక్కడ ముస్లిం

సైనికులు ఆకలిగొన్న పెద్దపులుల్లా చూస్తూ నిలబడ్డారు. శత్రుసైనికులు వాళ్ళను చూడగానే వణకిపోతూ తోకలు ముడిచి వెళ్ళిపోయారు. ఇలా శత్రువులు అనేక రోజులు కందకం ఒడ్డుపై తిరుగుతూ నిరాశతో వెళ్ళిపోతున్నారు.

ముస్లింలు రాత్రివేళ విపరీతమైన చలిలో ఆరుబయట ఆకాశం క్రిందనే కాస్త కునుకు తీసి ఉదయాన్నే మళ్ళీ ఆయుధాలు ధరించి తమ తమ నిర్ణీత స్థానాలకు వెళ్ళిపోయేవారు. ఇటువంటి విపత్కర పరిస్థితుల్లో శత్రువులు ఏదో ఒక రోజు కందకం తవ్వకుండా వదిలేసిన తోటల వైపుగా వచ్చి మదీనాలో ప్రవేశించి స్త్రీలు, పిల్లలపై దాడి చేస్తారేమోననే భయం కూడా కలిగేది. అందుకని దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) స్త్రీలను, పిల్లలను బనుఖురైజా వాడ సమీపంలో ఉన్న ఫారిగ్ కోటలోకి చేర్చి, "శత్రువులు ఒకవేళ మీపై దాడిచేస్తే మీరు కూడా ఎదురుదాడి చేస్తూ మాకు కబురుచేయండి. వెంటనే మేము వచ్చేస్తాం" అని ఆదేశించారు.

ముస్లిం యువకులు, వృద్ధులు అందరూ దైవప్రవక్త వెంట యుద్ధమైదానంలోనే ఉన్నారు. స్త్రీల, పిల్లల రక్షణ కోసం ఎవరూ నియమించబడలేదు. అనారోగ్యం కారణంగా ఎటూ కదలలేని స్థితిలో ఉన్న హజ్రత్ హస్సాన్ (రజి) మాత్రమే వారి రక్షణ కోసం నియమించడం జరిగింది.

ఇక కపటులు కూడా ముస్లింలలోనే ఉండి ఎలాగైనా ముస్లింలకు నష్టం కలిగించాలని కాచుకొని కూర్చున్నారు. కాని ముస్లింలు ధైర్యసాహసాల ముందు వారి ఎత్తులు ఫలించలేదు. ఎముకలు కొరికే చలి. పేగులు తెగిపోయే ఆకలి భరించలేక ముస్లింలు ఇంటిదారి పడతారని కపటులు భావించారు. కాని అలా కూడా జరగలేదు. కపటులు మరో పథకం ఆలోచించారు."మన స్త్రీలు, పిల్లలు సురక్షిత ప్రదేశంలో లేరు. ఒకవేళ శత్రువులు మనం ఇక్కడ ఉండడాన్ని గమనించిన మన స్త్రీలపై, పిల్లలపై దాడిచేసి చంపేస్తారేమో!" అంటూ ముస్లింల మధ్య భయాందోళనలు కలిగించడానికి ప్రయత్నించారు. కాని ముస్లింలు "మా స్త్రీలు అన్నార్ల సురక్షితమైన ఫారింగ్ కోటలో ఉన్నారు. వారి విషయంలో మా కెలాంటి భయం లేదు" అని స్పష్టంగా చెప్పారు. అప్పుడు కపటుల వారి మాటలు వినకుండా వాదులాటకు దిగారు. వారు ముస్లింల మనస్సుల్లో అనుమానాలు, అపనమ్మకాలు సృష్టించాలని మరో ఎత్తుగడ వేశారు. వారిలో ఒకడు ఇలా అన్నాడు: " మిత్రులారా! మామాట వినండి. ఒకవేళ మీ భార్యపిల్లలు ఫారిగ్ కోటలో ఉన్నా అదేమంత సురక్షితమైన కోటకాదు. అదీగాక అక్కడ రక్షణ కోసం పురుషులు కూడా ఎవరూ

లేరు. ఒకవేళ యూదులు, బహుదైవారాధకులు కలసి దాడిచేస్తే చనిపోవడమో లేక బందీలుగా పట్టుబడటమో తప్ప వారేం చేయగలరు.? అప్పుడు మన పరిస్థితి ఏమిటి? తరువాత పశ్చత్తాపం పడినా లాభం లేదు, ముందే జాగ్రత్త పడాలి."

"మా స్త్రీలు అంతపిరికి వాళ్ళు కారు. వాళ్ళకు తమను, తమ పిల్లలను రక్షించుకోవడం బాగా తెలుసు. మా స్త్రీల విషయంలో మాకెలాంటి భయం లేదు." అన్నాడో ముస్లిం.

"పురుషుల్ని స్త్రీలేం ఎదిరిస్తారు? ఒకవేళ స్వయంగా అన్సార్లే ఏ రాత్రి పూటో తమకోటను ఆక్రమించుకొని మీ ముహాజిర్ స్త్రీలను బంధిస్తే?

"అసలు నువ్వు ముస్లిమేనా? కట్టుబట్టలతో మేము వలస వచ్చినప్పుడు సకల విధాలా సాయపడి ఆదుకున్న వాళ్ళనే అనుమానిస్తున్నావా. వాళ్ళు మమ్మల్ని సొంతసోదరుల్లా చూశారు. మాకు పూర్తి సహాయసహకారాలు అంద జేశారు. ఆస్తుల నుండి కూడా వాటాలు పంచిచ్చారు. అన్సార్ సోదరులు చేసిన ఈ మేళ్ళను మేము మరువగలమా? దైవసాక్షి! అలా ఎన్నటికి జరగదు" అన్నాడా ముహాజిర్ ముస్లిం ఆగ్రహంతో. దాంతో కపటులు తాత్కాలికంగా నోరుమూశారు.

అయితే వారు తమ దుష్టయత్నాలు మాత్రం మానుకోలేదు. ఒక రోజు ఈ కపటులంతా సమావేశమై "ముస్లింలను బలహీనపరచడానికి ఎన్ని పన్నాగాలు పన్నినా లాభం లేకపోయింది. అందుచేత ఇప్పుడు మనం లేనిపోని వదంతులు వ్యాపింపజేసి వారి మనోధైర్యాన్ని దెబ్బతీయాలి" అని తీర్మానించుకున్నారు.

ఈ నిర్ణయంతో దుష్టయత్నాల్లో చేయి తిరిగిన కొంతమంది కపటుల రకరకాల పుకార్లు వ్యాపింపజేయడం ప్రారంభించారు. కాని ముస్లింలు ఆ ప్రయత్నాన్ని కూడా తిప్పికొట్టారు.

ఇంకా నిరాశ చెందని ఒక కపటి "సోదరా! ఈ రాత్రికి మక్కావాళ్ళు తప్పకుండా దాడిచేస్తారు. అనవసరంగా మనం ప్రాణాలెందుకు పోగొట్టుకోవాలి. పద ఇక్కణ్నుంచి పారిపోదాం" అన్నాడు ఒక ముస్లింతో.

"దైవప్రవక్తను వదలి పారిపోదామా?" అన్నాడా ముస్లిం ఆశ్చర్యంగా.

"ఎవరి ప్రాణం వారికే తీపి. దాన్ని దక్కించుకోవాలనుకున్నవాడు పారి

పోతాడు లేకపోతే నాశనమవుతాడు" అన్నాడా కపటి.

"నీ పాడుగాను, నువ్వసలు ముస్లింవి కావు. పరమ కపటివి. నిజమైన ముస్లిం దైవప్రవక్త (సఅసం)ను వదిలేసి పారిపోగలడా?" అన్నాడా ముస్లిం ఆగ్రహోదగ్రుడై.

"యమన్, సిరియా, ఈరాన్ సామ్రాజ్యాలను దైవం మన హస్తగతం చేస్తాడని దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) అన్నారు. కాని చూస్తే ఇక్కడ పరిస్థితి ఒంటేలికి పోవడానికే అనుకూలంగా లేదు. ఇదంతా మోసం కాకపోతే మరేమిటండీ?" అంటూ పెద్దపెద్ద కేకలు వేశాడు ముగీస్ బిన్ బషీర్ అనే మరో కపటి.

"మళ్ళీ నోరెత్తావంటే వళ్ళు హూనమయిపోతుంది ఏమనుకొంటున్నావో!" అని హెచ్చరించారు ముస్లింలు.

బనీ హారిసా, బనీ సల్మాన్ తెగలకు చెందినవాళ్ళు తాము ఇక్కణ్నుంచి వెళ్ళి పోతే ఆకలిదప్పులు, చలి తీవ్రతకు తోడు తమ నిష్క్రమణ ముస్లింలపై ప్రభావం చూపుతుందని, ఫలితంగా ముస్లింలు కూడా తమ వెంటే మూటముల్లే సర్దు కుంటారని భావించి ఒక నిర్ణయానికి వచ్చారు. ఈ రెండు తెగలకు చెందిన నాయకులు దైవప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరై "దైవప్రవక్తా! మా ఇండ్లు సురక్షితంగా లేవు. మదీనా యూదులు, బహుదైవారాధకులు దాడిచేస్తారని భయంగా ఉంది. మా భార్యాబిడ్డల రక్షణ కోసం మాకు మా ఇళ్ళకు వెళ్ళడానికి అనుమతివ్వండి". అని విన్నవించుకున్నారు.

"ప్రజలారా! మీరు ఇళ్ళకు పోవద్దని నేను వారించడం లేదు. నాతో ఉండ దలచుకుంటే ఇళ్ళకు వెళ్ళండి. మీపై ఎలాంటి ఆంక్షలేదు. కాని అబద్ధాలు మాత్రం చెప్పకండి. మీ ఇండ్లు సురక్షితంగానే ఉన్నాయి. కాని మీరు ముస్లింలను అధైర్యపరచాలని చూస్తున్నారు. వినండి ముస్లింలు మీరనుకొనే అంత పిరికివారు కాదు. ఇటువంటి ఉడత ఊపులకు బెదిరే రకం అంతకన్నా కాదు. తరువాత మీరే నష్టపోతారు. పశ్చాత్తాపపడతారు. కష్టాలపాలవుతారు. కాని ముస్లింలు సంతోషంగా లాభాల్లో ఉంటారు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

రెండవరోజు కపటులు యుద్ధ మైదానం నుండి ఒక్కొక్కరే జారుకోవడం ప్రారంభించారు, ఈ నాటకంతో కపటులు వెళ్ళిపోవడం వల్ల ముస్లింలు ఏమాత్రం కలత చెందలేదు. వారి విశ్వాసం మరింత ద్విగుణీకృతమయింది.

ఓరోజు రాత్రి రీహానా తన తండ్రి కాబ్ దగ్గర కూర్చొని "నాన్నగారూ! ఏమిటి ఆలోచిస్తున్నారు? ముస్లింలు ఓటమి పాలవుతారని భావిస్తున్నారా?" అన్నది.

"అవును అసలు ముస్లింలు ఎంతమంది ఉన్నారని? మహాఅయితే మూడు వేలమంది. మన సైన్యం ఇరవై నాలుగు వేలకు పైచిలుకే. కాబట్టి ముస్లింలు ఓడిపోవడం ఖాయం." దృఢవిశ్వాసంతో చెప్పాడు కాబ్.

"కాని నాన్నగారూ! ఇంతకు ముందు జరిగిన యుద్ధాల్లో కూడా ముస్లింలు తక్కువ, వారి శత్రువుల సంఖ్య ఎక్కువగానే ఉండింది. అయినప్పటికి విజయం ముస్లింలనే వరించింది కదా!"

" అవునమ్మా! నిజమే కాని అప్పుడంత పెద్ద తేడా లేదు. కాని ఈసారి ఒక్కొక్క ముస్లింకు వ్యతిరేకంగా ఎనిమిదేసి మంది ఉన్నారు. అంతేకాకుండా మక్కా ఖురైషీయులు, అరేబియాలోని ఇతర తెగలకు చెందిన ప్రముఖ నాయకులు కూడా ముస్లింలపై దాడికి వచ్చారు. ఈసారి ముస్లింలు ప్రాణాలతో బయట పడటం అసంభవం" అన్నాడు కాబ్ కృతనిశ్చయంతో.

రీహానాకు మొదటి నుండే ముస్లింలపై కాస్త గౌరవభావం ఉండేది. సుహైల్‌ను చూసిన తరువాత అతని గుణగణాలతో ప్రభావితురాలై ముస్లింలకు మరింత దగ్గరైపోయింది. అందుకని ముస్లింలతో యుద్ధం జరగడం రీహానాకు ఏమాత్రం ఇష్టం లేదు. ఒకవేళ యుద్ధం అనివార్యమైతే విజయం ముస్లింలనే వరించాలని మనస్ఫూర్తిగా కోరుకొనేది. ఈ కారణంగానే "నాన్నగారూ! మీరు పెద్ద మనిషిగా ఇరువర్గాల మధ్య సయోధ్య కుదర్చవచ్చు గదా"! అన్నది.

కాబ్ నవ్వుతూ "అమ్మా రీహానా! ముస్లింలు మనకు పరమ శత్రువులని నీకు తెలుసు. మన మిత్ర తెగ అయిన బనూనజీర్ తెగను వారు బహిష్కరించారు. ఈ కారణంగా వారిపై రోజుకు రోజు నాకు ఈర్ష్యాద్వేషాలు పెరిగిపోతున్నాయి. అలాంటప్పుడు నేను మధ్యవర్తిగా ఉండి సంధి ఎలా కుదుర్చుతాను? నేనైతే యుద్ధం జరగాలని, ముస్లింలు సంహరించబడాలని, వారి ప్రవక్త ముహమ్మద్ కూడా అంతమైపోవాలని మనసారా కోరుకుంటున్నాను" అని అన్నాడు.

"ఒకవేళ ముస్లింలే విజయం సాధిస్తే?"

"అది అసంభవం."

అంతలో ద్వారపాలకుడు వచ్చి" హుయ్యి బిన్ అఖ్తబ్ వచ్చి ద్వారం దగ్గర

ఉన్నారు, మిమ్మల్ని కలుసుకోవాలంటున్నారు" అన్నాడు.

కాబ్ ఏదో అనబోయేసరికి రీహానా అందుకొని "నాన్నగారూ! హుయ్యీ మహాదుష్టుడు. అతడు తన జాతిని కష్టాల్లో పడేసిందిగాక ఇప్పుడు మనల్ని కూడా ఆ ఊబిలో దించడానికి వచ్చాడు" అని అన్నది.

"అమ్మా! నీవంటున్నది నిజమే. నేను కూడా అతణ్ని అలాగే భావిస్తున్నాను. అతని జాతివారు కూడా అతణ్ని అలాగే భావిస్తున్నారు. కాని ప్రస్తుతం అతని ఆ దురదృష్టరేఖ మారిపోయింది. ఇప్పుడతడు ఎంతో శ్రమించి ముస్లింలకు వ్యతిరేకంగా ఇతర తెగలన్నిటినీ ఏకం చేశాడు. అతడే మక్కావారిని, ఇతర తెగలన్నిటినీ యుద్ధానికి పురిగొల్పి తీసుకొచ్చాడు. అందుకే ఇప్పుడు నాకు అతని పట్ల ఎంతో ప్రేమ జనించింది" అన్నాడు కాబ్.

"అయితే నాకో మాటిస్తారా"?

"ఏమిటమ్మా అది"

"మీరు ఈ యుద్ధంలో వారికి సహకరించనని మాటివ్వండి" అన్నది రీహానా.

"ఇది అసాధ్యం నేను ముందే హుయ్యీ ప్రతినిధికి మాటిచ్చి ఉన్నాను."

"ఒకవేళ వీరు పరాజయంపాలై ముస్లింలు విజయం సాధిస్తే అప్పుడు మనం కూడా శత్రువులకు సహకరించామని తెలిస్తే ముస్లింలు ఊరుకుంటారా?" అన్నది రీహానా.

"ఇటు సూర్యుడు అటు ఉదయించినా ఇది ఎంతమాత్రం జరగదు. నువ్వేమీ కంగారుపడకు. ముస్లింల విజయానికి ఇప్పుడు ఏమాత్రం అవకాశాలు లేవు."

"నాన్నగారూ! నేనొక మాటచెపుతున్నాను. ముస్లింలు ఎంతో ధైర్యసాహసాలు గల సమరయోధులు పిరికిపందలు కారు. వారిని ఎదిరించడం అంత తేలికేమీ కాదు. బాగా ఆలోచించండి."

"నువ్వలా చూస్తూఉండు ముస్లింలు శాశ్వతంగా అంతమైపోతారు."

"యుద్ధంలో రెండే విషయాలు సంభవిస్తాయి విజయం లేక అపజయం. కాబట్టి మీరు వారితో ఒక షరతుపెట్టుకోండి."

"వారి మనుషులు కొంత మందిని మన దగ్గర ఉంచ మనండి (తాకట్టుగా) దీనివల్ల రెండు లాభాలున్నాయి. ఒకటి మక్కావాళ్ళు ప్రాణాలకు తెగించి పోరాడుతారు. రెండవది ఒకవేళ వారు ఓటమిపాలై పారిపోయినా వారి మనుషు లకు జరిగిన శాస్తే మనకూ జరుగుతుంది."

"అవును నీవన్నది నిజమే. చాలా వివేకంతో కూడుకున్న సలహా ఇచ్చావు. వాళ్ళ మనషులు కొంతమందిని తప్పకుండా మన దగ్గర ఉంచుకుందాం" అన్నాడు కాబ్.

ఆ తరువాత అతను "ద్వారం తెరిచి హుయ్యీను ఇక్కడికి పంపించు" అన్నాడు ద్వారపాలకునితో.

హుయ్యీ సంతోషంగా వచ్చి కాబ్‌ను కలిశాడు. కాబ్ కూడా అమితా నందభరితుడై హుయ్యీని సాదరంగా ఆహ్వానించాడు. అక్కడే ఉన్న రీహానా కూడా హుయ్యీకు నమస్కరించింది. హుయ్యీ రీహానాను ఆశీర్వదిస్తూ "ఈ పుత్తడిబొమ్మ కూడా ఇక్కడే ఉందా?" అన్నాడు నవ్వుతూ.

"ఇవ్వాళ సబ్బత్ రోజని మీకు తెలియదా?" అన్నాడు కాబ్.

"అవునవును 'సబ్బత్' రోజని తెలుసు. ఇస్రాయీల్ సంతతిలో ఈ దినం గురించి తెలియందెవరికి?" అన్నాడు హుయ్యీ.

యూదులు సబ్బత్ రోజును పవిత్రమైన రోజుగా భావిస్తారు. ఆరోజు ఎటువంటి ప్రాపంచిక పనులు చేసేవారు కాదు. వీలైనంత ఎక్కువగా ప్రార్థనలు చేస్తారు. "నేనీ రోజు సబ్బత్ విందు ఏర్పాటు చేయించాను" అన్నాడు కాబ్.

"శుభం! నేను భోజనం చేసే వచ్చాను. అయినా సబ్బత్ విందు కాబట్టి తప్పకుండా తింటాను మళ్ళీ" అన్నాడు హుయ్యీ.

రీహానా, కాబ్, హుయ్యీ ముగ్గురూ కలసి సబ్బత్ విందు ఆరగించారు. తరువాత నాయకులిద్దరూ ఓ గదిలో కూర్చున్నారు. "మిత్రమా! ఏమిటి ఇంత రాత్రివేళ వచ్చావు?" ప్రశ్నించాడు కాబ్.

"మక్కా దాని పరిసర ప్రాంతాలకు చెందిన ప్రఖ్యాత నాయకులంతా ముస్లింలను అంతమొందించడానికి నా మాటపై ఒక్కటయ్యారు. ఇప్పుడు ముస్లింలు వారి దయాదాక్షిణ్యాలపై ఉన్నారు. కాని ఆదౌర్భాగ్యులు ఓ పెద్ద

గొయ్యి తవ్వి మదీనాను రక్షించుకున్నారు. దీనివల్ల మా పథకాలన్నీ తలకిందులై పోయాయి. ఒకవేళ ధైర్యంచేసి ఆ గోతిలోకి దిగితే వారు పైనుండి మట్టి కుమ్మరిస్తారు. దాంతో మేము అందులోనే భూస్థాపితం అయిపోతాము. అందుకని ఈరోజు మధ్యాహ్నం అబూ సుఫ్యాన్ అధ్యక్షతన ఒక సమావేశం జరిగింది. అందులో ఒక నిర్ణయం తీసుకున్నాం. ఇటునుండి మీరు, అంటే బనూఖురైజా ముస్లింలపై దాడిచేస్తే వారు(ముస్లింలు) మీపై ఎదురుదాడికి సమాయత్తమవు తారు. అప్పుడు మేము అటునుండి కందకం దాటి వెనుక నుండి వారిపై విరుచుకుపడతాం. దీంతో ముస్లింలు మటాష్. ఇదీ ఆ నిర్ణయం" వివరించాడు హుయ్యి.

"పథకం బ్రహ్మాండంగా ఉంది" అభినందించాడు కాబ్.

హుయ్యి సంతోషంతో "మరి మీరు దీనికి సిద్ధమేనా?" అన్నాడు

"చూడండి! నాకు, నా జాతివారికి కూడా ముస్లింల పట్ల ద్వేషం ఉంది. వారు మేము పూజించే దైవాలను నమ్మరు. అంచేత వారిని సంహరిస్తామంటే మాకూ సంతోషమే. కాని మన అరబ్బులు చాలా పిరికివాళ్ళు. వాళ్ళు ముస్లింలతో అనేక సార్లు తలపడ్డారు కాని, చివరికి రణరంగం విడిచి పారిపోయారు. మరి ఈసారి కూడా అలాగే జరిగితే తరువాత మా పరిస్థతి ఏమిటి?" అన్నాడు కాబ్ కాస్త సందేహిస్తూ.

"ఈసారి అటువంటి ఆలోచనే చేయకండి. ఇప్పుడు మన వెంట ఎంత పెద్ద సంఖ్య ఉందంటే మనం ముస్లింలపై మట్టి విసిరినా వారు దాని కిందపడి భూస్థాపితమవుతారు. అంతసైన్యం ఉంది మన దగ్గర. ఓటమి అనే ప్రసక్తే లేదు ఈసారి. నిర్భయంగా ఉండండి" అంటూ హామీ ఇచ్చాడు హుయ్యి,

"నిజమేననుకోండి. అలా జరగదనే అనుకుందాం. ఒకవేళ దురదృష్టవశాత్తు అలా జరిగితే అప్పుడేం చేద్దాం!"

"అయితే ఈ విషయంలో మీ ఉద్దేశం ఏమిటి?" అడిగాడు హుయ్యి.

"ఏది ఏమైనా వారు మమ్మల్ని విడిచి పారిపోమని హామీ కావాలి మాకు"

"ఆ హామీ ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను".

"నా ఉద్దేశం అదికాదు. మీరు మేము ఒకటే. మీమీద నాకు నమ్మకం ఉంది. మక్కా వాళ్ళ నుండి హామి కావాలి."

"ఏం కావాలో చెప్పండి"

"మక్కాకు చెందిన డెబ్భయి మంది ప్రముఖులు మావద్ద తాకట్టుగా ఉండాలి" అన్నాడు కాబ్.

"కాని వారు దీనికి ఒప్పుకోక పోవచ్చు మీరు ముస్లింల పక్షానే ఉండి, తమకు సహాయం చేయడం ఇష్టంలేక ఇలా మాట్లాడుతున్నారని వారు భావిస్తారేమో" అన్నాడు హుయ్యి.

"వారేమన్నా అనుకోనీయండి, ఈ షరతుపైనే మా నిర్ణయం ఆధారపడి ఉంటుంది." స్పష్టంగా చెప్పాడు కాబ్.

హుయ్యి కాసేపు ఆలోచించి "సరే నేను వారికి నచ్చజెపుతాను" అన్నాడు

"ఎలా నచ్చజెపుతారో కాస్త నాక్కూడా చెప్పండి."

"డెబ్భయి మంది యోధులను మీరు వారి దగ్గరకు పంపండి. వాళ్ళు వీళ్ళు అందరూ కలసి ముస్లింలపై దాడిచేస్తారు. కనుక మీరు డెబ్భయి మంది యోధుల్ని పంపండి" అని చెపుతాను అన్నాడు హుయ్యి.

"సరే మీరెలాగైనా చెప్పుకోండి మాకనవసరం. కాని మీరు కూడా ఒక వాగ్దానం చేయాలి మరి."

"ఏమిటిది?"

"ఒకవేళ మక్కా వాళ్ళు ఓడిపోయి పారిపోయినా మీరు మాత్రం పారిపోకుండా మావద్దకు రావాలి. మంచైనా చెడయినా మాతో పాటు మీరూ అనుభవించాలి."

"దైవం మూసా (అస్సలాం)పై అవతరింపజేసిన తౌరాత్ గ్రంథంపై ప్రమాణం చేసి చెబుతున్నాను. ఒకవేళ మక్కా బహుదైవారాధకులు పారిపోయినా నేను తప్పకుండా మీ వెంట ఉంటాను" అంటూ ప్రమాణం చేశాడు హుయ్యి

"ఇప్పుడు నాకు పూర్తిగా నమ్మకం కుదిరింది. రేపు మీ వెంట ఒక మనిషిని పంపుతాను. మీరు అతన్ని తీసుకెళ్ళి అతని వెంట డెబ్భయి మందిని పంపండి. సరే ఇక విశ్రాంతి తీసుకోండి. చాలా పొద్దుపోయింది." అన్నాడు కాబ్.

ముగ్గురూ అక్కణ్నుంచి లేచి నిద్రకు ఉపక్రమించారు. రీహానా పడుకున్నదనే

కాని ఎంతకూ నిద్రపట్టడం లేదు. పట్టెమంచం మీద దొర్లుతుంది. వారిద్దరి సంభాషణే ఆమె చెవుల్లో మాటిమాటికి ప్రతిధ్వనిస్తోంది. కాని తాను ఒప్పందాన్ని ఉల్లంఘించవద్దని తండ్రికి గట్టిగా చెప్పలేని అశక్తురాలు. తెల్లవారగానే ఈ విషయం సుహైల్‌కు తెలియజేయాలని ఆమె నిర్ణయించుకుంది.

తెల్లవారగానే లేచింది రీహానా. నిద్రలేమితో ఎరుపెక్కిన కళ్ళను చన్నీటితో తుడుచుకుంది. అంతలో పనికత్తె స్నానానికి నీళ్ళు తోడింది. రీహానా ఆదరాబాదరాగా స్నానం చేసి ఖరీదైన వస్త్రాలు ధరించి తడిసిన కురులను ఆరబెడుతూ నిల్చుంది. కాస్సేపటికి జూనా లోపలికి ప్రవేశించి "ఓహో! ఈరోజు నీకు నాదిష్టి తప్పకుండా తగులుద్ది. నిజంగా నీవు అప్సరసలా ఉన్నావు" అన్నది.

"చాల్లేగాని నేను ఎంతసేపట్నుండి నీకోసం ఎదురుచూస్తున్నానో తెలుసా?" అన్నది రీహానా అసహనంగా.

"ఏమిటీ విశేషం"?

"విశేషమే మరి. సుహైల్‌కు ఒక మేలు చేయాలనుకుంటున్నాను జూనా!"

"ఏమిటో ఆ మేలు?"

"రాత్రి హుయ్యీ మానాన్న దగ్గరికొచ్చి ముస్లింలతో చేసుకున్న శాంతి ఒప్పందాన్ని ఉల్లఘించమని పురికొల్పి దానికి మానాన్నను ఒప్పించాడు. ఈ విషయం నేను అతనికి చెప్పాలనుకుంటున్నాను."

"ఏమిటి! నీవు మీనాన్నకే గాక మొత్తం జాతికే ద్రోహం తలపెట్టదలచుకున్నావా? నా సంగతికొస్తే విషం తిని చావనైనా చస్తాగాని, ఇలాంటి ద్రోహం ఎన్నటికీ తలపెట్టను." అన్నది జూనా.

"సరే నీవు చేయవేమో, నేను మాత్రం చేస్తాను. చేసి తీరుతాను. నువ్వు నాకు నిజమైన స్నేహితురాలివైతే, నా శ్రేయంకోరేదానివే అయితే ఈ విషయంలో నాకు సహాయం చేయి" అన్నది రీహానా తెగేసి.

"ఈ సంగతి ఎవరికైనా తెలిస్తే ఏమవుతుందో ఆలోచించావా?"

"ఒక్కసారికాదు పదిసార్లు ఆలోచించాను. దేశద్రోహులకు పడే శిక్ష పడుతుంది, అంతేగా. నేను ఎటువంటి నింద మోయడానికైనా, ఎటువంటి శిక్ష అనుభవించడానికైనా సిద్ధంగా ఉన్నాను."

"సరే అలాగే కానివ్వు నేను నీకు తప్పకుండా సాయం చేస్తాను. నీ వెంట వస్తాను, నేను ద్రోహిగా మారైనా సరే నిన్ను రక్షించుకుంటాను"

"చాలా సంతోషం జూనా! మరి ఎప్పుడు వెళదామంటావు?"

"సాయంత్రం వెళదాం."

"సరే నీవు ఈ రోజు నాదగ్గరే ఉండాలి"!!

"అలాగే ఉంటాలే".

జూనా సాయంత్రందాకా అక్కడే ఉంది. సాయంత్రం సుందరాంగులిద్దరూ నల్ల ముసుగులు ధరించి బయలుదేరారు. అటు యుద్ధమైదానం వైపు నుండి అజాన్ పిలుపు వినబడింది.

"అదిగో అజాన్ అవుతోంది ముస్లింలు ఇప్పుడు నమాజ్ చేస్తున్నారనుకుంటా" అన్నది రీహానా.

"అమ్మయ్య! కాసేపు కూర్చుందాం ఇక్కడ" అన్నది జూనా.

ఇద్దరూ ఓ బండరాయిపై కాసేపు విశ్రాంతి తీసుకొని బయలుదేరారు. యుద్ధమైదానం చేరుకునేసరికి బాగా చీకటి పడింది. అంతలో సుహైల్, సీమ ఇద్దరూ మాట్లాడుకుంటూ ఇటువైపే వస్తున్నారు.

రీహానా వాళ్ళను చూసి కంగారుపడుతూ "జూనా ఎక్కడైనా దాక్కుందామా?" అన్నది.

"దాక్కోవడం వల్ల ప్రయోజనం ఏమిటి?" ఎలాగూ ఎదురుపడక తప్పదు

ఈలోపు సుహైల్ వీరిని గమనించి "ఎవరక్కడ ?" అన్నాడు మందలింపుగా. సీమా కూడా వారిని గమనించింది.

"మేమే రీహానా, జూనాలం" అన్నది జూనా.

"మీరా! ఇంత రాత్రివేళ ఎందుకొచ్చారు. ఎవరుకావాలి?" అన్నారు వారిద్దరు."

" రీహానా మీకో ముఖ్యమైన విషయం చెప్పాలని వచ్చింది" అన్నది జూనా.

"సుహైల్! నీ హృదయవిజేత సీమా అదృష్టవంతురాలు. ఇప్పుడు నామనసు కకావికలమైపోయింది. అయినా నేను ముఖ్య విషయం చెప్పాలని వచ్చాను.

చెప్పి వెళతాను." అంటూ రీహానా తన తండ్రి కాబ్. హుయ్యి వేసిన పథకాలు అన్నీ వివరించింది గద్గద స్వరంతో.

"రీహానా! నీవు ముస్లింలకు ఎంతో మేలు చేశావు. నీకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు " అన్నాడు సుహైల్.

"దానిదేముంది చెప్పాలనుకొన్నాను, చెప్పాను".

హుయ్యి, కాబ్ నుండి సెలవు తీసుకుంటూ "సరే ఇకనేవెడతా, నావెంట ఓ మనిషిని పంపండి, నేను అతని వెంట డెబ్బయి మంది ఖురైషియుల్ని మీ వద్దకు పంపుతాను?" అన్నాడు.

"ఈవిషయంలో నేను మరికొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను. దీని కోసం మాకు పదిరోజుల వ్యవధి ఇవ్వండి. ఈలోగా మీరు ముస్లింలతో పోరాడుతూ ఉండండి. ఈ పదిరోజుల తరువాత మేము ఒక్కసారిగా ముస్లింలపై మెరుపుదాడి చేస్తాము" అన్నాడు కాబ్.

"ఏమిటీ, మీరు మొదటి నుండి యుద్ధానికి సిద్ధంగా లేరా?"

"సిద్ధంగానే ఉన్నామనుకోండి. అయినా మరికొన్ని సన్నాహాలు చేయవలసి ఉంది."

"అంటే, మేము ఈ పదిరోజుల్లో ముస్లింలను ఓడిస్తామో? లేక ముస్లింలే మమ్మల్ని ఓడిస్తారో? మీరు చూడదలచుకున్నారు, అవునా?"

"అబ్బే అదేం కాదు. ముస్లింలు గెలవడం అనేది అసంభవం. వారు చాలా కొద్దిమందే ఉన్నారు. అందునా చాలా బలహీనంగా ఉన్నారు. ఆకలిదప్పులు. చలితీవ్రత వారిని నైరాశ్యం వైపుకు నెట్టివేశాయి. మీరీ పదిరోజులు వారితో ఎలా పోరాడతారో చూడదలిచాం. తరువాత మేము మెరుపుదాడి చేస్తాం".

"సరే మీ మాటను ఒప్పుకుంటున్నాను. మీరు ఈ పదిరోజులూ నిరీక్షించండి". అన్నాడు హుయ్యి.

"మరో విషయం, మీ ముట్టడి వల్ల మదీనావాసులు నిత్యావసర వస్తువుల కొరతను తీవ్రంగా ఎదుర్కొంటున్నారు. అందుకని మాకోసం మీరొక అంగడి తెరిపించండి. అక్కడ మేము నిత్యావసర వస్తువుల్ని కొనుగోలు చేసుకుంటాం" అన్నాడు కాబ్.

"మీ కోరిక సమంజసంగానే ఉంది. మా దగ్గర తినుబండారాలు, ఇతర సామగ్రికి ఏమాత్రం కొదవలేదు. తప్పకుండా మీకోసం ఆ ఏర్పాట్లు చేస్తాం" హామీ ఇచ్చాడు హుయ్యి.

"సరే ఒప్పందం అయిపోయినట్లే. ఇప్పుడు మీ వెంట నా ప్రతినిధిగా అబుల్ బాబల్ అనే ఈ వ్యక్తిని పంపుతున్నాను" అంటూ కాబ్, అబుల్ బాబల్‌ని హుయ్యి వెంట పంపాడు.

వీరిద్దరూ తెల్లవారుజామునే బయలుదేరారు. కొంతదూరం వెళ్ళి ఓ కొండెక్కి అవతలి వైపున్న తమ అనుచరుల దగ్గరికి చేరుకున్నారు. హుయ్యి నేరుగా అబూసుఫ్యాన్ దగ్గరికి వెళ్ళాడు. అప్పుడు అబూసుఫ్యాన్, అతని అనుచరులు చలిమంట ముందు కూర్చొని చలి కాచుకుంటున్నారు. అంతలో వీరిద్దరూ వెళ్ళి నమస్కరించారు.

"ఈ చలి నాశనమైపోను, ఎలా వణికిస్తోందో చూడండి. రండి కూర్చోండి. ఏమిటి విశేషం?" అన్నాడు అబూసుఫ్యాన్ కళ్ళు నులుపుకుంటూ.

"ఏముంది విజయం మనదే. బనూఖురైజా వాళ్ళు మన వెంటే ఉన్నారు" అన్నాడు హుయ్యి గర్వంగా. తరువాత కాబ్ విధించిన షరతుల్ని వివరించాడు. అబూసుఫ్యాన్ ఆ షరతుల్ని అంగీకరించాడు.

"చాలాసేపటి నుంచి గుడారంలో మంట మండటం వల్ల గుడారం బాగా వేడెక్కిపోయింది. ఇక ఇప్పుడు మంట ఆర్పేసి సారాయి సేవిద్దాం. పాటగత్తెలను పిలిపించి పాటలు పాడిద్దాం. నాట్యకత్తెలను పిలిపించి నాట్యం చేయిద్దాం. పాటలు వింటూ, నృత్యాలు చూస్తూ, మద్యం సేవిస్తూ ఆనందోత్సవాలు జరుపు కుందాం" అన్నాడు ఓ ఛోటానాయకుడు గుటకలు మింగుతూ.

"నా మనసు కూడా అదే కోరుతోంది. త్వరగా ఏర్పాటు చేయండి" అన్నాడు హుయ్యి ఒళ్ళు మరిచిపోతూ.

"మీరంతా ఊరిస్తోంటే నాక్కూడా మనసాగడం లేదు. ఇప్పుడే అన్ని ఏర్పాట్లూ చేయిస్తాను" అంటూ అబూ సుఫ్యాన్ చప్పట్లు కొట్టాడు. వెంటనే ఓ బానిస వచ్చి వినయంగా నిల్చున్నాడు.

"చూడూ! ఇది శుభ్రపరచడానికి కొంత మంది సేవకుల్ని పంపించు" ఆజ్ఞాపించాడు అబూసుఫ్యాన్.

"అయ్యా! వారు చలితో వణికిపోతున్నారు. వాళ్ళ పరిస్థితి దయనీయంగా ఉంది. పనిచేసే స్థితిలో లేరు. ఈ రోజు మంచు ఎక్కువగా కురువడం మూలాన వారి కాళ్ళు చేతులు తిమ్మిరెక్కి పోతున్నాయి" అన్నాడు బానిస.

"తుచ్ఛులారా! మీరు ముస్లింలను చూడడంలేదా? వారికి గుడారాలూ లేవు. సరైన దుప్పట్లు కూడా లేవు. మరి ఈ చలిగాలుల్లో ఎలా గడుపుతున్నారు?

మీ దగ్గర డేరాలు ఉన్నాయి. వెచ్చని ఉన్ని కంబళ్ళున్నాయి, చలిమంట వేసుకోవడానికి కట్టెలున్నాయి. సారాయి ఉంది. అమ్మాయిలు కూడా ఉన్నారు. ఇన్ని సౌకర్యాలున్నా చలికి వణికిపోతున్నారా? సిగ్గులేదూ?" అంటూ గాండ్రించాడు అబూసుఫ్యాన్ ఆగ్రహంతో.

" వారు ప్రాణాలకు తెగించి రంగంలోకి దిగారు" అన్నాడు బానిస.

"వెంటనే నా ఆజ్ఞను శిరసావహించండి. లేకపోతే ఒక్కొక్కరి తల నరికేస్తాను. సేవకులను పిలిపించి ఇది శుభ్రం చేయించు. నువ్వెళ్ళి నాట్యకత్తెలకు మధు పాత్రలు తీసుకోరమ్మని చెప్పు" అంటూ చిందులు తొక్కాడు అబూ సుఫ్యాన్.

అబూ సుఫ్యాన్ పులి అరుపులకు బానిస గుండెల్లో గుర్రాలు పరిగెత్తాయి. అతను క్షణాల మీద సేవకులను, నాట్యకత్తెలను తీసుకొచ్చాడు. వారు చేతుల్లో మధుపాత్రలు తీసుకొని తమ అందచందాలతో సభికుల్ని ఊరిస్తూ నృత్యం చేయసాగారు. మరికొందరు యువతులు పాటలు పాడుతూ వీనుల విందు చేస్తున్నారు. అబూసుఫ్యాన్ తదితర నాయకులు మద్యం మత్తుతో జోగుతూ, మధుర సంగీతానికి తలలూపుతూ పరవశులైపోతున్నారు. కాస్సేపటికి యువతుల పాటలు బద్ర్‌యుద్ధంలో హతులైనవారి వైపుకు మరిలాయి. బద్ర్‌యుద్ధంలో బహుదైవారాధకుల పెద్దపెద్ద నాయకులు ముస్లించేతిలో హతమయ్యారు.

"ఆహా! ఎలాంటి సంఘటన గుర్తుకుతెచ్చారు వీరు! అయ్యో పులుల్లాంటి మన నాయకులు అసువులు బాసారే ఆ యుద్ధంలో!" అంటూ అబూ సుఫ్యాన్ గతాన్ని గుర్తుచేసుకొంటూ కంట తడిపెట్టాడు.

" మనం బద్ర్ మృతుల తరపున ముస్లింల నుండి తప్పకుండా ప్రతీకారం తీర్చుకోవాలి" అన్నాడు హుయ్యి పళ్ళునూరుతూ.

" అవును తప్పకుండా ప్రతీకారం తీర్చుకోవాల్సిందే, ముస్లింలను తుడిచి పెడతామని మనం ప్రమాణం చేశాం" అన్నాడు అబూసుఫ్యాన్.

ఈవిధంగా తెల్లవారేవరకు మందు-మగువ పార్టీ సాగింది. తరువాత అబుల్ బాబల్, హుయ్యి వెంట వెళ్ళిపోయాడు. మిగతావారు కూడా ఒక్కొక్కరే తూలుకుంటూ ఎటువాళ్ళు అటు పోయారు. అబూసుఫ్యాన్ కూడా తూలుతూ తన పడకపై చేరాడు.

సాధారణంగా అరబ్ బహుదైవారాధకులు బాగా పొద్దెక్కిన తరువాతనే లేచేవారు. ఆరోజు కూడా వారు బాగా పొద్దెక్కిన తరువాతనే లేచారు. ఆ తరువాత అబూ సుఫ్యాన్ కాలకృత్యాలు తీర్చుకొని డేరా నుండి బయటికి వచ్చి పిలిస్తే అతని అనుచరులు కళ్ళు నులుపుకుంటూ. చలికి వణుకుతూ, అవలిస్తూ ఎదురొచ్చారు. వారిని చూసి అబూ సుఫ్యాన్ ఆగ్రహంతో పాటు ఆశ్చర్యం వెలిబుచ్చుతూ ఇలా అన్నాడు:

"ఏమిటి ఈ బద్ధకం? నేను మీకు రాత్రి ఏం చెప్పాను. తెల్లవారగానే మీరు ముస్లింలపై దాడి చేయాలని ఆదేశించలేదా? మీరింకా డేరాల్లోనే పడి వున్నారా? ఏమిటి మీ ఈ వైఖరి?"

"నాయకా! మేమేం చేయాలి? ముదనష్టపు ఈ చలి ఎండవచ్చే వరకూ పడకలపై నుండి లేవనిస్తే గదా! సైనికుల కాళ్ళుచేతులు ఈ చలికి తిమ్మిరెక్కి ఇంకా వారి అధీనంలోకి రాలేదు " అన్నాడు ఒకతను.

"ఎప్పటిదాకా రావు వాళ్ళ అధీనంలోకి?" అంటూ నిప్పులు చెరిగాడు అబూ సుఫ్యాన్.

"ఇక ఎండవచ్చిందిగా! మేమెళ్ళి వారిని సమాయత్తపరుస్తాం."

"సిగ్గు లేకపోతే సరి, సమాయత్తపరుస్తారట! నాకేమీ అర్థం కావడంలేదు. ముస్లింలు కూడా మీలాగే మట్టితో సృష్టించబడినవారే. వాళ్ళ నరాల్లో కూడా మీకు లాగే రక్తమే ప్రవహిస్తోంది. వాళ్ళ రక్తం మీ రక్తం ఒకటేకదా! మరి వారికి లేని చలి మిమ్మల్నే పీక్కుతింటోందా?

చలిని పారదోలడానికి కుండలు కుండలు సారా త్రాగినా మిమ్మల్ని చలి వదల్లేదు. కాని వారిని చూడండి. వారు సారాయి జోలికేపోరు. వారికి. మీకు ఇంత వ్యత్యాసం ఎందుకు?" అన్నాడు అబూ సుఫ్యాన్ మండిపడుతూ.

"మన లాత్, ఉజ్జా దేవతలు మన నొసటిపై సుఖభోగాలు అనుభవించే

రాత రాశారు. అంచేత మనం సుఖభోగాలు అనుభవిస్తున్నాము. దేవుడు ఆ దురదృష్టవంతులకు అష్టకష్టాలు అనుభవించమని వారి నొసట రాశాడు. అంచేత వారు కష్టాలు అనుభవిస్తున్నారు. అన్నాడు మరో అనుచరుడు.

"కాని మనం మన అదృష్టాలను పాడుచేసుకుంటున్నాము. వారు వారి జాతకాలను బాగుచేసుకుంటున్నారు. మన సుఖభోగాలు మనల్ని నట్టేట ముంచుతాయి. వారి అష్టకష్టాలు వారిని ఒడ్డుకు చేరుస్తాయి. ఇది జీవన సమరం. సాఫల్య వైఫల్యాలు దీని పైనే ఆధారపడి ఉంటాయి. మన సైన్యమే మన అదృష్ట, దురదృష్టాలను నిర్ణయించే శక్తి. కనుక మనం పరాజయం పాలయ్యే ప్రమాదమే ఎక్కువగా కన్పిస్తోంది" అన్నాడు అబూసుఫ్యాన్ హెచ్చరిస్తూ .

"పతనం, ఓటమి అనే సమస్య లేదు. ఏవిధంగా చూసినా ముస్లింలు మనల్ని ఎదుర్కోలేరు. ఇక మేము వెళుతున్నాము. మా తడాఖా ఏమిటో మీరే చూద్దురు గాని" అన్నాడు మరొక సైనికుడు కాలర్ ఎగరేస్తూ.

"అసలు ఉదయాన్నే మీరు దాడి చేసినట్లయితే చలి తీవ్రతకు ముస్లిములు మిమ్మల్ని ఎదుర్కోలేక పోయేవారు. ఆసమయంలో అగడ్త దాటి మెరుపుదాడులు ప్రారంభించినట్లయితే ముస్లింలు చిత్తయిపోయేవారు" అన్నాడు అబూసుఫ్యాన్ అవకాశం చేజారిపోయిందని చింతిస్తూ.

ఆ తరువాత దాదాపు ఎనిమిదివేల మందితో కూడిన బ్రహ్మాండమైన సైన్యం ముస్లింల వైపు బయలుదేరింది. ఇప్పుడు కూడా ఈ సైన్యం ముస్లింల కంటే దాదాపు మూడు రెట్లు ఎక్కువగానే ఉంది. కాని ఆరోజు ముస్లింలే ఒకడుగు ముందుకేసి రంధ్రాల ద్వారా బాణాల వర్షం కురిపించారు. ఎంతో ఉత్సాహంతో చిందులు తొక్కుతూ వస్తున్న శత్రుసైన్యానికి ఈ బాణ వర్షం ఖంగు తినిపించింది ఉక్కు కవచాలు తొడిగి ఉండడం వల్ల వారికి దీనివల్ల పెద్ద నష్టమేమీ జరగలేదు. అయినప్పటికి ముస్లింలు విసిరిన బాణాలు ఇద్దరు ముగ్గురి కళ్ళలో దిగబడ్డాయి. దాంతో వారు భూమ్యాకాశాలు బద్దలయ్యేలా అరవడం ప్రారంభించారు. వీరి పరిస్థితి చూసి మిగతావారు అగడ్త దగ్గరికి దూసుకుపోయి రంధ్రాలకు గురిచూసి బాణాలు వదలడం ప్రారంభించారు. వెంటనే ముస్లింలు రంధ్రాల దగ్గరి నుండి పక్కకు తప్పుకున్నారు. కొన్ని బాణాలు రంధ్రాల ద్వారా ఇవతలికి వచ్చేశాయి. మట్టిదిబ్బ వెనుక వైపు నుండి ముస్లిం యోధులు మరొకసారి విజృంభించారు.

వారి బాణాలు శత్రువుల శరీరాలకు తూట్లువేస్తున్నాయి. దాంతో చాలామంది గాయపడ్డారు.

"ఈ ముస్లింలు ఇంత పెద్ద గొయ్యి తవ్వి ఎలాంటి రక్షణ ఏర్పాట్లు చేసుకున్నారో చూడండి" అన్నాడు ఇబ్నె వఊద్ ఏమీచేయలేక చిందులేస్తూ.

"అలాంటి పిరికి మాటలు మాట్లాడకండి. ముందు నేను దూకుతాను, తరువాత నా వెనుకే మీరూ దూకండి, ముస్లిం అంతుచూద్దాం!" అంటూ నౌఫిల్ తన గుర్రాన్ని అదిలించాడు. అంతే! అతను దభేలున కందకంలో పడి పోయాడు. దేహంలోని ఎముకలన్నీ నుజ్జు నుజ్జయి పోయాయి. అతని గుర్రం కూడా ఊపిరి విడిచింది. దాంతో మిగిలిన శత్రుసైనికులు కందకం దాటడానికి సాహసించలేక, కాస్సేపు ఒడ్డు మీదే నిలబడి బాణాలు వదలి వెళ్ళిపోయారు.

నౌఫిల్ కందకంలో పడి చనిపోయిన వార్త విని అబూసుఫ్యాన్ ఎంతో బాధ పడ్డాడు. నౌఫిల్ శవాన్ని తమకు ఇచ్చేస్తే ప్రతిఫలంగా తాము వంద ఒంటెలు ఇస్తామని అబూసుఫ్యాన్ తన ప్రతినిధి ద్వారా దైవప్రవక్త (సఅసం) వద్దకు కబురు పంపాడు. దైవప్రవక్త (సఅసం) ఈమాట విని "మాకు మీ ప్రతిఫలమూ అవసరం లేదు, మీ శవమూ అవసరం లేదు, తీసికెళ్ళండి" అని అన్నారు.

అపుడు శత్రువులు కొంతమంది కందకంలో దిగి నౌఫిల్ శవాన్ని బయటకు తీసి మోసుకెళ్ళారు. అబూసుఫ్యాన్ నౌఫిల్ శవాన్ని చూసి బాధతో పాటు తీవ్ర ఆగ్రహం వెలిబుచ్చాడు.

అసర్ నమాజ్ సమయాన దైవప్రవక్త (సఅసం) కొందరు ముఖ్య అనుచరు లతో కలసి కూర్చొని పరిస్థితిని సమీక్షించసాగారు. అంతలో సుహైల్ (రజి) వచ్చి దైవప్రవక్త (సఅసం)కు సలాం చేశారు.

"సుహైల్! ఏమిటి విశేషం? ఏదో కబురు తెచ్చినట్లున్నావు" అన్నారు దైవప్రవక్త (సఅసం) చిరునవ్వుతో.

"అవును దైవప్రవక్తా! బనూఖురైజా యూదులు విశ్వాసఘాతుకానికి సిద్ధ మయ్యారు. అంటూ సుహైల్, హుయ్యి-కాబ్‌ల మధ్య జరిగిన సంభాషణ, వారి దుష్ట పథకాలు అన్నీ వివరించాడు.

"అయితే ఈ సంగతి ఎవరూ బయటికి పొక్కనీయకూడదు. మీ వరకే

రహస్యంగా ఉండాలి" అన్నారు దైవప్రవక్త (సఅసం).

ఆ రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత కటిక చీకటిలో దైవప్రవక్త (సఅసం) ఎక్కడికో బయలుదేరారు. కొంతదూరం పోయిన తరువాత "ఎవరక్కడ! జైద్ బిన్ అవామ్, అబూఅబ్దుల్లా, హుజైఫా ఎక్కడున్నారు?" అని పిలిచారు

ముజాహిద్‌లు ప్రశాంతంగా నిద్రపోతున్నారు. ఎక్కడా ఎలాంటి అలికిడి లేదు. దైవప్రవక్త (సఅసం) ముందుకు సాగారు. ఒకచోట ఆయన కాలికి ఏదో తగిలింది. చూస్తే నేలమీద ఎవరో వ్యక్తి పడుకున్నాడు.

"ఎవరు నీవు?" అడిగారు దైవప్రవక్త (సఅసం).

"దైవప్రవక్తా! నేను హుజైఫాను" అన్నాడా వ్యక్తి వెంటనే లేచి నిలబడుతూ.

"ఈ రోజు చలి ఎక్కువగా ఉంది. కాని ముఖ్యమైన పనుంది. అది నీవు చేయగలవా?"

"దైవప్రవక్త ఆదేశాన్ని ఎవరు ధిక్కరిస్తారు? ఆజ్ఞాపించండి దైవప్రవక్తా! నేను సిద్ధంగా ఉన్నాను" అన్నారు హజ్రత్ హుజైఫా (రజి).

"నువ్వు ఖురైషీయుల శిబిరంలోకి వెళ్ళి వారి పథకాలు, కార్యక్రమాలు ఏమిటో తెలుసుకొని రావాలి. వెళ్ళు త్వరగా. దేవుడు నిన్ను రక్షించుగాక! నేను నీకోసం ఎదురుచూస్తుంటాను" అన్నారు దైవప్రవక్త (సఅసం).

ఆయన ఈమాట చెప్పి వెళ్ళిపోయారు. హుజైఫా నిండా దుప్పటి కప్పుకొని బయలుదేరారు. కాస్సేపటికి ఆయన అవిశ్వాసుల శిబిరంలోకి ప్రవేశించారు. అక్కడ అనేక చోట్ల శత్రు సైనికులు చలిమంటలు వేసుకొని చలి కాచుకుంటు న్నారు. హుజైఫా (రజి) ఓ నిమిషం ఆలోచించి ఓ చలిమంట దగ్గరికెళ్ళి కూర్చు న్నారు. అవిశ్వాసులు ఆయన్ని చూసి తమ శిబిరం వాడేననుకున్నారు. కాస్సేపటికి అక్కడికి మరొకవ్యక్తి వచ్చి కూర్చున్నాడు. అతను సైన్యాధిపతి అబూ సుఫ్యాన్ దగ్గర్నుంచి వచ్చాడు.

అతడ్ని చూడగానే "ఏమిటి విశేషాలు? కొత్త వార్త ఏమైనా ఉందా?" అని అడిగాడు వారిలో ఒకడు.

"ముఖ్యమైన వార్త తెచ్చాను. ముందు మనలో ముస్లిం గూఢచారి ఎవరైనా ఉన్నాడేమో చూడాలి, ఆతర్వాతే ఈవార్త బయటపెడ్తాను" అన్నాడా వ్యక్తి.

ఈ మాట వినగానే హుజైఫా (రజి) కాస్తంత కంగారుపడిపోయారు. తరువాత ఆయన ఏమీ ఎరగనట్లు మౌనంగా కూర్చున్నారు. చలిమంట ముందు కూర్చున్న వాళ్ళంతా తమ ఇరుపక్కల ఉన్నవారిని ఓ సారి చూసుకొని శత్రువులెవరూ లేరని సంతృప్తి చెందారు.

"మీరంతా ఓసారి ఒకర్నొకరు చూసుకొని తరువాత మీ పక్కనున్న వాడి చెయ్యి పట్టుకొని పరీక్షించండి" అన్నాడు మళ్ళీ ఆ వచ్చిన వ్యక్తి.

ఈ పరీక్ష పద్ధతేమిటో అర్థంగాక హుజైఫా (రజి) కొంచెం తికమక పడ్డారు. అయితే అందరూ తమతమ పక్కనున్నవాడి చేతిని పట్టుకోవడం ప్రారంభించ గానే ఆయన కూడా తన పక్కనున్న వాడి చేయిపట్టుకున్నారు.

ఆ వచ్చిన వ్యక్తి ఒక్కొక్కరి ముందుకెళ్ళి వంగి ఏదో గుసగుసలాడసాగాడు. హుజైఫా (రజి) అది చూసి తానిక పట్టుబడి పోవడం ఖాయం అనుకున్నారు. ఆ వ్యక్తి అందరితో గుసగుసలాడుతూ హుజైఫా పక్కనున్న వాడి చెవి దగ్గరికి కూడా వచ్చి గుసగుసలాడాడు. వెంటనే హుజైఫా ఆ రహస్యాన్ని పసిగట్టారు. చివరికా వ్యక్తి తన దగ్గరకొచ్చి అడగ్గానే 'అబూసుఫ్యాన్' అన్నారు ఆయన.

అప్పుడా వ్యక్తి తృప్తిగా ఊపిరి పీల్చుకుంటూ "ఇప్పుడు నా మనస్సు కుదుట పడింది. ఇక్కడ మన శత్రువులెవరూలేరు. ఇక వినండి ఆ వార్త" అన్నాడు. అందరూ అతని వైపు దృష్టి సారించి ఆ వార్త వినడానికి తహతహలాడి పోయారు.

"నేనిప్పుడు అబూ సుఫ్యాన్ దగ్గర్నుంచి వస్తున్నాను. అక్కడ హుయ్యి, ఖురైజా తెగ నాయకుడు కాబ్, అబుల్ బాబా కూడా వచ్చి ఉన్నారు. ఖురైజా తెగవాళ్ళు మనతో సహకరించడానికి అంగీకరించారు " అన్నాడతను.

"అయితే అటునుంచి వారు, ఇటునుంచి మనం ఒక్కసారిగా దాడి చేస్తే ముస్లింల పని ఖతం!" అన్నాడు వారిలో ఒకడు.

"నేను అబుల్ బాబని కలుసుకున్నాను. అతను చాలా నిజాయితీ పరుడిలా కనిపించాడు. ముస్లింలు అనవసరంగా మదీనా పాలకులయ్యారని వాళ్ళు బనీ నజీర్ తెగ యూదులను వారి ప్రాంతం నుండి వెళ్ళగొట్టారని, అందువల్ల ముస్లింపై తాము తప్పకుండా ప్రతీకారం తీర్చుకుంటామని అతను చెప్పాడు."

"దీన్నిబట్టి వారి హృదయాల్లో ముస్లింల పట్ల ఎంతటి తీవ్రమైన ప్రతీకార

జ్వాలలు రేకెత్తుతున్నాయో అర్థం చేసుకోవచ్చు. అలాంటివాళ్ళు తప్పకుండా మనతో కలిసి ముస్లింలతో పోరాడుతారనడంలో నాకెలాంటి సందేహం లేదు" అన్నాడు రెండోవాడు ఎంతో ధీమాగా.

హజ్రత్ హుజైఫా (రజి) అంతా విని ఇక వెళ్ళి పోదామనుకున్నారు. కాని ఒక్కడే లేచివెళ్తే వాళ్ళకు అనుమానం వస్తుందేమోనని తలచి అలాగే కూర్చున్నారు. అంతలో వారిలో ఇద్దరు లేచి వెళ్ళిపోయారు. ఇదే మంచి అవకాశంగా భావించి హుజైఫా అక్కడ్నుంచి లేచి మెల్లిగా జారుకున్నారు. అక్కడ్నుంచి ఆయన నేరుగా దైవప్రవక్త (సఅసం) సన్నిధికి చేరుకున్నారు.

దైవప్రవక్త (సఅసం) ఆయన్ని చూడగానే "హుజైఫా వచ్చేశావా?" అన్నారు.

"వచ్చేశాను దైవప్రవక్తా! దైవానుగ్రహం వల్ల, మీ ఆశీర్వాదం వల్ల క్షేమంగా వచ్చేశాను" అన్నారు హుజైఫా ఆనందంగా.

"ఆ.....అయితే పోయిన పని ఏమయింది?"

"నేను శత్రుశిబిరంలోకి వెళ్లి చలికాచుకుంటున్న ఓ జట్టులో చేరి కూర్చు న్నాను. అంతలో ఒక వ్యక్తి వచ్చి నేనొక శుభవార్త తెచ్చాను. మనలో ఎవడన్నా పరాయి వాడున్నాడేమో చూడండి అంటూ అందరినీ పరిశీలించాడు. తరువాత బనూ ఖురైజావాళ్ళు మనకు వ్యతిరేకంగా వారికి సహకరించడానికి సిద్ధమ య్యార"ని తెలియజేస్తూ విషయం పూర్తిగా వివరించారు హుజైఫా (రజి).

"ఈ విషయం మనకు ముందే తెలిసింది. ఇప్పుడు నీవు దాన్ని ధృవపరుస్తు న్నావు బనూఖురైజా తెగవాళ్ళు తప్పక విశ్వాసఘాతుకానికి, నమ్మకద్రోహానికి పాల్పడ తారు. కాని చివరికి నష్టపోయేది వారే. దైవం వారి ఆటలు ఏమాత్రం సాగనివ్వడు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

వెంటనే దైవప్రవక్త (సఅసం) బనూఖురైజా యూదులు ఒప్పందం ధిక్కరించిన వార్త విషయంలో నిజానిజాలు తెలుసుకొని రావడానికి ఒక మనిషిని పంపించారు. ఆ తరువాత మరోఇద్దరు సాద్ బిన్ ఉబాదా, సాద్ బిద్ ముఆజ్ (రజి)లను కూడా పంపుతూ "ఒప్పందాన్ని అతిక్రమించవద్దని వారికి నచ్చజెప్పండి" అన్నారు.

"అలాగే నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తాం"అంటూ వాళ్ళు ముగ్గురు బయలు దేరి బనూఖురైజా కోట దగ్గరికి చేరుకున్నారు. కాబ్ వారికి స్వాగతం పలికి లోనికి తీసుకెళ్తూ "మీరాక వల్ల నాకు చాలా సంతోషం కలిగింది" అన్నాడు.

"మీ గౌరవానికి కృతజ్ఞతలు. మేము మీతో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడడానికి వచ్చాము."

"అలాగే చెప్పండి".

"మీరు ఒప్పందానికి వ్యతిరేకంగా హుయ్యీ బిన్ అఖ్తబ్‌ను మీ వద్దకు రానిచ్చారని దైవప్రవక్త (సఅసం)కు తెలిసింది. ఇది నిజమేనా?"

"అవును, హుయ్యీ వచ్చిన మాట నిజమే. అతడేదో వ్యాపారం విషయంలో నాతో మాట్లాడడానికి వచ్చాడు" అన్నాడు కాబ్.

"మేము బహిష్కరించిన హుయ్యీతో ఏమిటో ఆ వ్యాపారం?"

"కొన్ని వ్యాపార విషయాలు బయటపెట్టడం వల్ల నష్టం జరిగే అవకాశం ఉంటుంది. అందుకని ఇది చెప్పే విషయం కాదు, క్షమించాలి."

"సరే మీరు ముస్లింలతో చేసుకున్న శాంతి ఒప్పందాన్ని ఉల్లంఘిద్దామని అనుకోవడం లేదా?" సూటిగా అడిగారు ప్రవక్త అనుచరులు.

"ఎవరన్నారు మీతో, ఇదంతా అబద్ధం."

"ముస్లింలపై దాడి చేయమని అబూ సుఫ్యాన్ మీకు సందేశం పంపలేదా?"

"అలాంటిదేమీ లేదే" కాస్త తడబడ్డాడు కాబ్.

"మీ దగ్గరకు డెబ్భైయిమంది వీరయోధుల్ని పంపితే ముస్లింలపై దాడి చేస్తామని మీరు అబూసుఫ్యాన్‌కు సందేశం పంపలేదా?" కాబ్ కళ్ళలోకి చూస్తూ సూటిగా ప్రశ్నించారు సాద్ బిన్ మాజ్ (రజి).

కాబ్ బిత్తరపోయి గుడ్లెల్లబెట్టాడు, ముస్లింలకు ఈ సంగతులన్నీ తెలుస్తాయని అతను కలలో కూడా ఊహించలేదు. అయినప్పటికీ మేకపోతు గాంభీర్యంతో "అంతా అబద్ధం ఇదంతా మా పై అపవాదు." అని అరిచాడు.

"అయితే మీరు ఆ డెబ్భయి మందిని తీసుకురావడానికి అబుల్‌బాబ్‌ను పంపింది కూడా నిజం కాదంటారా?"

కాబ్ ఆశ్చర్యానికి అంతే లేదు. ఇక అబద్ధాలాడి లాభంలేదనుకొని "మీరు చెప్పిందంతా నిజమే"అని ఒప్పుకున్నాడు.

"మరయితే ఇది ఒప్పందం ఉల్లంఘన కాదంటారా?"

"ఎందుక్కాదు ఉల్లంఘనే అవుతుంది".

"మరి మీలాంటి నీతిమంతులు ఇలా చేయడం భావ్యమేనా?"

"మేము ఇన్నాళ్ళు అవకాశం కోసం ఎదురుచూశాము. ఇప్పుడా అవకాశం వచ్చింది, ఒప్పందం ఉల్లంఘించాం."

'కాని మీరు ముస్లింలు అశక్తులు, చేతకానివారని భావించకండి. తరువాత మీరు పశ్చాత్తాపపడ్డా లాభం లేదు. బాగా ఆలోచించుకోండి " అన్నారు సాద్.

"కలలు కనకండి. ఇప్పుడు మీరు మృత్యువు ముంగిట్లో ఉన్నారు. మృత్యువు ఎప్పుడు కబళిస్తుందో మీకే తెలియదు." అన్నాడు కాబ్ విషపునవ్వు నవ్వుతూ.

ఎన్నిరకాలుగా నచ్చజెప్పాలో అన్ని రకాలుగా చెప్పినా కాబ్ వినలేదు. దాంతో ఈ ముగ్గురూ నిరాశతో వెళ్ళిపోయి విషయం దైవప్రవక్త(స) కు వివరించారు.

"బహుశా మీరు బనూఖురైజా వారికి నచ్చజెప్పడానికి వెళ్ళారనుకుంటా" అన్నాడు నయీం. హజ్రత్ సాద్, అతని అనుచరులు నయీం ఎవరో తెలియక "ఇతనెవరూ?" అన్నారు ఆశ్చర్యంగా.

"ఇతని పేరు నయీం బిన్ మస్ఊద్. గత్ఫాన్ తెగ తరపున మన దగ్గరికి గూఢచారిగా వచ్చి దైవానుగ్రహం వల్ల ముస్లింగా మారిపోయాడు. ఇకనుండి ఇతను మీ సోదరుడు" అన్నారు దైవప్రవక్త నయీంను పరిచయం చేస్తూ.

సాద్ సంతోషంగా కరచాలనం చేస్తూ "అవును వారికి నచ్చజెబుదామనే వెళ్ళాం" అన్నారు చిరునవ్వుతో.

"వాళ్ళు వినరండి! సరేగాని నాకో ఉపాయం తట్టింది. నేను బనూఖురైజా, ఖురైష్ తెగల మధ్య విభేదాలు సృష్టించడానికి ఒక పథకం వేశాను. మీరేమీ అనుకోకపోతే దీన్ని రహస్యంగా ఉంచడమే మంచిదని భావిస్తున్నాను" అన్నాడు నయీం. "అలాగే కానివ్వు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"అయితే మీరు ముస్లింలందరినీ సమావేశపరిచి నినాదాలు చేయండి. మిగతా వ్యవహారమంతా నేను చూసుకుంటాను" అన్నారు నయీం (రజి).

ఆ తర్వాత దైవప్రవక్త (స) ముస్లింలందర్నీ సమావేశపరచి ఇలా అన్నారు:

"బనూఖురైజా తెగవారు మనతో చేసుకున్న శాంతి ఒప్పందం ఉల్లంఘించి మనపై దాడి చేస్తారట. అయితే దైవానుగ్రహంవల్ల గత్ఫాన్ తెగకు చెందిన ఒక వ్యక్తి ఇస్లాం స్వీకరించి ఖురైషీయుల ఆటకట్టించడానికి ప్రయత్నిస్తున్నాడు."

దైవప్రవక్త నోట ఈ శుభవార్త వినగానే ముస్లిలు ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా అల్లాహు అక్బర్ అంటూ నినదించారు."

ఈ నినాదం విని బనూఖురైజా వారు విషయం అర్థం కాక అయోమయంలో పడ్డారు. మరోవైపు ఖురైషీయులు ఆందోళనతో దిగ్గునలేచి కూర్చున్నారు. "ఏమిటి ముస్లింలు మనపై దాడి చేశారా?" అన్నాడు అబూసుఫ్యాన్ కంగారుగా

"ఈ నినాదాల గోలవింటుంటే మీక్కూడా అలాగే అన్పిస్తోంది" అన్నా డొకతను.

వెంటనే అబూసుఫ్యాన్ ఆయుధాలు ధరించి బయలుదేరాడు. అతడ్ని మరికొందరు అనుసరించారు. ఎక్కడో దూరాన వీరికి ఓ రూపం అస్పష్టంగా కన్పించింది అది తమ గూఢచారే అని, ఏం కబురుతెస్తున్నాడో అని ఉత్కంఠతతో అందరూ అటువైపే చూడసాగారు. ఆ ఆకారం దగ్గరికి రాగానే "ఎవర్నువ్" అన్నాడు అబూసుఫ్యాన్.

"నేను నయీమ్ బిన్ మన్ఊద్ని."

"నీ కోసమే మేము వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాము. ఏం సమాచారం తెచ్చావు?" అన్నాడు అబూసుఫ్యాన్ చాటంత కళ్ళు చేసుకొని."

"ఏం చెప్పమంటారు? ఓ దుర్వార్త తెచ్చాను. బనూ ఖురైజా వాళ్ళు ముస్లింల విశ్వాసం చూరగొనడానికి ఈ ఖురైషీయుల్ని వారికప్పగిస్తామని కబురు చేశారు. మీరు వారిని సంహరించుకోండి, ఏమైనా చేసుకోండి మా కెలాంటి అభ్యంతరం లేదని కూడా వారు అభయమిచ్చారట."

ఈ మాటలు విని అబూ సుఫ్యాన్ ఉగ్రుడైపోయాడు. పటపట పళ్ళు నూరుతూ నమ్మకద్రోహులు! వారి జాతిని చీల్చి చెండాడుతానుండు" అంటూ బనూ ఖురైజా వారిపై నిప్పులు చెరిగాడు.

"తుచ్ఛులు దుర్మార్గులు, దగాకోరులు, నేను వాళ్ళ అంతుచూస్తాను"

అంటూ గాండ్రించాడు ఇక్రమా ఆవేశంతో ఊగిపోతూ.

"కాని ముస్లింల నినాదాల ద్వారా ఈ విషయాన్ని బహిర్గతం చేయడం లోని ఆంతర్యం ఏమిటి?" అన్నాడు ఖాలిద్.

"డెబ్భయిమంది ఖురైషీయులు ముస్లింల అధీనంలోకి వస్తారట. తెల్లవార గానే ఆ డెబ్భయిమంది తమకు అప్పగించబడతారని ఓ గూఢచారి ముస్లింలకు తెలిపాడు" అన్నారు నయీం (రజి).

" అదా సంగతి, అందుకే పిచ్చిపిచ్చిగా నినాదాలు చేస్తున్నారు. అదిగో అటు చూడండి ఇంకెవరో వస్తున్నట్టున్నాడు" అన్నాడు అబూసుఫ్యాన్ ."

"బనూ ఖురైజా యూదులు ఎంత నమ్మకద్రోహులు! ముగ్గురు ముస్లింలు బనూ ఖురైజా కోట వైపుకు వెళ్ళడం గమనించి నేను వారిని వెంబడించాను. కాని వారు ఎందుకు వెళ్ళారో తెలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా నా ప్రయత్నాలు ఫలించలేదు. వీరు అక్కడ్నుంచి నేరుగా ముహమ్మద్ (సఅసం) వద్దకు వెళ్ళి ఆయనతో ఏదో రహస్యంగా ముచ్చటించి ముస్లింలందరినీ మేల్కొలిపారు. క్షణాల మీద ముస్లిలంతా అక్కడ పోగయ్యారు. అప్పుడు బనూ ఖురైజా కోటకు వెళ్ళొచ్చిన వారు మాట్లాడుతూ- 'బనూ ఖురైజా తెగ మన పక్షానే ఉంది. మనం అడిగిన డెబ్బయిమంది ఖురైషీయుల్ని మనకు అప్పగించడానికి వారు సిద్ధంగా ఉన్నారు' అని అన్నాడు. ఈ వార్త వినగానే ముస్లింలు సంతోషం పట్టలేక పెద్దపెట్టున నినాదాలు చేశారు" అన్నాడు వచ్చిన వ్యక్తి.

"ఈ యూదుల్ని నమ్మకూడదు. నమ్మించి గొంతుకోసే రకంగా ఉన్నారు. ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు అబూ సుఫ్యాన్.

"కాబ్ దాడికి పదిరోజుల గడువు కోరాడు గదా! అయితే మనం, బనూ ఖురైజా వద్దకు రేపే దాడి చేయాలనే షరతుపై మా మనషుల్ని పంపుతామని, లేకపోతే లేదని అబుల్ బాబ్‌తో చెబుతాం" అన్నాడు ఖాలిద్.

"సరే అలాగే చేద్దాం. ఒకవేళ వారు ముస్లింలతో ఏదైనా లోపాయికారి ఒప్పందం కుదుర్చుకొని ఉంటే ఈ షరతును అంగీకరించరు" అన్నాడు అబూ సుఫ్యాన్.

అంతలో అమ్ర్ బిన్ ఆస్ వస్తే అతనికి విషయం చెప్పి "నీవు అబుల్‌బాబ్ దగ్గరికెళ్ళి రావాలట" అన్నారు వారిద్దరు. "నేను సిద్ధమే" అన్నాడు అమ్ర్.

వెంటనే అతను అబుల్‌బాబ్ వద్దకు చేరుకొని "నన్ను ఖురైషీయులు మీవద్దకు దూతగా పంపారు" అన్నాడు. "చెప్పండి విశేషమేమిటో" అన్నాడు అబుల్‌బాబ్.

"ముట్టడి చాలా పేలవంగా, సుదీర్ఘంగా సాగుతున్న విషయం మీకు తెలుసు. ఇప్పటి వరకు జరిగిన దాడుల్లో ముస్లింలకు ఏమాత్రం నష్టం వాటిల్ల లేదు. అందుకని మనం ఒక్కసారిగా ముస్లింలపై మెరుపు దాడిచేయాలి."

"అలాగే చేద్దాం."

"దాడిలో మీరు కూడా పాల్గొనాలి."

"భలేవారే! మేము తప్పకుండా పాల్గొంటాం."

రేపే దాడి చేయాలని నిర్ణయించాం. కనుక మీరు రేపే సిద్ధం కండి."

" రేపేనా?! ఇంత త్వరగానా!!" అంటూ ఆశ్చర్యపోయాడు అబుల్‌బాబ్.

"అవును రేపే. ఇది మా జాతి నిర్ణయం."

"కాని రేపు సబ్బత్ దినం కదా! మేము సబ్బత్‌ను ఎంతో గౌరవిస్తాము."

"ఆ సంగతి మాకూ తెలుసు. ఆరోజు వేటాడటం, ఆడటం, పాడటం నిషిద్ధం. కాని యుద్ధంలో పాల్గొనవచ్చుగా" అన్నాడు అమ్ర్ బిన్ ఆస్.

"కాదు కాదు. ఆరోజు మేము ఏపనీ చేయం. మీరు ఈరోజు రాత్రికే మీ మనుషుల్ని పంపండి. రేపు మేమంతా సబ్బత్ పండుగ జరుపుకొని ఎల్లుండి దాడిలో పాల్గొంటాం." అన్నాడు అబుల్‌బాబ్.

"సరే నేను మీ సమాధానాన్ని మా నాయకులకు తెలియజేస్తాను" అంటూ అమ్ర్ బిన్ ఆస్ అక్కడి నుండి అబూసుఫ్యాన్ వద్దకెళ్ళి విషయం తెలియజేశాడు.

"బనూఖురైజా జాతి మనవారిని ముస్లింలకు అప్పగించాలని చూస్తోంది. సరే మరోసారి ప్రయత్నించు. రేపు మన వెంట దాడిలో పాల్గొనమను. 'సబ్బత్'ను మరోరోజు జరుపుకోమను" అన్నాడు అబూసుఫ్యాన్.

అమ్ర్ బిన్ ఆస్ మరొకసారి అబుల్‌బాబ్ వద్దకు వెళ్ళి "మానాయకుడు అబూసుఫ్యాన్, మిమ్మల్ని రేపు మాతోపాటు యుద్ధంలో పాల్గొనమని, 'సబ్బత్'

ను మరోరోజు జరుపుకోమని విన్నవించమన్నారు" అన్నాడు అమ్ర్ బిన్ ఆస్.

ఈ మాట విన్న అబుల్‌బాబ్‌కు ఒళ్ళు మండిపోయింది. "ఈ సందేశాన్ని పంపిన మీ నాయకుడికి బుద్ధిజ్ఞానాలు లేనట్లుంది. దేవుడు సబ్బత్ రోజును ఆరాధన కోసం నిర్ణయించాడు. దైవనిర్ణయాన్ని మేము ఎట్టిపరిస్థితిలోనూ మార్చ లేము" అన్నాడు అబుల్‌బాబ్.

అమ్ర్ బిన్ ఆస్ ఈ సమాధానాన్ని కూడా అబూసుఫ్యాన్‌కు తెలిపాడు.

"ఆ దుర్మార్గులు తప్పకుండా ముస్లింతో చేతులు కలిపి ఉంటారు. ఇక మనం ఆలస్యం చేయకూడదు. మదీనాను జయించిన తరువాత బనూఖురైజా తెగపై కూడా దాడి చేయడం జరుగుతుందని ప్రకటన చేయండి" అని ఆదే శించాడు అబూ సుఫ్యాన్.

అబుల్‌బాబ్ ఆ రోజంతా ఎంతో చిరాగ్గా అసహనంగా గడిపాడు. అతను నేరుగా బనూఖురైజా కోటకు వెళ్ళాడు.

అబుల్‌బాబ్‌ను చూడగనే కాబ్ పట్టరాని సంతోషంతో "ఖురైష్‌నాయకులు వచ్చేశారా?" అని అడిగాడు ఎంతో ఆత్రంతో.

"రాలేదు" అన్నాడు అబుల్‌బాబ్ ఓ పక్కన కూర్చుంటూ.

"ఎందుకని రాలేదు?"

"వాళ్ళు మూర్ఖులు, అహంకారులు, వాళ్ళ కసలు బుద్ధిజ్ఞానాల్లేవు."

"అసలేం జరిగింది?"

జరిగిన వృత్తాంతమంతా వివరించాడు అబుల్‌బాబ్.

కాబ్ ఆలోచనలో పడిపోయాడు.

"ఇటువంటి పరిస్థితుల్లో ఇక వాళ్ళతో కలసి యుద్ధం చేయడం అసంభవం" అన్నాడు అబుల్ బాబ్.

"అలా అనకు, ఎలాగైనా ఐక్యత సాధించాలి. మన ఆశయసాధనకు ఇది చాలా అవసరం. కాస్త ఓర్పుతో పథకాలు రచించవలసి ఉంది." అన్నాడు కాబ్.

ఆ తర్వాత కాబ్ కొంతమంది ప్రముఖుల్ని పిలిచి "ఈ రాత్రికి ఫారిగ్ కోటపై దాడిచేయాలి. సిద్ధంగా ఉండండి" అని ఆజ్ఞాపించాడు.

ఆరోజు యూదులు పగలంతా యుద్ధసన్నాహాలు చేసుకొని సూర్యాస్త మయానికల్లా కాబ్ ఇంటి వద్ద గుమిగూడారు. కాబ్ కూడా ఆయుధాలు ధరించి బయటికి వచ్చాడు. వెలుతురు కోసం అనేక దివిటీలు వెలిగించబడ్డాయి. కాబ్ సైనికుల్ని లెక్కించాడు. దాదాపు ఐదువందల మంది గుమికూడారక్కడ.

కాబ్ ఉరిమిచూస్తూ "మిగతావారంతా ఎందుకు రాలేదు? ఐదొందల మందే వచ్చారేమిటి?" మిగతా వారేరి?" అని గర్జించాడు.

"వారు తమ భార్యాపిల్లల రక్షణ కోసం ఇళ్ళలోనే ఉండిపోయారు" అన్నాడొకడు.

"ఇక్కడ ఎవరూ ఉండటానికి వేల్లేదు. పురుషులందర్నీ వెంటనే పిలుచు కురండి."

వెంటనే కొంతమంది పరుగెత్తుకెళ్ళి వారందర్నీ పిలుచుకొచ్చారు. అందరూ వచ్చిన తరువాత కాబ్ మళ్ళీ లెక్కించాడు. ఈసారి ఏడొందల మంది ఉన్నారంతా.

"ఆ, వినండి. ఇప్పుడు మనం ఫారిగ్ కోటపై దాడి చేయబోతున్నాం. అక్కడ ముస్లిం పురుషులు చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నట్లు తెలిసింది. వెళ్ళి వెళ్ళగానే ముందుగా పురుషుల్ని సంహరించండి ఆతరువాత స్త్రీలు, పిల్లలను బంధించండి. స్త్రీలు, పిల్లలు ఎవరికెంత మంది దక్కుతారో వారంతా వారి సొంతం అవుతారు" అన్నాడు కాబ్.

ఆ తర్వాత ఆ యూదులు సాయుధులై ఫారిగ్‌కోట వైపు బయలుదేరారు.

అదే సమయంలో అటు ఫారిగ్‌కోట వైపునుండి ఒకతను ఎదురుగా వస్తూ కనిపించాడు. అతను బనూనజీర్ తెగకు చెందిన జ్యోతిష్కుడు. పేరు దావూద్. అతను కాబ్, అతని అనుచరులకు సుపరిచితుడే.

"దావుద్! ఎక్కడి నుండి వస్తున్నావు?" అని అడిగారు వారు.

"నేను ముస్లింల శిబిరం వద్ద నుండి వస్తున్నాను. మీరెక్కడకి వెళ్తున్నారు?" కాస్త ఆశ్చర్యంగా అడిగాడు దావూద్.

"మేము ఫారిగ్ కోటపై దాడికి వెళుతున్నాం" అన్నాడొకడు.

"నేను ముందే ఊహించాను. బహుశా కాబ్ మిమ్మల్ని తీసుకొస్తున్నాడను కుంటా?" అడిగాడు దావూద్.

"అవును. కాబ్ మమ్మల్ని తీసుకొస్తున్నాడు".

"చాలా తప్పుడు నిర్ణయం తీసుకున్నారు. ఏడీ కాబ్ ఎక్కడున్నాడు? అతనితో మాట్లడాలి."

గుంపు మధ్యలో ఉన్న కాబ్ ముందుకొచ్చి "ఏమిటి విశేషం?" అని అడిగాడు

"మీరు ఎవరి సారథ్యంలో ఈ కార్యం చేపట్టారు?"

"హుయ్యి సారథ్యంలో."

"నేను ముందే అనుకున్నాను హుయ్యి సారథ్యంలోనేనని. ముస్లింలు బనూ నజీర్ తెగపై ఊరికనే నింద మోపలేదు. హుయ్యి, అతని తెగవాళ్ళు ముహమ్మద్‌ను హత్య చేయడానికి కుట్ర పన్నారు. ఈ విషయం ముస్లింలకు ఎలా తెలిసిందో నాకైతే తెలియదు. కాని ముస్లింలకు మాత్రం తమకీ విషయం దేవుడు జిబ్రీల్ ద్వారా తెలియజేశాడని అన్నారు. బహుశా అది నిజమే కావచ్చు. నేనొక ప్రముఖ సన్యాసిని కలిశాను. అతడు కందకం యుద్ధంలో ముస్లింలు విజేతలవుతారని జోస్యం చెప్పాడు. అతడు చెప్పింది నూటికి నూరిపాళ్ళూ నిజమవుతుంది. మీకీ సంగతి చెప్పాలనే నేను వస్తున్నాను?" అన్నాడు దావూద్.

"నేను సన్యాసుల్ని, జోతిష్యుల్ని నమ్మేవాణ్ని కాను. మేము ఈ యుద్ధంలో తప్పక విజయం సాధిస్తామనే నమ్మకం ఉంది. ఖురైషీయులకు సహాయపడడం లోనే మా శ్రేయస్సు ఉంది" అన్నాడు కాబ్.

"మీ అభిప్రాయం తప్పు ఆ జ్యోతిష్యుడు చెప్పినట్లు మీకు మహాదుర్గతి పడుతుందని నా అంతరాత్మ కూడా ఘోషిస్తోంది. అందుకని దయచేసి ముస్లిం లతో తలపడకండి."

"అసాధ్యం. మేము ముస్లింలపై దాడిచేసి తప్పక విజయం సాధిస్తాం."

"సరే మీఇష్టం. నేను చెప్పదలచుకున్నది చెప్పాను. మీ వినాశాన్ని మీరే చేజేతులా కొనితెచ్చుకుంటున్నారు"అంటూ దావూద్ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

కాబ్, అతని అనుచరులు కోట వైపుకు సాగిపోయారు. రాత్రి వాతావరణం ప్రశాంతంగా ఉంది. గంభీరమైన నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. చలి విపరీతంగా

వణికిస్తోంది. శరీరం మంచులో తడిసి తిమ్మిరెక్కిపోతుంది. అనారోగ్యంతో బాధ పడుతున్న హజ్రత్ హస్సాన్ (రజి) దుప్పటి కప్పుకొని కూర్చొని కోటరక్షణ బాధ్యత నిర్వహిస్తున్నారు.

కాబ్, అతని అనుచరులు దగ్గరగా వచ్చి కోటలోకి ప్రవేశించే ప్రయత్నాలు చేస్తున్నారు. ఆ సమయంలో హజ్రత్ సఫియా, షీమా వీరసిపాయిల్లా గస్తీ తిరుగుతున్నారు.

"షీమా! యూదులీ రోజు మన కోటపై దాడి చేస్తారని నీతో రీహానా చెప్పిందే. ఆమె యాదులమ్మాయి అయిఉండి కూడా నీకీ విషయం ఎలా చెప్పింది?"

"ఆమె ఇంతకు ముందు కూడా తన తెగవారి కుట్రలు గురించి చెప్పింది. ఆమె మనసులో ఇస్లాం గూడు కట్టుకుంది. కాని తండ్రికి భయపడుతోంది."

వీరిలా మాట్లాడుకుంటూ హజ్రత్ హస్సాన్ దగ్గరికి చేరుకున్నారు.

"ఎవరో చాలామంది జనం వస్తునట్లు అడుగుల చప్పుడు విన్పించింది. కాని తరువాత మళ్ళీ విన్పించలేదు. నా చెవులు నన్ను మోసం చేసి ఉంటాయి" అన్నారు హజ్రత్ హస్సాన్ (రజి).

"ఎంత సేపయింది?"

"ఇప్పుడే, ఎంతోసేపు కాలేదు."

"మరి మీరు తొంగిచూడలేదా?"

"చూశాను కానీ ఏమీ కనిపించలేదు."

"యూదులీరోజు మన కోటపై దాడి చేస్తారని తెలిసింది."

"దేవుడే మనల్ని వారి దయాదాక్షిణ్యాలపై వదలడు. ఆయన తప్పక మనకు సహాయం చేస్తాడు" అన్నారు హజ్రత్ హస్సాన్ (రజి).

అంతలో కోటగోడపై ఎవరో ఎక్కుతున్నట్లు తల కన్పించింది అస్పష్టంగా.

"హస్సాన్ ! అటు చూడండి ఎవరో గోడ ఎక్కుతున్నట్లనిపిస్తోంది."

"అయితే నా చెవులు నన్ను మోసం చేయలేదు. నీకందిన సమాచారం కూడా నిజమే. వాడెవడో యూదుల గూఢచారి అనుకుంటా?"

వెంటనే హజ్రత్ సఫియా (రజి) కరవాలం తీసుకొని మెల్లిగా గోడపక్కకు చేరుకొని, గోడ ఎక్కడానికి ప్రయత్నిస్తున్న యూదుని మెడ మీద ఒక్క వేటు వేశారు. దాంతో అతడు ఒక చిన్న మూలుగుతో కుప్పకూలిపోయాడు. వెంటనే హజ్రత్ సఫియా ఆ యూదుడి తలను మొండెం నుండి వేరుచేసి గోడ అవతలకి విసిరేశారు. కాబ్, అతని అనుచరులు తమ కాళ్ళ ముందు తమ అనుచరుడి తల పడడం చూసి అవాక్కయ్యారు. కోటరక్షణ కోసం ముస్లిం పురుషులు చాలా పకడ్బందీగా ఉన్నారని భావించి వారు అక్కడ్నుంచి మెల్లగా జారుకున్నారు.

రోజులు గడుస్తున్న కొద్దీ ముస్లింల కష్టాలు అధికమవుతున్నాయి. అంతంత మాత్రం ఉన్న ఆహార పదార్థాలు కూడా అయిపోయాయి. రాత్రులు విపరీతమైన చలితో కూడిన ఈదురుగాలులు జనాన్ని వణికిస్తున్నాయి. మరోవైపు శత్రుదాడి భయంవల్ల ముస్లింలు ఆరుబయట ఆకాశం కిందనే పడుకునేవారు. వంతులు వారీగా పహరా కాస్తూ అనుక్షణం అప్రమత్తంగా ఉండేవారు.

మక్కా అవిశ్వాసులు కూడా సమస్యల సుడిగుండంలో చిక్కుకున్నారు. వారు ఎంత ప్రయత్నించినా కందకం దాటలేక పోయారు. రోజులు గడుస్తున్న కొద్దీ వారిక్కూడా ఆందోళన మొదలైంది. బనూఖురైజా సూచన మేరకు రాత్రంతా కళ్ళు కాయలుకాచేలా ఎదురుచూసిన ఖురైషీయులకు చివరికి నిరాశే మిగిలింది. దాంతో పట్టరాని ఆవేశం చెందిన అబూసుఫ్యాన్ బనూఖురైజా దుర్మార్గులు ముస్లింలతో కలిసే ఉన్నారని చిందులేశాడు.

సరిగ్గా అదే సమయంలో హుయ్యి మరొక వ్యక్తిని వెంట బెట్టుకొని వచ్చి "రాత్రి బనూఖురైజా దాడి చేశాడు కాని అపజయం ఎదురైంది" అన్నాడు.

"చేసింది సరిపోలేదా? ఇంకా ఏంచేద్దామని వచ్చావు? నీ కళ్ళకు మేము దద్దమ్మల్లా కనబడుతున్నామా" అన్నాడు అబూసుఫ్యాన్ ఆగ్రహంతో ఊగిపోతూ.

"మీరలా అంటారనే కాబ్ ఈ ప్రతినిధిని పంపాడు" అంటూ రాత్రి జరిగిన వృత్తాంతమంతా చెప్పమన్నాడా ప్రతినిధితో. అతను తాము ఫారిగ్ కోటపై దాడి చేయడం తమ అనుచరుడు హత్యచేయబడడం అంతా వివరించాడు.

"అసలు మీరు పగలే దాడి చేయవలసింది" అన్నాడు అబూ సుఫ్యాన్.

"పగలు దాడి చేయడం వల్ల ముస్లింలు అధిక సంఖ్యలో మా మీద పడి మమ్మల్ని అంతమొందించే ప్రమాదముంది. కనుక మనం ముందే అనుకున్నట్లు

మీరు 70 మంది మీ యోధుల్ని పంపితే మా ధైర్యం ఇనుమడించి పగలే వారిపై దాడిచేస్తాం" అన్నాడు ప్రతినిధి.

"దాడి చేస్తారా లేక మావాళ్ళను ముస్లింలకు అప్పగిస్తారా?"అన్నాడు అబూ సుఫ్యాన్ వ్యంగ్యంగా.

"మిమ్మల్నెవరో తప్పుదోవ పట్టించారు"

"నాకన్నీ తెలుసు నువ్వేం చెప్పనక్కర్లేదు. ఇకనుండి మేమేం చేయదలచు కున్నా స్వయంగానే చేస్తాం. మీ సహాయం మా కవసరం లేదు."

"ప్రస్తుత పరిస్థితుల్లో బనూఖురైజానే అనుమానించడం మీకు భావ్యం కాదు" అన్నాడు హుయ్యి.

"నేనెవరినీ అనుమానించడంలేదు. మేమెప్పుడు దాడి చేస్తే అప్పుడు మాతో దాడిలో పాల్గొనమని కాబ్‌తో చెప్పండి. ఒక వేళ అతని మనసులో ఏ దురుద్దేశం లేకపోతే మాతో కలసి దాడిలో పాల్గొంటాడు" అన్నాడు అబూసుఫ్యాన్.

"అలాగే అంతా వివరిస్తాను."

"దైవప్రవక్త (సఅసం) ముస్లింయోధుల స్థితిగతులు తెలుసుకోవడానికి వారి గుడారాల దగ్గరికి వచ్చారు. అప్పుడు ఓ యువకుడు దైవప్రవక్త గౌరవార్థం లేచి నిలబడే ప్రయత్నంలో తూలి పడబోయాడు. దైవప్రవక్త (సఅసం) అతడ్ని చూసి "ఏమిటి నీ పరిస్థితి ఇలా తయారయింది?" అన్నారు లాలనగా.

"దైవప్రవక్తా! ఆకలి నన్ను మృత్యుకోరల్లోకి చేర్చింది. కొన్నాళ్ళ నుంచి ఒక్క మెతుకైనా నోట్లోకి పోలేదు. ఆకలికి తట్టుకోలేక కడుపు మీద రాయి కట్టుకున్నాను, చూడండి" అంటూ చొక్కా పైకెత్తి పొట్ట చూపించాడు ఆ యువకుడు.

ఆ దృశ్యం చూసి దైవప్రవక్త (సఅసం) తల్లడిల్లిపోయారు. అతడ్ని ఓదారుస్తూ "భయపడకు నాయనా! సహనం వహించు. దేవుని పరీక్ష సమాప్తం కావస్తోంది. నేనెవరితో చెప్పుకోను? ఆకలికి తాళలేక నాపొట్ట మీద రెండురాళ్ళు కట్టుకున్నాను చూడు"అంటూ ఆ మహానాయకుడు (సఅసం) చొక్కా పైకెత్తి పొట్ట చూపించారు.

ఆ దృశ్యం చూసిన ఆ యువసైనికుని కళ్ళు చెమర్చాయి.

"దైవప్రవక్తా! మీరు మాకంటే ఎక్కువ బాధలు భరిస్తున్నారు. నన్ను

క్షమించండి. ఇంకెప్పుడూ నేను ఆకలి అని మీ దగ్గర ఫిర్యాదు చేయను" అన్నాడతను.

దైవప్రవక్త తన జేబులో నుండి ఒక ఖర్జూరం తీసిస్తూ "దీన్ని తిను దైవం పేరుతో" అని అన్నారు.

"దైవప్రవక్తా! మరిమీకు?"

"దైవం నాకు కూడా తినిపిస్తాడు నువ్వు తిను ముందు."

ఆ యువకుడు తిరస్కరించలేక దైవప్రవక్త ఇచ్చిన ఆ ఖర్జూరం తిని కాసిని మంచి నీళ్ళు తాగాడు. దాంతో కాస్త ఊపిరొచ్చినట్లయింది.

దైవప్రవక్త (సఅసం) మరికాసేపు సైనిక శిబిరాల మధ్య తిరిగి తన గుడారం వద్దకు తిరిగొచ్చారు. అప్పుడక్కడ అనేకమంది అనుచరులు గుమిగూడి ఉన్నారు. వారిని చూడగానే దైవప్రవక్త (స) సుదీర్ఘ యుద్ధవాతావరణం వల్ల వారి ధైర్య సాహసాలు సన్నగిల్లాయేమోనని ఆందోళన పడుతూ వారితో ఇలా అన్నారు:

"మిత్రులారా! గత్ఫాన్ తెగవాళ్ళు ఖురైషీయుల పక్షం వీడి మనకు సహక రించడానికి కొన్ని షరతులతో కూడిన ఒప్పందాన్ని ప్రతిపాదించారు.

"ఒప్పందం కుదుర్చుకోవడంలో ఆటంకమేముంది? ఇంతకూ ఆ షరతు లేమిటో?" అన్నారు సాద్ బిన్ మాజ్ (రజి).

"షరతులేమిటనేది ఇంకా కచ్చితంగా తెలియదుకాని మదీనా పండ్లతోటల్లో భాగం ఆశిస్తున్నారని మాత్రం తెలిసింది" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"అయితే వాళ్ళు దైవధర్మాన్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నారా?"

లేదు. కాని సుదీర్ఘకాల యుద్ధం వల్ల మీరు ధైర్యం కోల్పోతున్నారేమోనని నాక్కాస్త అనుమానం కలిగింది. అందుకే గత్ఫాన్ తెగకు మదీనా పండ్ల తోటల్లో కొంత భాగం ఇచ్చి వారి సహాయం కోరదామనుకున్నాను. కాని ఇన్ని కష్టనష్టాలు ఎదురవుతున్నా మీరెంతో సహనంతో స్థయిర్యంతో ముందడుగు వేస్తున్నారు. మీ వైఖరిలో ఎటువంటి మార్పురాలేదు. ఇది చాలా సంతోషదాయకం. ధర్మ మార్గంలో ఎన్ని కష్టాలెదురైనా చలించకుండా స్థాణువులా నిలబడగలగడమే ముస్లిం గుణం. ప్రజలు ఆకలితో, చలిగాలుల్లో ఎంత తల్లడిల్లిపోతున్నారో నాకు తెలుసు. కాని

దైవం తలిస్తే త్వరలోనే ఈ కష్టాలు దూరమై సుఖశాంతుల శకం ప్రారంభం అవుతుంది" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"దైవసాక్షి! మేమీ కష్టనష్టాలకు భయపడటం లేదు. దేవునిపై మాకు పూర్తి నమ్మకముంది. ఆయన మనకు తప్పక సహాయం చేస్తాడు. నిశ్చయంగా విజయం మనదే" అన్నారు ముక్తకంఠంతో సహచరులందరూ.

" సరే ఇక వెళ్ళండి. వెళ్ళి మీమీ స్థానాల్లో స్థిరంగా ఉండండి" అన్నారు దైవప్రవక్త (సఅసం).

మరుసటి రోజు ఉదయం అవిశ్వాసులు ఆయుధాలు ధరించి అట్టహాసంగా ముస్లింలపై దాడికి బయలుదేరారు. ప్రతి నాయకుడూ తన సైనిక దళాన్ని తీసుకొని రణభేరి మోగిస్తూ ముందుకు సాగుతున్నాడు. సైనికులు పరిసరాలు ప్రతిధ్వనించేలా నినాదాలు చేస్తున్నారు.

ఆ సమయంలో దైవప్రవక్త (సఅసం) తన గుడారం బయట ఖర్జూరపు చాపపై కూర్చొని ఉన్నారు. అవిశ్వాసుల నినాదాలు విని ఆయన ఇలా అన్నారు:

" ఈరోజు అవిశ్వాసులు శక్తిమంతమైన దాడి చేయాలనుకుంటున్నారు. ముస్లింలారా! ఈ అవిశ్వాసుల నినాదాలకు బెదిరిపోకండి. వాళ్ళు మనల్ని భయభ్రాంతులకు గురి చేయాలనుకుంటున్నారు. అరచేతిని అడ్డుపెట్టి సూర్య తేజాన్ని ఆపాలనుకుంటున్నారు. మీరు కూడా రణభేరి మ్రోగించి ప్రతినినాదాలు చేసి పోరుకు సిద్ధంకండి. స్వర్గద్వారాలు తెరుచుకున్నాయని తెలుసుకోండి. వీరయోధుల్లా పోరాడి ముస్లింలంటే పులులని నిరూపించండి. ముస్లిం దైవానికి తప్ప మరెవరికి భయపడడు. దిక్కులు పిక్కుటిల్లేలా నినదించండి. మీ నినాదాలు శత్రువుల గుండెల్లో వణుకు పుట్టిస్తాయి."

"అల్లాహు అక్బర్" అంటూ ముస్లిం సైనికులంతా పరిసరాలు ప్రతిధ్వనించేలా నినదించారు.

"విశ్వాసులారా! మీరు చేసే ప్రతి పనీ ఐకమత్యంతో ముడిపడి ఉండాలి. ఐకమత్యంలోనే శుభం ఉంది. దైవం ముస్లింలకు ఐక్యత గురించి బోధించాడు. విశ్వాసులు ఐక్యంగా ఉన్నంత కాలం ప్రపంచంలోని ఏశక్తి వారిని ఏమీ చేయ జాలదు. ప్రపంచమే వారికి దాసోహమంటుంది. వారిలో అనైక్యత చోటు చేసు

కుంటే వారి గౌరవం, విలువ పడిపోతాయి. వారినెవరూ లెక్క చేయరు. అందుకని యుద్ధంలో కూడా ఐక్యత ఉండాలి. కలసి ఎదుర్కొండి. కలసి పోరాడండి. అదిగో! శత్రువులు బాణాలు కురిపించడం ప్రారంభించారు. జాగ్రత్తగా మసలుకోండి" అంటూ హితవు చేశారు దైవప్రవక్త (సఅసం).

కందకం తవ్వకుండా వదిలేసివున్న వైపున శత్రుసైన్యాలు మోహరించాయి. ఆ సైన్యంలోని ముగ్గురు వీరులు అమ్ర్ బిన్ అబ్దూ, జరార్, జబీరా ముందుకొచ్చి ముస్లింలపై సవాలు విసిరారు. దైవప్రవక్త (సఅసం) వారినెదుర్కోవడానికి హజ్రత్ అలి (రజి), హజ్రత్ ఉమర్ (రజి)లను, ఒక అన్సారీని ఎంపిక చేశారు. వీరు ముగ్గురూ రంగంలోకి రాగానే మొదట అమ్ర్ బిన్ అబ్దూ పోరాటానికి సిద్ధమయ్యాడు. అమ్ర్‌ని ఢీకొనడానికి అలీ ముందు కొచ్చారు. యువప్రాయంలో మిసమిసలాడే నవయువకుడైన అలీని చూసి "నీ పేరేమిటి?" అన్నాడు అమ్ర్.

"నాపేరు అలీ. పులుల దండులను చీరేసే అలీ ఈ పులి" అంటూ తొడ చరిచారు హజ్రత్ అలీ (రజి).

"ఓహో !...నువ్వేనా అలీ. అయితే నీకిప్పుడే తెలిసిపోతుందిలే ఎవరితో ఢీకొనడానికి వచ్చావో".

"అమ్ర్! ఎవరైనా నిన్ను మూడు మాటలడిగితే నీవు తప్పకుండా అందులో ఒకటి స్వీకరిస్తావని తెలిసింది. ఇది నిజమేనా!"

"అవును నిజమే"

"అయితే నా మొదటి విన్నపం, నువ్వు దైవధర్మాన్ని స్వీకరించు."

"ఛీ! ఎటువంటి మాటడిగావు, నేను దీన్ని చచ్చినా స్వీకరించను" అన్నాడు అసహ్యంగా ముఖంపెట్టి.

"అయితే ఇక్కడి నుండి వెళ్ళిపో"

"ఇది అసంభవం. అలీ! ఈ ఆకాశం క్రింద, ఈ భూమండలం మీద నాతో ఢీకొనడానికి సవాల్ చేసిన వాడివి నువ్వొకడివే. నేనెవరినో తెలుసా! రణరంగంలో వేయిమంది కూడా నాకు సమాధానం చెప్పలేరు. హ్హ హ్హ హ్హ" అంటూ అమ్ర్ వికటట్టహాసం చేశాడు.

"ఈరోజు నీ భ్రమలన్నీ తొలగిపోతాయి. నీ గర్వం అణగిపోతుంది. విర్ర వీగకు. ఖబర్దార్!" అన్నారు హజ్రత్ అలి (రజి)

ఈ మాటలకు అమ్ర్‌కు రోషం వచ్చింది. ఒరలోంచి చర్రున కత్తి దూశాడు. వెంటనే అలీ డాలును అడ్డుపెట్టారు. అయినా అమ్ర్ ధాటికి కరవాలం డాలును చీల్చుతూ వచ్చి అలీ నుదుటిని తాకింది. చివ్వున రక్తం చిందింది. వెచ్చని నెత్తురు అలీలోని పులిని మేల్కొలిపింది. దెబ్బతిన్న బెబ్బులిలా విజృంభించారు. తృటిలో ఆయన కరవాలం అమ్ర్ గుండెల్ని చీల్చివేసింది. ఒక చిన్న కేకైనా పెట్టకుండానే అమ్ర్ రక్తపు మడుగులో పడిపోయాడు.

ఈ వార్త ముస్లింలను అమితంగా సంతోషపరిచింది. వారు దిక్కులు పిక్కుటిల్లేలా తక్బీర్ నినాదం చేశారు. వెంటనే జరార్, జబీరా పళ్ళు పటపట కొరుకుతూ అలీపై విరుచుకుపడ్డారు. మరుక్షణమే హజ్రత్ ఉమర్ (రజి) జరార్‌తో తలపడ్డారు. హజ్రత్ అలీ (రజి) జబీరాపై విజృంభించారు.

జబీరా హజ్రత్ అలీపై కత్తి దూసాడు. ఆయన డాలుతో కరవాలాన్నెదుర్కొని ప్రత్యర్థిపక్కలో పొడిచారు. దాంతో ప్రత్యర్థి భయంకరమైన కేకపెట్టి పలాయనం చిత్తగించాడు. ఆయన జబీరాను వెంబడించి ఒక్కవేటు వేశారు. దాంతో అతడి తల తెగి కొన్ని గజాల దూరంలో పడిపోయింది.

తన సహచరుల దుర్గతిని కళ్ళారా చూసిన జరార్ వణికిపోయాడు. వెంటనే గుర్రాన్ని వెనక్కి తిప్పి వేగంగా పారిపోయాడు.

"జరార్ ! ఏమిటి పరిస్థితి?" అన్నాడు అబూసుఫ్యాన్ జరార్‌ని చూడగానే.

"ఏం చెప్ప మంటారు? నేను చూసిన ఆ దృశ్యానికి నా గుండెలు ఇప్పటికీ భయంతో కొట్టుకుంటూనే ఉన్నాయి."

"ఏమిటా దృశ్యం?"

"అలి, అమ్ర్‌బిన్ అబ్దూను చంపేశాడు."

"ఏమిటి?.... అలీ, అమ్ర్ బిన్ అబ్దూను చంపేశాడా? నమ్మశక్యంగా లేదే?" అంటూ నోరెళ్ళబెట్టాడు అబూసుఫ్యాన్.

"అవును అతను అమ్ర్ గుండెల్ని చీరేశాడు. ఒకవేళ అలీ వేసిన కత్తి వేటు రాతిపై పడ్డా అది నుజ్జు నుజ్జయిపోతుంది."

"మరి జబీరా ఏమయ్యాడు?" అన్నాడు అబూసుఫ్యాన్.

"అతణ్ణి కూడా అలీయే చంపేశాడు."

"ఊ....ఇద్దరు వీరులూ హతమయ్యారన్నమాట. ముహమ్మద్ ఎంత కల్లోలం సృష్టించాడు! ఈ కల్లోలాన్ని అణచడానికి ఎంతగా ప్రయత్నిస్తుంటే అంతగా అది ఉధృతమవుతోంది. లాభం లేదు పూర్తి శక్తియుక్తులతో ముస్లింలపై దాడి చేయండి. ఒక్కొక్క ముస్లింను ఏరి ఏరి చంపండి. ఖురైషియులారా! ముస్లింల ఆగడాలు ఎక్కువైపోతున్నాయి. గత యుద్ధాల్లో కూడా వారు అనేక మంది మన నాయకుల్ని చంపేశారు. ఈ యుద్ధంలో కూడా అనేకమంది వీరసైనికుల్ని చంపేశారు. నౌఫిల్, అమ్ర్, జబీరా లాంటి వీరులు హతమయ్యారు. వీరి తరపున మనం ప్రతీకారం తీర్చుకోవలసి ఉంది. దీనికి మీరు సిద్ధంగా లేరా?" అంటూ రెచ్చగొట్టాడు అబూసుఫ్యాన్.

"తప్పకుండా ప్రతీకారం తీర్చుకుంటాం, మేమంతా దాడికి సిద్ధంగా వున్నాం" అన్నారు సైనికులంతా ముక్తకంఠంతో.

"అయితే వెంటనే దాడికి సిద్ధంకండి, మీ పౌరుషం నిరూపించండి. పూర్తి శక్తితో విజృంభించి మీతడాఖా చూపించండి. కందకమేకాదు, కొండలు అడ్డొచ్చినా పగలగొట్టి ముందుకుసాగండి." మరికాస్త రెచ్చగొట్టాడు అబూసుఫ్యాన్.

మరుసటిరోజు ఖురైష్ సేనావాహిని నురగలు కక్కుతూ బయలుదేరింది. ఆ సైన్యాన్ని చూసి ముస్లింలు భయపడకుండా దాన్ని ఎదుర్కోవడానికి సిద్ధమయ్యారు. శత్రుసైన్యం కందకం అంచుకు చేరి బాణాల వర్షం కురిపించడం ప్రారంభించింది. ఇస్లామీయ సైన్యం కూడా ఎదురుదాడి ప్రారంభించింది. ఇరు వర్గాల మధ్య భీకర సంగ్రామం మొదలయింది.

ఆరోజు జరిగినటువంటి హోరాహోరీ పోరాటం అంతకు ముందెన్నడూ జరగలేదు. ముస్లింలు ఆరోజు 'అసర్' నమాజ్ కూడా చేయలేకపోయారు. చివరికి సూర్యాస్తమయానికి కాస్తముందు శత్రుసైన్యం వెనకడుగు వేసింది. వెంటనే ముస్లింలు అసర్ నమాజ్ చేసుకున్నారు. రెండవ రాత్రి మళ్ళీ యుద్ధానికి సిద్ధం కండని సైన్యానికి ఆజ్ఞాపించాడు అబూ సుఫ్యాన్. గతరాత్రి ముస్లింల చేతిలో చావు దెబ్బలు తిన్న శత్రుసైన్యం తమ నాయకుని ఆజ్ఞ శిరసావహించ డానికి తటపటాయిస్తోంది. అంతలో ఆకాశమంతా మేఘావృతమయింది. ఉరుములు

మెరుపులతో చిరుజల్లు ప్రారంభమైంది. చూస్తుండగానే అదికాస్తా పెనుతుఫానుగా మారిపోయింది. భయంకరమైన గాలి హోరుకు గుండెలు దడదడలాడసాగాయి. ఒంటెలు త్రాళ్ళు త్రెంచుకొని పారిపోతున్నాయి.

ఈ పెనుతుఫాను వల్ల ముస్లింలకు కూడా తీవ్రమైన ఇబ్బంది కలుగుతోంది. అది గమనించిన దైవప్రవక్త (సఅసం) ముస్లింలను నిలకడగా ఉండమని, ఏమరుపాటుకు గురికావద్దని, ఇదే అదనుగా భావించి శత్రువు దాడిచేసే ప్రమాదముందని హెచ్చరించారు. "మీరు దైవం పై భారంవేసి సహనస్థయిర్యాలు ప్రదర్శిస్తే ఈ పెనుతుఫాను మన పట్ల కారుణ్యంగా, శత్రువుల పట్ల మృత్యువుగా పరిణమించవచ్చు" అన్నారు ఆయన.

అటువైపు శత్రువుల పరిస్థితి ఘోరంగా మారిపోయింది. సైనిక గుడారాలు కుప్ప కూలిపోయాయి. తినుబండాలు వర్షానికి కొట్టుకుపోయాయి. ఒంటెలు, గుర్రాలు త్రాళ్ళు త్రెంచుకొని పారిపోయాయి. ఇప్పుడు శత్రువులు కేవలం కట్టుబట్టలతో మాత్రమే మిగిలారు. వర్షానికి తడిసిన బట్టలతో గజగజ వణికి పోతున్నారు. అబూసుఫ్యాన్. ఖాలిద్ బిన్ వలీద్, అమ్రే బిన్ ఆస్, ఇక్రమ బిన్ అబూజహల్‌లు కలసి అత్యవసర సమావేశం పెట్టి పరిస్థితిని సమీక్షిస్తూ ఇప్పుడేం చేయాలి? అని తర్జన భర్జనలు పడుతున్నారు.

"ఈ పరిస్థితిని అవకాశంగా భావించి ముస్లింలు దాడి చేసే ప్రమాదం కూడా లేకపోలేదు. ఈ పరిస్థితిలో వారు దాడిచేస్తే మన ఒంట్లో ఎముకలు కూడా మిగలవు" అన్నాడు ఖాలిద్.

"అవును. మన ఒంటెలు, గుర్రాలు త్రాళ్ళు తెంచుకొని పారిపోయాయి. ఇప్పుడు మన పరిస్థితి ఏమిటి? వాహనం లేకుండా ఎంత దూరమని వెళ్ళగలం? మన దురదృష్టమేమిటో మన దేవతలు కూడా మనకు సహాయపడటం లేదు. ఇప్పుడు మనం కాళ్ళకు బుద్ధిచెబితే కనీసం ప్రాణాలైనా దక్కుతాయి" అన్నాడు అబూసుఫ్యాన్.

గతరాత్రి ముస్లింల చేతిలో చావు దెబ్బలు తిన్న శత్రు సిపాయిలు అబూ సుఫ్యాన్ తదితర నాయకుల సంభాషణ విని ఖంగుతిన్నారు. అక్కడ నుండి పరుగు పరుగున వెళ్ళి తమ మిత్రులతో "మన నాయకుడు ఆదేశించాడు, పారి పోండి లేకపోతే ముస్లింల చేతిలో కుక్కచావు చస్తాం వెంటనే పారిపోండి" అని

ప్రకటించారు. దాంతో ఎవరికి ఎలా అవకాశం దొరికితే అలా పారిపోయారు. బ్రతుకు జీవుడా అనుకుంటూ శత్రుసైన్యమంతా పలాయనం చిత్తగించింది.

ఈ పెనుతుఫాను ధాటికి తాళలేక శత్రుసైన్యం పలాయనం చిత్తగించిన విషయం దేవుడు తన ప్రియప్రవక్తకు తెలియజేశాడు. ఈ శుభవార్త వినగానే దైవప్రవక్త అమితానందంతో తమ అనుచరులక్కూడా తెలియజేశారు. అనుచరులంతా ఆనందంతో పొంగిపోతూ ఒకరినొకరు ఆలింగనం చేసుకున్నారు. అల్లాహు అక్బర్ అంటూ నినాదాలు చేశారు. అంతలో హజ్రత్ హుజైఫా (రజి) కూడా అక్కడికి వచ్చేశారు.

"హుజైఫా! ఇప్పుడిప్పుడే నాపై దైవవాణి అవతరించింది. జిబ్రీల్ (అస్సలాం) వచ్చి శత్రువులు తుఫాను ధాటికి భయపడి పారిపోయారని తెలియజేశారు. నువ్వొకసారి శత్రుశిబిరానికెళ్ళి చూసిరా" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"అలాగే దైవప్రవక్తా!"అంటూ వెళ్ళిపోయారు హుజైఫా (రజి).

"అసలిది తుఫాను కాదు. దేవుని ఆగ్రహం. దైవాగ్రహం తుఫాను రూపం దాల్చి శత్రువుల్ని తరిమి కొట్టింది" అన్నారు హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి).

అంతలో హజ్రత్ హుజైఫా తిరిగొచ్చి శత్రుశిబిరంలో ఒక్క మనిషిగాని, ఒంటెగాని, గుర్రంగాని ఏమీలేవని, సామాన్లు మాత్రం చిందరవందరగా పడి ఉన్నాయని తెలియజేశారు. ముస్లింలు మరోసారి సంతోషంతో అల్లాహుఅక్బర్ అంటూ నినాదం చేశారు. ఆ తరువాత క్రమంగా తుఫాను తగ్గిపోయింది. దాని ప్రస్తావనను దేవుడు తన గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు:

"విశ్వసించిన ప్రజలారా! దేవుడు చేసిన ఆ మహోపకారాన్ని గుర్తుకు తెచ్చుకోండి. శత్రుసైన్యాలు మీపై విరుచుపడినప్పుడు మేము వారిపై తుఫాను, గాలిదుమారం పంపాము. ఇంకా మీరు చూడలేని అదృశ్య సైన్యాన్ని పంపాము. శత్రువులు పైనుంచి క్రిందినుంచి పెద్దఎత్తున మీపై విరుచుకుపడినప్పుడు మీరు భీతావహులై కళ్ళు తేలవేశారు. మీ గుండెలు దడదడలాడి పోయాయి. మీరు దేవుడ్ని గురించి రకరకాల అనుమానాలకు గురయిపోయారు. ముస్లింలకు అదొక కఠిన పరీక్షాసమయం. వారిని అతి తీవ్రంగా కుదిపి వెయ్యడం జరిగింది."

చరిత్రాత్మకమైన ఈ కందకం యుద్ధంలో దేవుడు ముస్లింలను కఠినంగా పరీక్షించాడు. దీనివల్ల కపటులెవరో, విశ్వాసులెవరో తేటతెల్లమైపోయింది. ఈ

పరీక్షలో ముస్లింలు పూర్తిగా నెగ్గారు. దేవుడు వారికి సహాయం చేశాడు. ఆయన దైవదూతలను పంపి శత్రువుల్ని తరిమికొట్టాడు.

ముస్లింలు సంతోషంతో పొంగిపోతూ అల్లాహు అక్బర్ నినాదాలు చేస్తూ నగరం వైపుకు బయలుదేరారు. మదీనాలోని అవిశ్వాసులు, కపటులు విజయంతో తిరిగొస్తున్న ముస్లింలను చూసి ఆశ్చర్య పోయారు. ఎందుకంటే ముస్లింలు బతికి బయటపడతారని వారు ఊహించనైనా లేదు. అందుచేత వారు తమ కళ్ళను తామే నమ్మలేకపోయారు. కాని కొంత మంది ఇస్లాం ధర్మాన్ని విశ్వసించనప్పటికీ ఆ సమయంలో వారు సంతోషంతో ముస్లింలకు ఎదురేగి స్వాగతం పలికారు. అబ్దుల్లాబిన్ ఉబై మాత్రం లోలోన మండిపోయాడు. ముస్లింల విజయాన్ని అతడు జీర్ణించుకో లేకపోతున్నాడు. మదీనాకు చక్రవర్తి కావాలని కలలు కన్న ఉబై ముఖంపై కత్తివేటుకు నెత్తుటి చుక్కలేదు.

ముస్లిం నినాదాలతో మదీనా మారుమోగిపోయింది. ఫారిగ్ కోటలోని ముస్లిం స్త్రీలు, పిల్లలు అంతా వచ్చేశారు. ఎవరి గృహాలకు వారు వెళ్లిపోయారు. దైవప్రవక్త (సఅసం) మస్జిదెనబవిలో కూర్చొని ఉన్నారు. అంతలో దైవదూత హజ్రత్ జిబ్రీల్ అలైహిస్సలాం ప్రత్యక్షమై ఇలా అన్నారు:

"ముహమ్మద్! దేవుడు బనూఖురైజా తెగను శిక్షించదలుచుకున్నాడు. మీరు బనూఖురైజాపై దాడి చేయండి. ఇది దైవాజ్ఞ" అని చెప్పి వెళ్ళిపోయారు.

వెంటనే దైవప్రవక్త (సఅసం) ఒక వ్యక్తిని పిలిచి, ముస్లింలందరినీ బనూ ఖురైజాపై దాడికి సిద్ధం కావాలని, అసర్ నమాజు కూడా అక్కడే చేయాలని చాటింపు వేయమని పురమాయించారు.

ఈవార్త విని ముస్లింలందరూ క్షణాల మీద దైవప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరయ్యారు. దైవప్రవక్త ఈ దైవాజ్ఞను వారందరికి వినిపించారు.

ఆ తరువాత ఆయన ఒక పతాకాన్ని హజ్రత్ అలీ (రజి)కు అందిస్తూ "ఈ సైన్యానికి నీవు సేనాపతివి. ఈ పతాకం తీసుకొని వెళ్ళు" అని ఆదేశించారు.

హజ్రత్ అలి (రజి) పతాకం చేబూని ముందుకు కదిలారు. ఆయన వెనకే దైవప్రవక్తతో పాటు సైన్యామంతా ముందుకు సాగింది.

ఈ విషయం కపటుల నాయకుడు అబ్దుల్లా బిన్ ఉబైను తీవ్రంగా కలవర

పరిచింది. బనూఖురైజా తెగ క్షేమంగా ఉంటే నేడుకాక పోయిన రేపైనా తన ఆశలు ఈడేరుతాయి. లేకపోతే తన ఆశలకు కాలం చెల్లినట్లే. అందువల్ల ఆ దుర్మార్గుడు ఒక దూతను బనూఖురైజా తెగ వద్దకు పంపాడు వారికి విషయం చెప్పి అప్రమత్తం చేయడానికి. ఆ దూత ఆగమేఘాల మీద హుయ్యి బిన్ అఖ్తబ్, కాబ్ బిన్ అసద్‌లకు ఇబ్బెఉబై సందేశాన్ని అందజేసి అతను, అతని తెగ మీకు అండగా ఉంటుందని తెలియజేశాడు. వెంటనే బనూఖురైజా తెగ కూడా తగు ఏర్పాట్లు చేసుకొని కోట ద్వారం మూసివేశారు.

ఈలోపు ముస్లిం సైన్యం అక్కడికి చేరుకుంది. వీరిని చూసి ఖురైజా తెగ వారు నోటికొచ్చినట్లు తిట్టడం ప్రారంభించారు. దైవప్రవక్త (సఅసం) అవేమీ పట్టించుకోకుండా ఆ యూదనాయకుల్ని పేరు పేరున పిలిచారు బిగ్గరగా.

ఈ పిలుపు విన్న హుయ్యి, కాబ్ మొదలగు నాయకులు "ముహమ్మద్! ఏమిటి? ఎందుకొచ్చావు! ఏం చెప్పదలుచుకున్నావు?" అని ప్రశ్నించారు.

"మీరు కనీస మానవత్వం కూడా లేకుండా ప్రవర్తించారు. మిత్రద్రోహానికి ఒడిగట్టారు. మీరు చేసిన ద్రోహాలు, మోసాలు ఇన్నీ అన్నీ అని చెప్పలేము. ఇలా పరిస్థితి చేయిదాటి పోవడంతో మేమిప్పుడు మీ దౌర్జన్యాలకు ప్రతీకారం తీర్చుకోవడానికొచ్చాం" అన్నారు దైవప్రవక్త (సఅసం).

దీనికి శత్రువుల వైపు నుండి ఎలాంటి సమాధానం రాలేదు. దాంతో దైవప్రవక్త (సఅసం) కోటను చుట్టుముట్టమని తమ సైన్యాన్ని ఆదేశించారు.

ఈ విధంగా కోట ముట్టడి వారంరోజుల వరకూ కొనసాగింది. కాని అటువైపు నుండి ఎటువంటి రాజీ ప్రతిపాదనగాని, సంధిప్రయత్నాలుగాని జరగకపోవడం వల్ల ఒకరోజు దైవప్రవక్త (సఅసం) రేపు కోటపై దాడికి సిద్ధం కండని సైన్యాన్ని ఆదేశించారు. మరునాడు ఉదయమే ముస్లిం సైనికులు పెద్ద ఎత్తున దాడికి సమాయత్తమయ్యారు.

ఇంటి కప్పుల పైనుండి, ప్రహారీ గోడలపై నుండి చూస్తున్న కొందరు యూదులు తీవ్రఆందోళన చెందారు. ముస్లింలు ఈరోజు దాడిచేసే ప్రమాదం ఉందని వారు హుయ్యికు, కాబ్‌కు తెలియజేశారు. "మీరీ రోజు చాలా జాగ్రత్తగా ఉండాలి" అన్నాడు హుయ్యి.

ముస్లింలు దిక్కులు పిక్కటిల్లేలా అల్లాహు అక్బర్ అంటూ నినాదం చేస్తూ

ముందుకు సాగారు. ఆ దృశ్యం చూసిన యూదులకు ముచ్చెమటలు పోశాయి. గుండెలు దడదడలాడి పోతున్నాయి. ఇక తాము బ్రతికి బయటపడటం అసంభవం అనుకున్నారు కొంతమంది. కాబ్ వారికి ధైర్యం కలిగించ ప్రయత్నించాడు.

"యూద వీరులారా! అసామాన్య శూరులారా! ముస్లింలు మన కోటను జయిస్తారని ఎన్నటికీ భావించకండి. మీలో ఒకరిని మించిన యోధులు మరొకరున్నారు. మీ శౌర్య పరాక్రమాలకు ముస్లింలు చిత్తయి పోవడం ఖాయం. లేవండి, నడుం బిగించండి, బాణాలు సంధించండి, రాళ్ళురువ్వండి, ముస్లింలను తరిమి తరిమి కొట్టండి. వారి హంగు ఆర్భాటాలు చూసి మీరే మాత్రం అధైర్యం చెందినా పిల్లుల్లాంటి వారు పులులయి పోతారు. అంచేత మీరు ధైర్యంగా ఉండండి."

కాబ్ మాటలకు యూదులు ఉత్తేజితులయ్యారు. వారి రక్తం ఉడికి పోయింది. వెంటనే వారు రాళ్ళు, బాణాలు కురిపించడం ప్రారంభించారు. ఇరువర్గాల మధ్య హోరాహోరీ పోరాటం మొదలైంది. ఇలా మధ్యాహ్నాం వరకూ కొనసాగింది. జొహర్ నమాజు సమయం కావడం వల్ల దైవప్రవక్త (సఅసం) ముస్లింలకు నమాజు విధి నెరవేర్చడానికి యుద్ధం ఆపేసి వెనక్కి రమ్మని ఆదేశించారు. ముస్లింలు వెంటనే ప్రవక్త ఆజ్ఞను శిరసావహిస్తూ యుద్ధాన్ని ఆపి వెనక్కి మరలారు. దీంతో యూదులు తెగసంబరపడి, ముస్లింలు పరాజయం పొందినట్లేనని భావించారు. కాని ఆ సంతోషం ఎంతో సేపు నిలవలేదు నమాజ్ కాగానే ముస్లింలు మళ్ళీ కోటను ముట్టడించి సమరశంఖం పూరించారు.

దీనివల్ల యూదులకు బయటకెళ్ళే ఆస్కారంలేక నిత్యావసరాలకు సైతం అలమటించ వలసివచ్చింది. కష్టకాలంలో సాయం చేస్తానని వాగ్దానం చేసిన కపటగ్రేశ్వరుడు అబ్దుల్లా బిన్ ఉబై యూదులను నిలువునా ముంచివేశాడు, దాంతో కాబ్ పూర్తిగా నిరాశ చెంది ముస్లింలతో కాళ్ళబేరానికి వచ్చాడు. తాము ఈ కోటను విడిచి ఎటైనా వెళ్ళిపోతామని. దీనికి అనుమతి ఇవ్వమని అతను ఒక దూత ద్వారా దైవప్రవక్త (సఅసం) వద్దకు రాయబారం పంపాడు.

దైవప్రవక్త (సఅసం) ఈ అభ్యర్థనను తిరస్కరిస్తూ తమ సైన్యంలో కాస్తంత కపటరోగం ఉన్న ఓ ముస్లింను కాబ్ దూత వెంట పంపిస్తూ "ఎటువంటి షరతులూ లేకుండా లొంగిపోండి. మేము మీ పట్ల ఎలా ప్రవర్తించడం న్యాయమో అలా ప్రవర్తిస్తాము' అని కాబ్‌కు చెప్పమని ఆదేశించారు.

ఈ వార్త విన్న బసూ ఖురైజా నాయకులకు నెత్తి మీద పిడుగు పడ్డట్లయింది. ఏం చేయాలో అర్థంగాక "మాపట్ల ముహమ్మద్ వైఖరి ఏమిటంటావు?" అని అడిగారు యూదు నాయకులు వచ్చిన దూతతో. "ఏముంది! మీ తలలు లేపేస్తాడాయన" అన్నాడు దూత. ఈ మాటలకు కాబ్ ఉలిక్కిపడి రాయబారాన్ని తిరస్కరించాడు. ఇక ఏం చేయాలో పాలుపోవడంలేదు. భోంచేయడానికి మనస్కరించడం లేదు. నిద్రా రావడంలేదు. పచార్లు చేయనారంభించాడు.

అప్పుడు నిద్రపోతున్న రీహానా కెవ్వున అరిచింది. కాబ్ కంగారుపడుతూ రీహనా గదిలోకి వెళ్ళి ఏమిటమ్మా! ఏమైంది? పీడకల వచ్చిందా? అంటూ ఆప్యాయంగా ఆమెను కదిపిలేపాడు.

"అవున్నాన్నా ! పీడకలే వచ్చింది" అన్నది రీహనా కళ్ళు నులుముకుంటూ.

"ఏం కలొచ్చిందమ్మా!" అడిగాడు కాబ్.

"మన జాతివారంతా ఒకచోట గుమిగూడి పులుల గురించి మాట్లాడు కుంటున్నారు. అంతలో పులులు గాండ్రిస్తూ వచ్చి మనవారి పైబడి చీల్చి చెండాడసాగాయి. రక్తం ఏరులైపారింది. ఆ రక్తపుటేరు నా కాళ్ళ దగ్గరికొచ్చేసరికి విపరీతమైన భయం వేసింది. బహుశా ఆ భయంతోనే నా నోట కేక వెలువడి ఉండవచ్చు" అన్నది రీహనా.

"ఆ... పెద్ద కేక పెట్టావు. నేను ఆ కేక వినే పరుగెత్తుకొచ్చాను. అప్పుడప్పుడు పీడకలలు అలాగే వస్తుంటాయి. భయపడబాకు, ఏమీ కాదు" అంటూ ధైర్యం చెప్పాడు కాబ్ కూతురికి.

"నాన్నగారూ! మన జాతివాళ్ళు ముస్లింలను ఎదిరించి పెద్ద తప్పు చేశారని పిస్తోంది నాకు" అన్నది రీహనా ఆందోళన చెందుతూ.

"ఇప్పుడు ఏమైందమ్మా! వాళ్ళు మనల్నేమీ చెయ్యలేరు. నువ్వు ధైర్యంగా ఉండు" అని చెప్పి వెళ్ళిపోయాడు కాబ్. తరువాత కాబ్ అందరినీ సమావేశపరచి ఇలా ప్రసంగించాడు:

"ముహమ్మద్‌తో నా పోరాటం ఇప్పటిది కాదు. చాలా పాతది. ఆయన లేవనెత్తిన కల్లోలానికి వ్యతిరేకంగా అవిశ్రాంతంగా పోరాడాను. కాని ఫలితం శూన్యం. నేను మీ అందరికంటే ఎక్కువగా మతగ్రంథాలు చదివాను. వాటిలో ముహమ్మద్ ప్రస్తావన ఉంది. వాస్తవానికి ఆయన చివరి దైవప్రవక్త. కాని ఆయన

పరాయి జాతిలో ప్రభవించడం వల్ల మనమంతా ఆయన్ని వ్యతిరేకించాం. ఆయనకు వ్యతిరేకంగా మనకు చేతనయినదంతా చేశాం. అయినా విజయం న్యాయాన్నే వరిస్తోంది. అది సహజం కూడా. కనుక ఇక మనమంతా ఆయన్ను విశ్వసించి, సత్యధర్మం వైపుకు మరలడమే మంచిదని అన్పిస్తోంది నాకు."

ఈ ప్రతిపాదనను అతని జాతి నిర్ద్వందంగా త్రోసిపుచ్చింది. అయితే వారిలో కొందరు మాత్రం రాజీ పడడమే శ్రేయస్కరమని భావించారు. అలాంటివారిలో అసద్ బిన్ ఉబైద్, సాలిచాబిన్, అమ్ర్ బిన్ సాద్ మొదలగు వారు మనసు మార్చుకొని దైవప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి ఇస్లాం స్వీకరించారు.

అయితే కాబ్ తన జాతి ప్రజల మాటల్లో పడి సరికొత్త కుతంత్రాలకు రూపకల్పన చేశాడు. అయినా అవీ బెడిసికొట్టాయి. ఇక లాభం లేదనుకొని యూదనాయకులు ఇరువర్గాల మధ్య తీర్పు చెప్పడానికి ఒక మధ్యవర్తిని నియమించి ఆయనిచ్చే తీర్పుకు ఇరువర్గాలూ కట్టుబడి ఉండాలని ప్రతి పాదిస్తూ దైవప్రక్త (సఅసం)కు కబురు పంపాడు.

దీనికి దైవప్రవక్త (సఅసం) అంగీకరిస్తూ "మీకు సన్నిహితమైన అవస్ తెగ నాయకుడు సాద్ బిన్ మాజ్‌ను మేము మధ్యవర్తిగా, న్యాయమూర్తిగా అంగీకరిస్తున్నాం. ఇది మీకు సమ్మతమైతే దానికి మేము సిద్ధమే" అని చెప్పారు.

బనూఖురైజా యూదులు అవస్ తెగవారికి చిరకాల మిత్రులు. అందువల్ల బనూఖురైజా యూదులు ఆ మధ్యవర్తి తీర్పును తాము అంగీకరిస్తామని దైవ ప్రవక్త (సఅసం)కు తెలియజేశారు.

అవస్ తెగవారు ఆ అవకాశం తమకు లభిస్తే తమ మిత్రతెగకు ఎంతోకొంత సాయం చేయవచ్చనే ఉద్దేశంతో ఆ తెగవారు కొందరు దైవప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి "దైవప్రవక్త! బనూఖురైజా తెగకు సంబంధించి ఒక మధ్యవర్తి తీర్పును మీరు అంగీకరిస్తామని అన్నారట నిజమేనా?" అని అడిగారు.

" అవును నిజమే" అన్నారు దైవప్రవక్త (సఅసం)

"దైవప్రవక్తా! బనూఖురైజావారు మా పాతమిత్రులని మీకూ తెలుసు. అందుకని ఆ మధ్యవర్తిత్వం బాధ్యత మాకు అప్పగిస్తే బాగుంటుందేమో" అన్నారు వారు ఎంతో వినయంగా.

దానికి దైవప్రవక్త చిరునవ్వు నవ్వి "మేము ముందుగానే మీ తెగ నాయకుడు సాద్ బిన్ మాజ్‌ను పెద్దమనిషిగా నిర్ణయించాము. ఆయన ఎలా చెబితే అలా నడచుకుంటాము" అని అన్నారు.

వెంటనే వారు సాద్ బిన్ మాజ్ వద్దకు వెళ్ళి "నాయకా! బనూఖురైజా తెగ వాళ్ళు, ముస్లింలు ఇరువర్గాలు మిమ్మల్ని మధ్యవర్తిగా అంగీకరించాయి. కనుక మన చిరకాల మిత్రులైన బనూఖురైజావారి కోసం దైవప్రవక్త (సఅసం)కు సిఫారసు చేయండి" అని వేడుకున్నారు.

దానికి సాద్ బిన్ మాజ్ "ఇరు వర్గాల వాదనలు విన్న తరువాత సత్యం, ధర్మం, న్యాయం ఎవరి పక్షాన ఉంటే వారి వారి పక్షాన తీర్పు చెబుతాను అంతేగాని మిత్రులు, శత్రువులు అని ఎవరినీ వెనకేసుకురావడం జరగదు. దానికి ఇష్టమయితేనే నేను వస్తాను. లేకపోతే రాను" అని చెప్పారు.

దీనికి వారంతా ఇష్టపడి సంతోషంగా వెళ్ళిపోయారు. హజ్రత్ సాద్ (రజి) అవిశ్వాసులతో జరిగిన అగడ్త యుద్ధంలో గాయపడ్డారు. అందువల్ల దైవప్రవక్త (సఅసం) ఆజ్ఞతో ఆయన కోసం ఆయన తెగవాళ్ళు ఒక పల్లకీని ఏర్పాటు చేశారు. అందులో ఆయన్ని కూర్చోబెట్టి బనూఖురైజా తెగ యూదులకు కోట వెలుపల యుద్ధం మైదానానికి తీసికెళ్ళారు. అక్కడికి చేరుకోగానే పల్లకీని దైవప్రవక్త (సఅసం) ముందు దించారు. హజ్రత్ సాద్ (రజి) దైవప్రవక్త (సఅసం) ను చూడగానే ఆయనకు గౌరవసూచకంగా లేచి నిలబడటానికి ప్రయత్నించారు.

దైవప్రవక్త (సఅసం) ఆయన్ని వారిస్తూ "మీ మిత్రులు తమ వ్యవహారాన్ని మీ చేతుల్లో పెట్టారు. మేము కూడా మిమ్మల్ని పెద్దమనిషిగా అంగీకరించాము. ఇక మీరు ఏ నిర్ణయం తీసుకున్నా దానికి యూదులు, ముస్లింలు కట్టుబడి ఉంటారు" అని అన్నారు .

"నేను నా తీర్పులో ఎటువంటి దయాదాక్షిణ్యాలుగాని, పక్షపాతం గాని చూపను. సత్యం, న్యాయం ఆధారంగానే నా తీర్పు ఉంటుంది" అన్నారు సాద్ బిన్ మాజ్ (రజి) .

"మేము కోరేది కూడా అదే" అన్నారు దైవప్రవక్త (సఅసం).

" సరే నేనొచ్చినట్లు వారికి కబురు చేయండి" అన్నారు సాద్ (రజి).

దైవప్రవక్త ఆదేశంతో హజ్రత్ బిలాల్ (రజి) కోట సమీపానికి వెళ్ళి "సాద్

బిన్ మాజ్ వచ్చేశారు. మీ నాయకుడ్ని రమ్మంటున్నారు" అని కేకవేసి చెప్పారు.

కేక వినగానే యూదనాయకుడు కోటద్వారం వద్దకు వచ్చి "మేమాయన్ని కళ్ళారా చూడనంత వరకు బయటికి రాలేము" అని అన్నాడు.

"అంటే ముస్లింలు కూడా మీకు మల్లే అబద్ధాలాడేవారని, వంచకులని భావిస్తున్నారా?" అన్నారు హజ్రత్ బిలాల్ (రజి). ఆ తరువాత ఆయన వెంటనే తిరిగొచ్చి కాబ్ చెప్పింది వివరించారు.

దైవప్రవక్త (స) చిరునవ్వు నవ్వి "వారు తాము ఎటువంటివారో ఎదుటివారు కూడా అటువంటివారేనని భావిస్తున్నారు. సాద్! మీరేమంటారు?" అన్నారు.

"నేనే వెళతాను. నన్నక్కడికి తీసుకెళ్ళండి" అన్నారు సాద్ బిన్ మాజ్.

వెంటనే కొందరు ఆయన పల్లకీ ఎత్తుకెళ్ళి కోట ముఖద్వారం ముందు దించారు. ఒక ముస్లిం యోధుడు ద్వారం దగ్గర నిల్చొని "యూదులారా! ఇదిగో సాద్ వచ్చేశారు. కళ్ళు తెరచి చూడండి" అని అన్నాడు.

కాబ్, ఇతర నాయకులు ఆయన్ని కళ్ళారా చూసి "సాద్! మీరు మమ్మల్ని పిలిపించారా?" అని అడిగారు.

"అవును. నేనే పిలిపించాను. అది సరేగాని మీరు నన్ను మధ్యవర్తిగా అంగీకరించారో లేదో చెప్పండి ముందు."

"మేము మిమ్మల్నే మధ్యవర్తిగా అంగీకరించాం."

"అయితే మీరంతా కోట బయటికి రండి, మీచేత ప్రమాణం చేయించాలి."

"బయటికి వస్తాంగాని మాపై ఏదైనా దౌర్జన్యం జరిగితే దానికి మీరు బాధ్యత వహిస్తారా?" అడిగాడు కాబ్.

"ఒప్పందం ప్రకారం తీర్పు జరగనంత వరకు మీపై ఈగ కూడా వాలదు. ఆ హామీ నేనిస్తున్నాను" అన్నారు హజ్రత్ సాద్ (రజి).

"అయితే ఎవరెవర్ని రమ్మంటారు?"

"మీతో పాటు మీ తెగకు చెందిన ముఖ్య నాయకులంతా రావాలి."

"సరే ఇప్పుడే వస్తాం, ఉండండి" అన్నాడు కాబ్.

ఆ తరువాత కాస్సేపటికి కోట ముఖద్వారం తెరిచారు. కాబ్‌తో పాటు ప్రముఖ యూదనాయకులంతా కోట లోపలి నుండి బయటికి వచ్చారు. హజ్రత్ సాద్ (రజి) వారిని వెంటబెట్టుకొని దైవప్రవక్త (సఅసం) దగ్గరకు తిరిగొచ్చారు.

ఇరు పక్షాలకూ చెందిన ప్రముఖులందరూ ఒక చోట చేరిన తరువాత హజ్రత్ సాద్ (రజి) ముస్లింలను ఉద్దేశించి "మీరు నన్ను మధ్యవర్తిగా అంగీకరిస్తున్నారా?" అని అడిగారు.

దానికి హజ్రత్ ఉమర్ (రజి) సమాధానమిస్తూ "బనూఖురైజా తెగవాళ్ళు మిమ్మల్ని మధ్యవర్తిగా ఎన్నుకున్నారు. దైవప్రవక్త (సఅసం) కూడా దానికి అంగీకరించారు" అని అన్నారు.

ఆ తరువాత హజ్రత్ సాద్ (రజి) కాబ్ వైపుకు తిరిగి "మీరు కూడా నన్ను మధ్యవర్తిగా అంగీకరిస్తున్నారా?" అని ప్రశ్నించారు.

"అవును, నేను, మా తెగనాయకులంతా మిమ్మల్ని మధ్యవర్తిగా, పెద్ద మనిషిగా అంగీకరిస్తున్నాము" అన్నాడు కాబ్.

"అయితే నేనిప్పుడు మీ అందరి చేత వాగ్దానం చేయించదలిచాను" అన్నారు సాద్ (రజి) దైవప్రవక్త (సఅసం)తో.

"దానికి మేమంతా సిద్ధంగా ఉన్నాము" అన్నారు దైవప్రవక్త (సఅసం).

"అందరికంటే ముందు నేను నా తెగప్రముఖులచే వాగ్దానం తీసుకోదలిచాను. మిత్రులారా! దేవుడు మన మాటలన్నీ వింటున్నాడనే పూర్తివిశ్వాసంతో నా తీర్పును అంగీకరిస్తామని వాగ్దానం చేయండి" అన్నారు సాద్ తన తెగవారితో.

" మీ తీర్పును శిరసావహిస్తామని మేము వాగ్దానం చేస్తున్నాం" అన్నారు వారంతా ముక్తకంఠంతో.

ఈ విధంగా హజ్రత్ సాద్ (రజి) అప్పుడక్కడ చేరిన తెగలన్నిటితో వాగ్దానం చేయించుకున్నారు. దైవప్రవక్త (సఅసం) కూడా సాద్ (రజి) తీర్పును శిరసావహిస్తా మని వాగ్దానం చేశారు. బనూఖురైజా తెగ కూడా వాగ్దానం చేసింది.

"తీర్పు వినిపించే ముందు నేను కొన్ని విషయాలు అడగదలచుకున్నాను. మీరు వాటికి సరైన సమాధానాలు చెప్పాలి" అన్నారు సాద్(రజి) కాబ్ నుద్దేశించి.

" ఉన్నదున్నట్లు చెబుతానని వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు కాబ్,

"మీరు, మీ జాతి ప్రజలు దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం)తో ఏదైనా ఒడంబడిక కుదుర్చుకున్నారా?"

"ఆ.. మేము ముహమ్మద్‌తో ఒప్పందం చేసుకున్నాము" అన్నాడు కాబ్.

" ఆ ఒప్పందం ప్రకారం మీకు పూర్తిగా మతస్వేచ్ఛ ఇవ్వబడిందా"?

"ఇవ్వబడింది."

"మీకు రక్షణ కల్పిస్తామని వారు వాగ్దానం చేశారా?"

" అవును, మాకు రక్షణ కల్పిస్తామని వాగ్ధానం చేశారు."

"మదీనాపై ఎవరైనా దండెత్తితే మీరు ముస్లింలకు సహకరిస్తామని ఆ ఒప్పందంలో మీరు వాగ్దానం చేశారా?"

"అవును చేశాము."

" బనూనజీర్ తెగ నమ్మక ద్రోహానికి పాల్పడినందున దాన్ని బహిష్కరించి నప్పుడు మీరు మళ్ళీ దైవప్రవక్తతో ఒప్పందం చేసుకున్నారా?"

"అవును మేము మళ్ళీ ఒప్పందం చేసుకున్నాము."

"కాని మక్కా ఖురైషీయులు మదీనా పై దండెత్తినప్పుడు మీరు ముస్లింలకు సహకరించ లేదు. అది ఒప్పందాన్ని ఉల్లఘించినట్లు కాదా?" నిలదీశారు హజ్రత్ సాద్ బిన్ మాజ్ (రజి).

నిజమే. మేము సహకరించలేక పోయాం. దానికి మేమెంతో విచారిస్తున్నాం."

"బనూనజీర్ నాయకుడు హుయ్యాకి మీరు రాజకీయ ఆశ్రయం ఇచ్చారా?"

"ఏదో ఆయన మా దగ్గరికి వచ్చాడు. చుట్టరికం వల్ల మేమతన్ని కాదనలేక పోయాం."

" మీరు కందకం యుద్ధంలో ముస్లింలను వ్యతిరేకించారా?"

"మేము ముస్లింలపై దాడి చేయలేదు."

"ముస్లిం స్త్రీలు, పిల్లలున్న ఫారిగ్ కోటపై మీరు దాడిచేశారు కదా? మరి దాని సంగతేమిటి?"

"నిజమే మాలో కొందరూ తల తిక్కమనుషులు ఫారిగ్ కోటపై దాడి చేసిన మాట వాస్తవమే. దాని క్యూడా మేము చింతిస్తున్నాము."

"మరిప్పుడు మీరు ముస్లింల నుండి ఏమి ఆశిస్తున్నారు."

"వారు మమ్మల్ని క్షమిస్తారని ఆశిస్తున్నాం."

"ఒక వేళ మీరు ఫారిగ్ కోటను జయించినట్లయితే ముస్లిం స్త్రీల పట్ల మీ ప్రవర్తన ఎలా ఉండేది?"

"వారిని మా దాసీలుగా చేసుకొనే వాళ్ళం. కాని అలా జరగ లేదుగా!"

"సరే ఇస్రాయీల్ సంతతి ప్రజలారా! ముస్లిములారా! ఇక నా తీర్పు వినండి" అన్నారు హజ్రత్ సాద్ (రజి).

ఒక్కసారిగా సభలో నిశ్శబ్దం ఆవరించింది. ప్రజలంతా గంభీరవదనులై ఆయనిచ్చే తీర్పుకోసం ఉత్కంఠతతో ఎదురుచూడసాగారు. యూదులు సాద్ (రజి) తీర్పు మీద కొండంత ఆశపెట్టుకొని కూర్చున్నారు. ముస్లింలు సాద్ వైపే తదేకంగా చూడసాగారు. సాద్ (రజి) తెగవారయిన అవస్ ప్రజలలో కొందరు ఆయన చెవి దగ్గరకు వంగి గుసగుసలాడుతూ బనీఖురైజా తెగయూదుల్ని ఈ సారికి క్షమించి వదలిపెట్టండి" అని మనవి చేశారు. హజ్రత్ సాద్(రజి) దానికి సమాధానం ఇవ్వకుండా నిశ్శబ్దాన్ని చీలుస్తూ గంభీరంగా ఇలా అన్నారు:

" సోదరులారా! మీరు కాబ్‌కు, నాకు మధ్య జరిగిన సంభాషణ విన్నారు. ఈ సంభాషణను బట్టి బనూఖురైజా తెగయూదులు ఒప్పందాన్ని ఉల్లంఘించి నట్లు కూడా మీరు తెలుసుకున్నారు. నేను కూడా బనూఖురైజా తెగవాళ్ళు ఒప్పందాన్ని ఉల్లంఘించి మిత్రద్రోహానికి పాల్పడ్డారని భావిస్తున్నాను. కాబట్టి వారి మిత్రద్రోహం, తిరుగుబాటు వైఖరులకు శిక్షగా వారి పురుషులందర్నీ హతమార్చాలి. వారి స్త్రీలను, పిల్లలను యుద్ధఖైదీలుగా చేసుకోవాలి. వారి ఆస్తిపాస్తుల్ని ముస్లింలకు పంచడం జరగాలి. ఇదే నా తీర్పు."

ఈ తీర్పు వినగానే యూదుల గుండెలు గుభేలుమన్నాయి. వారి నెత్తిమీద పిడుగు పడినట్లయింది. ముస్లింలు కూడా నిర్ఘాంతబోయారు. ఇక యూద నాయకుడు కాబ్ గురించి చెప్పనవసరంలేదు. అతను తీవ్రమైన భీతావహంతో స్పృహతప్పి పోయాడు. అతని అనుచరులు కొందరు లేచి చన్నీళ్ళు తెచ్చి అతని ముఖంపై చిలికించారు. కాస్సేపటికి కాబ్‌కు స్పృహ వచ్చింది. అతని చుట్టూ నిల్చున్న అతని సహచరులు మృత్యుభయంతో కంపించి పోసాగారు.

వారిలో ఒకడు తన అసహనాన్ని వెలిబుచ్చుకుంటూ "కాబ్ ! నువ్వు మమ్మల్ని మృత్యు కోరల్లోకి నెట్టివేశావు" అన్నాడు.

"పొరబడుతున్నావు. ముహమ్మద్‌ని హతమార్చుదామని, ముస్లింలను మదీనా నుండి తరిమివేద్దామని మీరే నాకు మాటిమాటికి సలహా ఇస్తుండేవారు. ఇప్పుడు నామీద నిందవేస్తున్నారు" అన్నాడు కాబ్ బాధాతప్త హృదయంతో.

"సరే, నువ్వు సాద్ బిన్ మాజ్‌ని మధ్యవర్తిగా ఎందుకు అంగీకరించావు?" అన్నాడు మరొకడు మండిపడుతూ.

" ఇది కూడా మీరిచ్చిన సలహాయే. సాద్ (రజి) అవస్ తెగనాయకుడు. ఆ తెగతో మనకు ఎల్లప్పుడూ స్నేహసంబంధాలు ఉంటూ వస్తున్నాయి. కనుక సాద్ మనల్ని తప్పకుండా ఆదుకుంటాడని మీరే కదా అన్నది! అందువల్లనే నేను అతని మధ్యవర్తిత్వాన్ని ఒప్పుకున్నా."

"ఇప్పుడు మనం ఒకర్నొకరు నిందించుకోవడం వృధా ప్రయాస. ప్రాణాలు దక్కించుకునే మార్గం ఏదయినా ఉంటే చూడండి. బనూ ఖైనుఖా, బనూనజీర్ తెగలు మదీనా నుంచి బహిష్కరించబడ్డారు. అలాగే మనల్ని దేశబహిష్కరణ శిక్షతో వదలిపెడ్తారేమో చూడండి" అన్నాడు వేరొకడు.

"మధ్యవర్తికి మనవి చేసుకుందాం. ఆయన దయదలచి ఈ తీర్పును పునఃపరిశీలిస్తారేమో కనుక్కోండి" అన్నాడు మొదటివాడు మళ్ళీ.

"ఇప్పుడు మనకు ఒకేఒక దారి ఉంది. మన ఆస్తిపాస్తులన్నీ ఇచ్చేసయినా సరే వారి కాళ్ళావేళ్ళా పడి మన ప్రాణాలు, మన భార్యపిల్లల ప్రాణాలు దక్కించుకుందాం" చెప్పాడు రెండోవాడు.

"మన ఆస్తిపాస్తులంటూ ఇక ఎక్కడున్నాయి? అవి ఈ తీర్పుతో ముస్లింలకు హస్తగతమయి పోయాయి" అన్నాడు కాబ్ ఢీలా పడిపోయి.

"ఇప్పుడా మీరు విచారించేది! ఒప్పందం ఉల్లఘించి తిరుగుబాటుకు పాల్పడినప్పుడు దాని పర్యవసానం ఏమవుతుందో మీకు గుర్తుకు రాలేదా? దుర్మార్గులారా! మీరు ముస్లింలు అల్పసంఖ్యలో ఉన్నారని, బలహీనంగా ఉన్నారని, వారిని నామరూపాల్లేకుండా తుడిచిపెట్టవచ్చని కలలుగన్నారు. వారి రక్షకుడు, సర్వశక్తివంతుడయిన దేవుడన్న ఆలోచన మీకు తట్ట లేదా? ఇప్పుడు ఎందుకీ ఏడ్పు" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి) పుండు మీద కారం చల్లినట్లు.

"ఉమర్! నీవు చెప్పింది నిజమే. పాపమంతా మాదే. మేము హుయ్యి మాటలు విని మక్కా ఖురైషీయుల వలలో పడిపోయాము. ఇప్పుడు మీరు మాకు ప్రాణభిక్ష పెడితే ఇకముందు ఎన్నటికీ మీజోలికి రామని నేను వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు కాబ్.

"ముస్లింలను రెండుసార్లు మోసం చేయడం సాధ్యకాదు. ఇది వరకు మీ జాతి తెగలను కనికరిస్తే చేసిన మేలుమరచి మళ్ళీ ద్రోహం తలపెట్టాయి. ఇప్పుడు మిమ్మల్ని కూడా వదలిపెడ్తే మీరూ అదేవిధంగా ద్రోహం తలపెడ్తారు" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి).

"మేము ప్రమాణం చేస్తున్నాం. ఇక ముందెన్నడూ మీకు ద్రోహం తలపెట్టడం గాని, ఒప్పందం ఉల్లంఘిచడంగాని చేయము. మా మాట నమ్మండి" అన్నాడు వారిలో ఒకడు.

"యూదులారా! వినండి. మీరు జన్మతః దైవప్రవక్త (సఅసం) పట్ల కసి, ప్రతీకారం పెంచుకున్న పరమ దౌర్భాగ్యులు. మీకు ప్రాణభిక్ష పెడితే వీలు చిక్కినప్పుడు మీరు ప్రమాణభంగం చేసి కుట్రలు పన్నడానికి ఏమాత్రం వెనుకాడరు. మీ ఆగడాలకు శిక్ష పడింది. ఇక నోరు మూసుకోండి" అన్నారు హజ్రత్ సాద్ బిన్ మాజ్ (రజి).

"అనుచరులారా ! ఇక కోటలోకి ప్రవేశించి దాన్ని అదుపులోకి తెచ్చుకోండి. అందులోని ధన ధాన్యాలను, ఇతర సామగ్రిని స్వాధీనం చేసుకోండి. లోపలున్న వారందర్నీ బంధించి తీసుకురండి" అన్నారు దైవప్రవక్త (సఅసం).

ఈ ఆజ్ఞ వినగానే అయిదొందల మంది ముస్లింయోధులు కోటలోకి జొరబడి దాన్ని అదుపులోకి తీసుకున్నారు. తరువాత లోపలున్న వారందర్నీ బంధించడం ప్రారంభించారు. కోటలోపల ఓ మూలన మృత్యుభయంతో వణికిపోతున్న హుయ్యాని కూడా బంధించారు. అందర్నీ బంధించి బయటికి తీసుకొచ్చారు. అప్పుడు హుయ్యి ముఖం పూర్తిగా పాలిపోయి ఉంది.

హజ్రత్ ఉమర్ (రజి) అతడ్ని చూసి "హుయ్యి ! నిన్ను, నీ తెగవాళ్ళను దేశ బహిష్కరణ చేస్తున్నప్పుడు ఇక ముందెప్పుడూ నీవు దైవప్రవక్త (సఅసం)ను విరోధించమని వాగ్దానం చేయలేదా?" అని అడిగారు.

"చేశాను. ఆ వాగ్దాన భంగం నేరానికి మరణశిక్ష పడుతుందని నాకు విచారం కూడా లేదు. కాని వాగ్దాన భంగంచేశానే అని విచారిస్తున్నాను. దానికి దేవుడు నాకు తగిన శిక్షే విధించాడు" అన్నాడు హుయ్యి.

" దైవద్రోహీ! నీవు నన్ను వ్యతిరేకించావు. నా మీద కత్తికట్టావు. ప్రతీకారంలో హద్దు మీరిపోయావు. దానికి తగిన శిక్ష లభించింది" అన్నారు దైవప్రవక్త (స).

"నేను ఇప్పటికీ మిమ్మల్ని దైవప్రవక్తగా భావించడం లేదు. మీరు హాషిం సంతతిలో పుట్టారు. చివరి దైవప్రవక్త ఇస్రాయీల్ సంతతిలో జన్మిస్తాడు" అన్నాడు హుయ్యి.

"నీవసలు నేను అందజేసిన సందేశాన్ని కాదు, ఇబ్రాహీం, మూసా ప్రవక్తల (అలైహి) సందేశాన్ని నిరాకరించావు. అంతిమ దైవప్రవక్త ఇస్రాయీల్ సంతతిలో ఉద్భవిస్తాడన్న విషయం తౌరాత్‌లో లేదని నీకు బాగ తెలుసు. తెలిసి కూడా నీవు నన్ను వ్యతిరేకించడం శోచనీయం" అన్నారు దైవప్రవక్త (సఅసం).

దానికి హుయ్యి మారుమాట్టాడలేదు. ఆ తరువాత పురుష ఖైదీలందర్నీ వధించమని హజ్రత్ సాద్ (రజి) ఆజ్ఞాపించారు. ఈవిధంగా ఏడొందల యాభై మంది పురుషుల్ని వధించడం జరిగింది.

అందరికంటే చివర్లో కాబ్ వంతు వచ్చింది. రీహానా తండ్రి దుస్థితి తలచు కుంటూ కన్నీరు మున్నీరుగా విలపించసాగింది.

సుహైల్ ఆమె దగ్గరికెళ్ళి ఓదార్చుతూ "రీహానా! నీవు ముస్లింలకు ఎంతో

మేలు చేశావు. ఇప్పుడు నీవు నీ తండ్రి ప్రాణాలను కాపాడాలనుకుంటే చెప్పు నేను దైవప్రవక్త (సఅసం)కు సిఫారసు చేస్తాను" అని అన్నాడు.

"మా జాతి అంతా నాశనమయిపోయింది. మానాన్న మహామొండి మనిషి. ప్రాణభిక్షను ససేమిరా కోరడు" అన్నది రీహానా దుఃఖిస్తూనే.

దాంతో చివరికి కాబ్‌ని కూడా వధించారు ముస్లింలు. స్త్రీలను, పిల్లలను ఖైదీలుగా పట్టుకున్నారు. యూదుల ఆస్తి పాస్తులన్నిటిని స్వాధీనం చేసుకున్నారు. వాటిని ముజాహిద్‌లకు పంచిపెట్టడం జరిగింది. తరువాత ముస్లింలు విజయ దరహాసంతో మదీనాలో ప్రవేశించారు.

ముస్లింలు బనూఖురైజా యూదుల కోటను ఆక్రమించుకున్నారని, వారి పురుషులందర్నీ వధించి, వారి స్త్రీలను ఖైదీలుగా పట్టుకున్నారని తెలుసుకొని కపటవిశ్వాసులు తెగబాధపడి పోయారు. వారి నాయకుడు అబ్దుల్లా బిన్ ఉబై అయితే పూర్తిగా నిరాశకు గురయి ముఖం మాడ్చుకున్నాడు.

బనూఖురైజా యూదులు దైవప్రవక్త (సఅసం)తో చేసుకున్న స్నేహఒప్పందం ఉల్లంఘించి అవిశ్వాసులతో కుమ్మక్కయి కుట్రలు పన్నుతున్న అతి క్లిష్ట సమయంలో రీహానా ముస్లింలకు చేసిన సహాయం మరువలేనిది. అయితే ఈ విషయం దైవప్రవక్త (సఅసం)కు ఆ తరువాత కొన్నాళ్ళకు తెలిసింది. అలాంటి మంచి అమ్మాయిని ఖైదీగా పట్టుకొని బానిస స్త్రీగా చేయడం పట్ల ఆయన ఎంతో విచారం వెలిబుచ్చారు. అందుకు ఆయన క్షమాపణ చెప్పుకొని తక్షణమే ఆమెకు బానిసత్వం నుండి విముక్తి కలిగించారు.

దాంతో రీహనా ఎంతో ప్రభావితురాలయి మనస్ఫూర్తిగా ఇస్లాం ధర్మం స్వీకరించింది. ఆ తరువాత ఆమె తన బంధువర్గంతో కలసి ప్రశాంత జీవితం గడపసాగింది.

(సమాప్తం)